# సాహిత్య వ్యాసాలు

డా॥ రావి భారతి

చంద్రం బిల్డింగ్స్




విజయవాడ - 4

సాహిత్య వ్యాసాలు : డా॥ రావి భారతి

ప్రచురణ సంఖ్య : 1104

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1985

**SAHITYA VYASAALU**
**By Dr. Raavi Bharati**
First Edition : February 1985
Copies : 1000

**PRICE : Rs. 10-00**

*Copies available at :*

**VISALAANDHRA PUBLISHING HOUSE**
Chandram Buildings, Vijayawada-520 004

**VISALAANDHRA BOOK HOUSE**
Vijayawada, Visakhapatnam, Guntur, Hyderabad, Anantapur, Tirupati, Hanmakonda.

Balaji Printing Press, Vijayawada - 520 014

# అంకితం



మా అమ్మ శ్రీమతి రావి సీతాదేవి,

మా బాపు శ్రీ రావి నారాయణరెడ్డికి

— భారతి

# ఇదీ వరుస ...

# ముందుమాట

పాఠక సహృదయులకు నమస్కారం. 'సాహిత్య వ్యాసాలు' పేరుతో వెలుగు చూస్తున్న ఈ చిన్న పుస్తకం వివిధ సాహిత్య సాంఘిక వ్యాసాల సంకలనం. అక్కడక్కడా వివిధ సమావేశాల్లో నేను చేసిన ప్రసంగాలే ఈ పుస్తకం ఎప్పట్నుంచో నా ప్రసంగాలను పుస్తక రూపంగా తీసుకురావాలనే నా అభిలాష నేటికి తీరింది

ఇందులో కొన్ని సాహిత్య వ్యాసాలు, కొన్ని సాంఘిక వ్యాసాలు వున్నాయి. ప్రసంగాలకు అక్షరరూపం ఇవ్వడంలో కొన్ని మార్పులు చేయక తప్పలేదు ఈ వ్యాసాలకు భావస్ఫూర్తిని కల్గించిన పుస్తకాలు చాలా వున్నాయి. వాటిని ఆయా వ్యాసాల చివర పేర్కొన్నాను. ఆ గ్రంథకర్తలకు నా కృతజ్ఞతలు.

పెద్దలు దేవులపల్లి రామానుజరావుగారు ఈ వ్యాస సంకలనంకు తొలిపలుకు రాశారు. వారికీ, ఈ పుస్తకం ప్రచురిస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికీ నా కృతజ్ఞతలు.

—డా॥ రావి భారతి

# తొలి పలుకు

తెలుగు భాష ఆధునిక కాలంలో సర్వతోముఖ వికాసం పొందుతున్నది. జాతీయ అంతర్జాతీయ స్థాయిలో తన ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొని నిలుపుకోవడానికి ప్రయత్నిస్తున్నది. ఇదంతా ఆంధ్ర భాషా వికాసాన్ని అభిలషించేవారికి ఆనందకరమైన పరిణామం. నేటి తెలుగు భాషా వికాసాన్ని కొంత సూక్ష్మంగా పరిశీలించినప్పుడు సమాలోచనాత్మకమైన వాఙ్మయంలో వేస్తున్న ముందుడుగు సృజనాత్మక సాహిత్య వ్యాసంగంలో వేస్తున్న ముందడుగుతో సరితూగుతున్నట్లు కనిపించదు. ఈ రంగంలో కూడా ఆధునిక కాలానుగుణంగా ప్రగతిని సాధించినప్పుడే తెలుగు భాష వికాసం సరియైన మార్గంలో పురోగమించగలదు.

సమాలోచనాత్మకమైన వాఙ్మయ నిర్మాణానికి ప్రతిభతోపాటు వ్యుత్పత్తి కూడ మిక్కిలి అవసరం. ఈ రెండింటితో పాటు దేశ సమస్యలను గూర్చి తగినంత పరిజ్ఞానం, సరియైన ఆలోచన మిక్కిలి ఆవశ్యకం. ఇటువంటి శక్తి సామర్థ్యాలు కలిగిన రచయితల సంఖ్య ఎక్కువగా లేదని చెప్పక తప్పదు సమాలోచనాత్మకమైన వాఙ్మయ నిర్మాణానికి కావలసిన ప్రజ్ఞాపాటవాలు కలిగిన కొద్దిమందిలో డాక్టర్ రావి భారతిగారిని ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. ఆమె ఎం. ఎ. పి. హెచ్. డి. పట్టభద్రురాలైన ఉన్నత విద్యా పారీణ. తాను ఆర్జించిన విద్యకు తగిన సంస్కృతి కలిగి బహు గ్రంథావలోకనం చేసిన విదుషీమణి. సాహిత్యంతోపాటు చరిత్ర, సంస్కృతిని గూర్చిన విజ్ఞానం ఆమెలో తగినంత కలదు. కళాశాలలో ఉపాధ్యాయ వృత్తిని నిర్వహిస్తున్న డాక్టర్ రావి భారతిగారు మంచి వక్త, ఉత్తమ వచన రచయిత్రి. అందుచేత సమాలోచనాత్మకమైన వాఙ్మయ నిర్మాణానికి ఆమె కలం సర్వవిధాలయోగ్యమైనదని యీ గ్రంథం నిరూపిస్తున్నది.

ఈ గ్రంథంలోని వ్యాసాలను రెండు భాగాలుగా మనం విభజించవచ్చును. మొదటిది ప్రాచీన వాఙ్మయానికి సంబంధించినది. రెండవది ఆధునిక వాఙ్మయానికి-విశేషించి రచయిత్రుల సాహిత్యానికి సంబంధించినది. ఈ వ్యాసాలను పరిశీలించినప్పుడు ఆంధ్ర సారస్వతాన్ని గూర్చిన ఆమె సమగ్ర దృక్పథం సరియైన అవగాహన, సామాజికపరమైన ఆలోచన మనకు స్పష్టంగా కనిపిస్తున్నవి. నన్నయ భారతంలోని కొన్ని సాంఘికాంశాలు, నన్నయ తెలుగు దేశాభిమానం, నన్నయ సూక్తులు, సాంఘిక రాజకీయ ఆర్థిక మత నైతిక నేపథ్యంలో శ్రీనాథుడు. పోతన తెలుగుదనం, ప్రబంధ సాహిత్యంలో స్త్రీ అన్న శీర్షికలు ఇందుకు నిదర్శనాలు.

ఈ వ్యాసాలలో డాక్టర్ భారతిగారి సామాజిక దృక్పథం స్పష్టంగా కనిపిస్తున్నది. ప్రాచీన కవుల రచనలను ఆధునిక దృక్పథంతో ఆమె ప్రతిభావంతంగా పరిశీలించినారు.

రెండవ భాగమైన ఆధునిక వాఙ్మయానికి సంబంధించిన వ్యాసాల శ్రేణిలో రచయిత్రుల నవలలో శాస్త్రీయ దృక్పథం, సామాజిక స్పృహ అనే వ్యాసాలలో రచయిత్రి విమర్శనా పాటవం నేటి కాలానికి అనుగుణమైన విశిష్ట దృక్పథం మనకు గోచరిస్తున్నది.

డాక్టర్ రావి భారతిగారు అప్పుడప్పుడు చేసిన సాహిత్యోపన్యాసాలతోపాటు పత్రికలకు వ్రాసిన వ్యాసాలు యీ గ్రంథంలో చేరినవి. భారతిగారు తమ వ్యాసాలలోను, ఉపన్యాసాలలోను వెల్లడి చేసిన అభిప్రాయాలకు ఆధారపూరితమైన గ్రంథాలను పేర్కొన్నారు ఇది చాల సమంజసమైన పద్ధతి. సమాలోచనాత్మకమైన వాఙ్మయ రచనకు బహు గ్రంథావలోకనంతోపాటు ప్రగాఢమైన ఆలోచనాశక్తి, సరసమైన సమన్వయ దృక్పథం మిక్కిలి ఆవశ్యకాలు. ఈ యోగ్యతలన్నీ డాక్టర్ రావి భారతిగారి ప్రత్యేకతలని ఇందులోని వ్యాసాలు వెల్లడి చేస్తున్నవి. డాక్టర్ భారతిగారి శైలి సరళమై, సుబోధకమై మనోజ్ఞంగా ఉన్నవి. పరిమాణంలో కొంచెమైనప్పటికిని, గుణంలో మేలి రకానికి చెందిన ఈ వ్యాసాలు తెలుగు సాహిత్య విమర్శనా రంగంలో డాక్టర్ రావి భారతిగారి ప్రతిభా సంపదను ఉజ్వలమైన భవిష్యత్తును నిరూపిస్తున్నవి

ఈ పుస్తకంలోని వ్యాసాలను పరిశీలించినప్పుడు ఒక మంచి తెలుగు సాహిత్య చరిత్రను డాక్టర్ భారతిగారు రచించవలెననే కోరిక నాకు కలిగినది. ఈ కోరిక ఆమె నెరవేర్చగలదని విశ్వసిస్తున్నాను ఏమి వ్రాసినప్పటికిని అందుకు కావలసిన వివరాలు సేకరించి ఇంతవరకు ప్రకటితమైన గ్రంథాలను పరిశీలించి సరియైన అవగాహనతో ప్రామాణికంగా రచన చేయగల శక్తి డాక్టర్ రావి భారతిగారికి ఉన్నదనడానికి ఇందులోని వ్యాసాలు సాక్ష్యాలు డాక్టర్ రావి భారతిగారు ఇంకను విమర్శనాత్మకమైన రచనలు అనేకం వ్రాసి తెలుగు పరిశోధక ప్రపంచంలో ఉన్నత శ్రేణిని అలంకరించవలెనని నా కోరిక. ఇంత మంచి గ్రంథాన్ని ఆంధ్ర పాఠకలోకానికి అందజేసిన డాక్టర్ రావి భారతిగారికి నా శుభాకాంక్షలు ఆంధ్ర పాఠకలోకం పక్షాన ఈ సమాలోచన గ్రంథానికి హృదయపూర్వకమైన సుస్వాగతం.

దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షుడు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు,
తేది : 28-2-'85.

# నన్నయ భారత భాగంలోని కొన్ని సాంఘికాంశాలు

ఆంధ్ర సాహిత్యాకాశంలో తొలి తెలుగు వెలుగుల్ని విరజిమ్మిన దివాకరుఁడు నన్నయభట్టు. దాదాపు వేయి సంవత్సరాల క్రితం తెలుగు భాషకు ఒక ఉనికిని వ్యక్తిత్వాన్ని ప్రసాదించిన నన్నయ్యభట్టు తన భారత రచన ద్వారా సాంఘిక పరమైన కొన్ని అమూల్యమైన అభిప్రాయాల్ని వెలిబుచ్చాడు.

సామ్యవాదం, సర్వసమానత్వం-వీటి గురించి మాట్లాడటం నేడు ఒక నాగరికతా చిహ్నం. ప్రకృతి సిద్ధంగా దేశంలో నెలకొనివున్న సంపద అంటే నీరు, భూమి మొదలైనవి ఏదో ఒక వర్గం యొక్క అధీనంలో వుండడానికి వీలులేదనీ, వాటిని అనుభవించే అర్హత అందరికీ వుంది అనే సూత్రమే సర్వ సమానత్వానికి నాందిగా ఈనాడు పరిగణిస్తున్నారు. ఇలాంటి అభిప్రాయమే నన్నయ భారతంలో కనిపించడం విశేషం. ధర్మజాదులు తీర్థయాత్రలు చేస్తున్న సందర్భంలో బదరీవనంలో ఆరు దినాలుండడం తటస్థించింది. ఒక రోజు భీముడు, ద్రౌపది గంధమాదన పర్వత సాను చరియల్లో చరిస్తున్నారు. అంతలో సౌగంధికమనే పేరుగల "లలిత సహస్ర పత్ర కమలం" వాయు తాడితమై ద్రౌపది ముందు పడింది. దాని అపూర్వ సౌరభానికామె సంబరపడి పోయింది. ఒక్క పువ్వుతో ఆమె తృప్తి చెందలేదు. పెక్కు పుష్పాలు కావాలని కోరింది. ద్రౌపదికి పూలంటే చాలా ఇష్టం. మాల్యవంతంలో విహరిస్తున్నప్పుడు కూడా "పంచవర్ణ సురభి కుసుమాలు" కావాలని కోరి భీమున్ని చిక్కుల్లో పడవేసింది. ఆ పూల కోసం యక్ష రాక్షసులతో యుద్ధం చేయక తప్పలేదు ఇప్పుడు కూడా ఆమె కోర్కెను మన్నించి సౌగంధిక సరోవరానికి బయలుదేరి వెళ్ళాడు. అది కుబేరుని వనం. ఆ సరోవరం కూడా కుబేరునికి సంబంధించిందే. కనుక కుబేరుని ఆజ్ఞ లేకుండా ఆ సరోవరాన్ని సమీపించ కూడదని రక్షకులైన రాక్షసులు అంటే భీముడిట్లన్నాడు.

గిరి నిర్ఝరములఁ బుట్టిన
సరోవరంబిదియు సర్వసామాన్యముగా
కరుదుగ నొక్కని యదియే
పరఁగఁ గుబేరుండు దీనిఁ బడసనె మొదలన్

ఉత్తమ క్షత్రి యుండేల యొరుల నడిగి
వేడువాడగుఁ దన భుజా విక్రమమున
నన్యధనము లుపార్జించి యర్థిజనుల
కిచ్చుఁ గీర్తి దిక్కుల వెలయించుఁగాక

ఇంతకంటే అభ్యుదయ వాదానికి పరాకాష్ఠ ఇంకొకటి కనుపించదు. భీము డొక అభ్యుదయ వాది లాగా మనకు గోచరిస్తాడు. అన్యుల ధనాలను వారి అంగీ కారం ఉన్నా లేకపోయినా భుజబలాన్ని ఉపయోగించి అర్థాన్ని లాగుకొని అర్థిజనుల కీవ్వడం, తద్వారా సంపదల్ని సర్వజన సామాన్యం చేయడం భీముని లక్ష్యంగా కనిపి స్తున్నది. సరిగ్గా ఈ ఘట్టాన్ని పోలిన సందర్భం మనకు ముక్కు తిమ్మన పారి జాతాపహరణంలో కనిపిస్తుంది. సత్యభామ కృష్ణున్ని వెంటపెట్టుకొని స్వర్గానికి వెళ్ళి ఇంద్రాదుల ఆతిధ్యాన్ని స్వీకరించి, ఎవ్వరి అంగీకారాన్ని పొందకుండానే నందనోద్యాన ముఖద్వారం దగ్గరకు వెళ్ళింది. అక్కడి ఉద్యాన పాలకులు ఆమెను అడ్డగిస్తే ఇలా అన్నది.

"వినుడు ! సురేశ్వర వనపాలకులు! వార్ధిఁబొడమిన యీదివ్య భూరుహమున కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వడు" అని సవాల్ చేసి భర్తచేత బలవంతంగా పెరి కించుకొని పోయింది. వేమన కూడా ఇలాంటి భావానికి ఊపిరిపోయడమేకాదు, తన సొమ్మేకాదు పరులసొమ్ము కూడా దానమివ్వడం గొప్ప అన్నాడు. వారిద్దరికంటే రెండాకు లెక్కువే చదివాడు మరి !

"తనదు సొమ్ము జూడదానమియ్యగ వచ్చు
అవని దొడ్డగాద దెవరికైన
అదురు బెదురు లేక యన్యుల సొమ్ముల
దాన మిచ్చువాడు దాత వేమ"

ఈ పద్యం ప్రక్షిప్తం కాకపోతే తీవ్రవాదిగానే వేమనను పరిగణించవలసి వస్తుంది. ప్రక్షిప్తంగా భావించిన కొందరు "దానమిచ్చు పేటితగవు వేమ" అని దిద్ది దాని అర్థాన్నే మార్చివేసినట్లు కొందరంటారు. దిద్దినా దిద్దకపోయినా మనకా సందేహ మక్కర లేదు. దుర్మార్గుల ధనాల్ని అపహరించి సన్మార్గంలో వెచ్చించ వచ్చునని మనుస్మృతి మనకు చాటుతున్నది.

"యో౽ సాధుభ్యోర్థ మాదాయ
సాధుభ్య స్సం(ప్రయచ్ఛతి
సకృత్వాప్లవ మాత్మానం
సంతారయతి తావుభౌ" ( మను స్మృతి : 11-21 )

భీముడొక చైతన్యవంతుడు. ఒక నిప్పుకణం తనను తాను వెలిగించు కుంటూ ఇతర వస్తువులను వెలిగించడం దాని స్వభావం. అదే విధంగా చైతన్య వంతుడయిన మానవుడు తాను మాత్రం చైతన్య వంతుడవడంతో తృప్తి చెందక ఇతరుల్ని చైతన్య వంతులుగా మార్చడానికి ప్రయత్నిస్తాడు. లేకపోతే చరిత్రలో ఇన్ని ఉద్యమాలు సంభవించేవే కావు. అతి మంచితనంతో నిర్వీర్యుడుగా జీవితాన్ని గడుపుతున్న ధర్మరాజులో పురుషకారాన్ని ప్రేరేపించడానికి ప్రయత్నించాడు. తన ప్రయత్న మంటూ ఏమీ లేకుండా ధర్మంపైనే ఆధార పడడం నిర్వేదపరుని లక్షణం అంటాడు భీముడు.

"బాహు బలము మెఱసి పరుల సంపదలు సే
కొనఁగ లావులేని కుత్సితుండు
నియత దుఃఖ వృత్తి నిర్వేద పరుఁడగు
గాక నీకుఁ దగునె కౌరవేంద్ర."

అంటూ క్షత్రియధర్మాన్ని ప్రబోధించాడు. ప్రజాశక్తి పట్ల భీముడికి ప్రగాఢ మైన విశ్వాసమున్నట్లుగా కనిపిస్తుంది. ప్రజలే తెగబడితే జరగని పని అంటూ లోకంలో వుండబోదని అతని విశ్వాసం. ధర్మరాజుకు ఇలాంటి విశ్వాసం లేదు. ధర్మరాజులో నిర్వేదమే కాకుండా ఒక విధమైన ఆత్మన్యూనతా భావం కూడా ఉంది. కౌరవులు బలవంతులు. తమంతట తామే వారితో తలపడితే అవమానాన్ని పొందవలసి వస్తుందేమో! ఇది ధర్మరాజు సంకోచం. ఆ సంకోచాన్ని భీముడు నివృత్తి చేశాడు.

"బలము గలవానిఁ బలువురు బల విహీను
లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి
మధువుగొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకర కులము నట్లు."

ప్రసిద్ధమైన సుమతి శతకం కూడా ఇదే బోధిస్తున్నది.

"బలవంతుడ నాకేమని పలువురతో నిగ్రహించి
పలుకుట యేలా, బలవంతమైన సర్పము చలి
చీమల చేతఁజిక్కి చావదె సుమతీ."

కొందరు లోక కళ్యాణానికై భీముని లాగా ఆర్భాటం చేస్తే మరికొందరు దధీచిలాగా నిశ్శబ్దంగా ప్రాణత్యాగం చేయగల నిస్వార్థ జీవులుంటారు. ఒక కొవ్వొత్తి తనను తాను క్షీణింప చేసుకొంటూ ప్రపంచానికి వెలుగు ప్రసరింప చేస్తుంది. దధీచి కొవ్వొత్తి లాంటివాడు. అజుని ఆదేశంతో వృత్రుడనే రాక్షసున్ని చంప డానికి దేవతలందరూ వజ్రాయుధ నిర్మాణానికై అతని అస్థిచయాన్ని కోరవలసి వచ్చింది. అయినా దధీచి సంకోచించలేదు: తన ప్రాణత్యాగంచేసి ముక్కోటి దేవతల ప్రాణాల్ని కాపాడాడు. నిశ్శబ్ద నిస్వార్ధ త్యాగం అలాంటిది.

ఏ సమాజంలోనైనా పేదవారి సంఖ్య పెద్దది. సమాజం యొక్క రూపు రేఖల్ని దిద్దేవారే వారు. అట్టి పేదవారిని అల్పసంఖ్యాకులైన కొందరు దుర్వి నీతులు, అహంకారులు తమ స్వార్థం కోసం కొల్లగొట్టడానికి ప్రయత్నిస్తూ ఉండ డం చారిత్రక సత్యం. అలాంటి దుర్వినీతులు ఎలాంటి గతికి పాల్పడతారో భారతం ఒక చోట చాటి చెప్పింది. జనమేజయుడు సర్పయాగం ప్రారంభించాడు. సరమ అనే దేవశుని కుమారుడు సారమేయుడు. అతడు క్రీడాలోలుడై ఆ ప్రదేశానికి వచ్చాడు. అప్పుడు జనమేజయుని తమ్ములు శృతసేనుడు, భీమసేనుడు, ఉగ్ర సేనుడు అనేవారు ఆ చిన్నవానిని కొట్టి వెళ్లగొట్టారు. అప్పుడాతడు వెళ్లి తల్లితో మొర పెట్టుకోగా ఆ సరమ కోపంతో వచ్చి జనమేజయునితో ఇలా అన్నది.

"తగునిది తగదని యెదలో
వగవక సాధులకు బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
తగునని మిత్తాగమంబులైన భయంబుల్."

ప్రపంచ చరిత్రంతా ఈ ఒక్క పద్యానికి వ్యాఖ్యానం. ఇతిహాసకాలం మొదలు ఇప్పటిదాకా ఎందరో దుర్వినీతులు స్వార్థచోదితులై పేదల్ని, సచ్చరిత్రుల్ని కొల్లగొట్టి తుదకు అవమానాలు కావడం మనకు కనిపిస్తుంది. హిరణ్యకశిపుడు మొదలు హిట్లర్ దాకా ఈ నైతిక సూత్రాల్ని ధిక్కరించి చెడినవారే.... సాధువు లైన పేదవారే ఒక్కసారి తెగబడితే ఎంతటి మహా సామ్రాజ్యమయినా కూకటి వేళ్లతో సహా కూలిపోగల మహా అద్భుత శక్తి పేదసాదల దీనాలాపాల్లోనూ, సంఘటిత శక్తిలోనూ ఉన్నదన్న భావాన్ని ఈ పద్యం నిగూఢంగా దాచుకున్నది.

లోకంలో దృష్టి భేదాన్ని బట్టి ఒకే విషయం పలువురికి పలురకాలుగా గోచరిస్తుంది. భారతరచన కూడా అంతే.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతి శాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్య మనియు,

లాక్షణికులు, సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసకు లితిహాసమనియు, బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ"

వేదవ్యాసుఁడు భారతాన్ని వ్రాశాడని నన్నయభట్టు తన రచనకి కూడా అన్వయించి చెప్పుకున్నాడు నన్నయభట్టు ఇక్కడ అందరినీ తలవాడు కాని కాలానికి అద్దం పట్టి చూపించే చారిత్రకుల్ని స్మరించలేదు. నన్నయగారి కాలం చరిత్రకందేదే అయినా భారతాన్ని చారిత్రక గ్రంథంగా పరిగణించలేదను కోవాలి. ఇతిహాసం అంటే చరిత్రని ఉద్దేశించాడా అంటే ఇతిహాసం = ఇతి + హ + ఆస = ఇట్లుండెను అంటే తొల్లిటి కథ అని మన నిఘంటువులు చెప్పుతున్నాయి. కథలో కొంత కల్పనకు ఆస్కారం ఉంటుంది కనుక అది చరిత్ర కాదు కనుకనే చారిత్రకుల్ని నన్నయ స్మరించలేదని విమర్శకు లంటారు. చారిత్రకుల్ని నన్నయభట్టు స్మరించక పోయినా, చారిత్రకులు మాత్రం నన్నయ్యను, వ్యాసుడిని వదిలి పెట్టలేదు. రాతినుండి నూనెను పిండగల ఉద్దండ పిండాలు చారిత్రకులు. కనుక భారతం ఇతిహాసమా, చరిత్రా అన్న విషయాన్ని వారు తేల్చడానికి ప్రయత్నించారు. భారతంలోని అభూత కల్పనలు, కట్టుకథలు అనే ముసుగును తొలగిస్తే ప్రకాశించేది చారిత్రక సత్యమే అంటారు కొందరు ప్రాచ్య పాశ్చాత్య చారిత్రకులు.

పర్గిటర్, మున్షీ మొదలైన విద్వాంసులు మహాభారత యుద్ధం అనేది అసలు లేనే లేదనీ, ఈ యుద్ధం కురు పాంచాలురకు మధ్య జరిగిన ఒక చిన్న తగాదా అనీ, దాన్నే కవులూ, పండితులూ గోరంతలు కొండంతలు చేసి ఒక గొప్ప యుద్ధంగా వర్ణించారంటారు. క్రీ॥ పూ॥ 950 ప్రాంతంలో జరిగిన ఈ యుద్ధాన్ని ప్రత్యక్షంగా చూచిన కృష్ణద్వైపాయనుడనే పేరు కలిగిన పారాశర్య వ్యాసుడు 'జయ' అనే పేరుతో భారత కథ వ్రాశాడంటారు వీరు

రాప్సన్, విల్సన్ మొదలయిన పండితుల ప్రకారం పాండవులు, కౌరవులు అసలు జ్ఞాతులే కారు. కౌరవులనే వారు ఢిల్లీ, కనోజి ప్రాంతాల్లో రాజ్యంచేస్తూ ఉండగా, రాజ్యాధికారం లేని పాండవులనే ఆటవికులు కౌరవుల రాజ్యాన్ని ఆక్రమించుకొని భారత కథను తమకు అనుకూలంగా వ్రాయించు కున్నారని వీరి భావం. వీరి ప్రకారం పాండవు లసలు ఆర్యులే కారు.

వీరు సిథియా దేశవాసులని మరి కొందరి సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి ప్రోద్బలకంగా వారు అనార్యులైన సిథియన్ల ఆచారవ్యవహారాలతో పాండవుల ఆచారాల్ని ఈ క్రింది విధంగా పోల్చి నిరూపించడానికి ప్రయత్నించారు.

a) బహు పతీత్వము సిథియన్ల ఆచారం. భారతంలో కూడా బహు పతీత్వం అమలులో ఉంది. ద్రౌపదికి అయిదుగురు భర్తలు. కుంతి, సత్యవతి అలాంటివారే. ఇది ఆర్య ధర్మ విరుద్ధం. ఒక భర్త అనేకులైన భార్యల్ని

కలిగి ఉండవచ్చును. కాని ఒక భార్య ఒకేసారి అనేకులైన భర్తల్ని కలిగి ఉండ జాలదని ఐతరేయ బ్రాహ్మణం చెప్పుతున్నది. కనుక పాండవులు అనార్యులని వీరి భావం.

b) సహగమనం కూడా సిథియన్ల ఆచారమే. ఇది కూడా ఆర్యధర్మ విరుద్ధం. భర్త చనిపోయినప్పుడు ఎందరు భార్యలున్నా చితిలోదూకి చనిపోవడం వీరి ఆచారం. మహాభారతంలో కూడా పాండురాజుతో పాటు మాద్రి సహగమనం చేసింది.

నెత్తురు తాగే ఆచారం సిధియన్లలో ఉన్నది. ఆర్యులలో చాలా వ్యసనాలున్నమాట నిజమే కాని నెత్తురు త్రాగే ఆచారం మాత్రం లేదంటారు వీరు. మహాభారతంలో భీముడు దుశ్శాసనున్ని చంపి అతని రక్తం తాగాడు. తల్లిపాలు, తేనె, సారాయికంటె రక్తం మేలుగా ఉందని భీముడు చెప్పినట్లుగా కనిపిస్తుంది. గంధర్వులు దుర్యోధనున్ని పట్టి బంధించి విడువక యుద్ధం చేసే సందర్భంలో అర్జునుడు ఇలా అంటాడు. "గంధర్వులు దుర్యోధనున్ని విడకపోతే ఈ నాడు ధరణీదేవి గంధర్వుల రక్తం త్రాగుతుంది" రక్తం తాగడం అనేది ఒక జాతీయం లాగా కనుపించినా ఇందులో చారిత్రక సత్యం ఉంది అంటారు వీరు. పైగా సిధియన్లలో శత్రువు రక్తం త్రాగని వాడసలు వీరుడే కాడట.

అంతేకాక శమ ఆయుధాల్ని మనుష్య చర్మంతో కప్పే ఆచారం సిధియన్లది. యుద్ధరంగంలో మొట్టమొదట ఏ శత్రువునయితే చంపుతాడో ఆ శత్రువు యొక్క చర్మాన్ని ఆయుధ కోశంగా ఉపయోగించే పద్ధతి వీరిలో ఉన్నది. ఉత్తర గోగ్రహణంలో అర్జునుడు బృహన్నల వేషంలో ఉండి ఉత్తరున్ని శమీవృక్షం పైకి ఎక్కించి ఆయుధాలు అందిమ్మని ఆదేశించినప్పుడు ఉత్తరుడు వటంపైకి ఎక్కి శమీ వృక్షంపైన పాండవుల ఆయుధాలన్నీ శవాకారంలో ఉండడం చూచి అతడు భయ భ్రాంతుడౌతాడు. పాండవులు సిధియన్లన్న భావానికి ఇది ప్రోద్బలకంగా ఉంది అంటారు. ఈ విధంగానే పాండవులు టిబెట్టు దేశీయులని కొందరు, గంగానది కావలనుండి వచ్చిన ఆటవికులని కొందరు, హిమాద్రికావల శత శృంగపర్వతం వీరి జన్మస్థానమని కొందరు చెప్పి వారివారి వాదాలకు బలం చేకూర్చుకునే ప్రయత్నం చేశారు.

మరొక విచిత్రమైన సిద్ధాంతమున్నది అసలు భారత కథ అంటూ లేనేలేదని అంతా కల్పితమని వీరి వాదం. అనంతమైన ఆకాశంలోని నక్షత్ర సమూహాల యొక్క ఉనికి, వాటి యొక్క గమనాన్ని చూచిన మహాకవి, తన ఊహాశక్తి చేత, ప్రతిభ చేత భారత కథను కల్పించి వ్రాశాడని ఖగోళశాస్త్రానికి, భారత కథకు సమన్వయం చేశారు.

పైన నిరూపించబడిన సిద్ధాంతాలలో ఎంత వరకు సత్యమున్నది అన్న విషయం పరిశోధకలు తేల్చాలి. ఒక్కటి మాత్రం నిజం. చారిత్రక సత్యంగా పరిగణింపబడిన ఒక విషయం ఎల్లప్పుడూ అది సత్యంగానే ఉండిపోవలసిన అవసరం లేదు. కాలాంతరంలో చారిత్రకుల కృషి నిబట్టి సత్యం మారుతూ ఉండవచ్చు.

**స్త్రీ వైవాహిక జీవితము - నైతిక విలువలు :** ఏ గ్రంథమయినా. వేదం మొదలు వేమన పద్యందాకా, అది పురాణమయినా, ఇతిహాసమయినా. కావ్యమైనా సాంఘిక స్పర్శ స్వల్పంగా నైనాలేని గ్రంథమంటూ మనకు కనిపించదు. అలాగే భారతంలో కూడా కొన్ని అద్భుత కల్పనల్ని, కట్టుకథల్ని, అస్వాభావిక విషయాల్ని తొలగించిచూస్తే మనకు సాంఘిక సత్యాలు కొన్ని బయట పడతాయి.

కుటుంబమనేది సమాజంలో ఒక ముఖ్యమైన వ్యవస్థ. ఈ కుటుంబం మూడు విధాలైన బాధ్యతల్ని నెరవేరుస్తుంది. జైవికబాధ్యతలు-సాంఘిక బాధ్యతలు ఆర్థిక బాధ్యతలుగా సామాజిక శాస్త్రజ్ఞులు చెప్తుతూ ఉంటారు.

సంతానాన్ని కని వారిని సంరక్షించడం, సమాజంలో వారిని బాధ్యతాయుత పౌరులుగా తీర్చి దిద్దడం, వారికి ఆర్థిక వసతుల్ని కల్పించడం-ఈ మూడు అతి ముఖ్యమైన విధులుగా విజ్ఞులు చెప్పుతూ ఉంటారు. ఇలాంటి కుటుంబ వ్యవస్థ భారతంలో ఎలాంటి స్వరూపంలో ఉన్నదీ చారిత్రక దృష్టితో పరిశీలిస్తే కొన్ని సత్యాలు మనకు బోధపడతాయి. కొన్ని ఉపాఖ్యానాల్లోని ఉదాహరణల్నిబట్టి చూస్తే ఆనాటి కుటుంబ వ్యవస్థ అంతపటిష్ఠంగా ఉన్నట్లు మనకు కనపించదు. ఆనాడు వివాహం అనేది స్త్రీ పురుషులమధ్య ఒక ఒడంబడిక మాత్రమే. ఆ వివాహంలో భార్యా భర్తల మధ్య అనురాగ, ఆకర్షణలకు తావులేదు. సంతానోత్పత్తికి అది సాధనం మాత్రమే. భారతంలోని కొన్ని వృత్తాంతాలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి.

జరత్కారువు వృత్తాంతమున్నది. మొదట ఈతడు బ్రహ్మచారిగానే ఉండి పోదలచాడు. కాని పితృపితా మహుల ప్రోత్సాహంతో సనామ్ని అయిన స్త్రీని మాత్రమే చేపడ తానని పట్టుపట్టి వాసుకి సోదరియైన జరత్కారువు అనే స్త్రీని వివాహమాడాడు. లోకంలో సనామ్నీయులైన భార్యా భర్తలు చాలా అదృష్ట వంతులన్న ప్రతీతి ఉంది. అది వీరి విషయంలో వక్రించింది. ప్రథమ సమాగమంలోనే అతడొక షరతు పెట్టాడు "నీవెన్నండేని యవమానంబు దలంచితి నాడ నిన్నుంబాసి పోవుదు"నని ఒడంబడిక చేశాడు. ప్రథమ సమాగమంలోనే ఒడంబడికకు లోనైన వివాహం విచ్ఛి పోవడానికి ఎంతో కాలం పట్టదు. ఒక సంధ్యాసమయం భార్యతొడను తలగడగాచేసి నిద్రిస్తున్నాడు. సంధ్యా సమయ సద్విధులకు ఆటంకం కలుగుతుందేమోనన్న భయంతో భర్తను లేపింది. అతడు ఉగ్రుడయ్యాడు. తాను నిద్రిస్తుండగా సూర్యుడస్తమిస్తాడన్న ఆలోచన ఆమెకు కలగడమే గొప్ప అవమానంగా భావించి గర్భవతి అన్న దాక్షిణ్యమయినా లేకుండా పుట్టినింటికి పంపివేశాడు.

హిడింబి వృత్తాంతం కూడా అలాంటిదే. ఈమె భీముని బలపరాక్రమాదుల చేత ఆకర్షింప బడింది. భీముని చేత నిరాకరింపబడినప్పటికీ క్రమంగా అత్తగారి ఆదరాన్ని విశ్వాసాన్ని చూఱగొన్నది. అందరూ కలిసి అతన్ని అంగీకరింప చేసినా అతడు కొన్ని షరతుల్ని పెట్టాడు. "పుత్రజన్మ మగునంతకు మాత్రమే మీ వచనంబున దీనిని పరిగ్రహించెద" నన్నాడు. అన్నమాట ప్రకారంగా ఘటోద్గచుని జననానంతరం ఇద్దరినీ వెళ్ళగొట్టాడు.

శకుంతల వృత్తాంతం కూడా ఇలాంటిదే. గాంధర్వ విధి వివాహాన్ని దుష్యంతుడు కోరినప్పుడు, కలుగబోయే తన కుమారునికి యౌవరాజ్యాభిషేకం చేస్తేనే అంగీకరిస్తానంటుంది. తరువాత దుష్యంతుని సభలోకి శకుంతల వెళ్ళినప్పుడు "ఏనెట, నీవెట, సుతుడెట" అంటూ ఆమెను స్వీకరించడానికి నిరాకరిస్తాడు. సమయానికి ఆకాశవాణి ఆదుకోకపోతే శకుంతలను స్వీకరించే సమస్య తలెత్తదు. ఇది కూడా ఆ నాటి వివాహ వ్యవస్థయొక్క ద్రవస్థితిని సూచిస్తుంది.

ఇక గంగ వృత్తాంతం. సంప్రాప్త యౌవనుడయిన శంతను డొకనాడు గంగా తీరంలో విహరిస్తున్నాడు. గంగ ఒక యువతి రూపంలో అక్కడికి వచ్చింది. ఆమె రూప లావణ్యాలకు అబ్బురపడి ఆమెను వివాహమాడ గోరుతాడు. ఇక్కడ కూడా ఒక షరతు. అతడు తన పనులకే విధంగా కూడా అడ్డు తగులరాదు. తన కెలాంటి అప్రియకార్యాల్ని ఆతడు తలపెట్టరాదు. ఈ షరతుల కంగీకరిస్తేనే వివాహమాడ డానికి ఎలాంటి అభ్యంతరం లేదంటుంది. శంతనుడీ షరతుల కంగీకరించాడు. కాని పుట్టిన బిడ్డను పుట్టినట్లు గంగపాలు చేస్తుంటే సహించలేక వారించాడు. ఒడంబడిక సడలించినందుకు ఆమె వెంటనే విడిచిపెట్టి వెళ్ళిపోయింది. ఎనిమిదిమంది సంతానాన్ని కన్న పిమ్మట కూడా కాదనగల స్థితిలో ఆ నాటి వివాహ వ్యవస్థ ఉందన్న మాట !

ఇకపోతే దీర్ఘతముని వృత్తాంతమున్నది. బృహస్పతి శాపంతో జాత్యంధుడైనా, తన విద్యాబలంతో ప్రద్వేషిణి అనే ఒక బ్రాహ్మణిని వివాహ మాడాడు. వారికి గౌతమాదులైన పుత్రులు చాలామంది కలిగారు. అయినా ఆ బ్రాహ్మణి భర్తపట్ల అకారణ ద్వేషాన్ని పెంచుకుంది. నన్నేల మెచ్చవని దీర్ఘతము డొకనాడు భార్యను నిలదీసాడు. అమె ఇచ్చిన సమాధానమిది.

"పతియు భరియించు గావున భర్తయయ్యె
భామభరియింపఁ బడుఁగాన భార్యయయ్యె

ఈ భావం మనిద్దరిలో వ్యత్యస్తమయ్యింది కనుక నిన్ను నేను భరింపలేన నడమేకాదు ఇంటినుండి వెళ్ళగొట్టింది! దీర్ఘతముడు కోపంతో రెచ్చిపోయాడు పతివిహీనలైన స్త్రీలను కఠినంగా శపించాడు. స్త్రీ ఎంత ధనవంతురాలైనాసరే, ఎంత

గొప్ప కులంలో పుట్టినా సరే పతివిహీన అయినప్పుడు మాంగల్య రహితంగా, అలంకార విహీనంగా ఉండాలి. ఈ శాపంతో మండిపోయిన అమాని నీమణి ముసలివాడైన భర్తను తీసుకొనిపోయి గంగానదిలో వేసిరమ్మని కొడుకుల్ని ఆజ్ఞాపిస్తుంది. పరిశోధిస్తే ఇలాంటి వృత్తాంతాలెన్నో మనకు కనిపిస్తాయి.

పై వృత్తాంతాల వల్ల మనకు రెండు విషయాలు గోచరిస్తున్నాయి. 1. ఆ రోజుల్లో కుటుంబ వ్యవస్థ అప్పడప్పుడే కుదురుకుంటున్నది. స్త్రీ పురుషులిద్దరిలో ఎవరు విడిపోవాలన్నా సమాజానికి గాని, మరెవరికి గాని సంజాయిషీ ఇచ్చుకోవలసిన అవసరంలేదు. మనువు కుదరడం ఎంత సులభమో, విడిపోవడం కూడా అంతే సులభం. ఇక రెండవ విషయం పై వృత్తాంతాలలోని కొన్ని కుటుంబాలలో స్త్రీల ఆధిక్యత, మరి కొన్నింటిలో పురుషాధిపత్యం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తున్నాయి. అంటే సాంప్రదాయకంగా వచ్చే స్త్రీ అధిపత్యం ఒకవైపు, స్త్రీని అస్వతంత్రనుగా చేసి పురుషుని పెత్తనం క్రింద అణచిపెట్టాలనే నూతన సాంప్రదాయం మరొకవైపు- ఈ రెంటియొక్క సంఘర్షణే మనకు కనిపిస్తుంది. అంటే పాత, క్రొత్త ధార్మిక సాంప్రదాయాలకు భారతకాలం ఒక సంధి యుగం అని చెప్పొచ్చు.

నాటి స్త్రీలనైతికవర్తనం మరో ముఖ్యమైన అంశం. భారతాన్ని చారిత్రక దృష్టితో కాకుండా ఈ నాటి నైతిక విలువలతో వెలకట్టి చూచి కొన్ని అపోహలకు లోనయ్యేవారు కొందరుంటారు. వీరిదృష్టిలో భారతం ఒక బూతుపురాణం. భారతంలోని ప్రతి స్త్రీ వెనుక ఒక బూతుకథ ఉంది. నైతికవిలువలకందులో తావు లేదు. ఇవి వారిఅరోపణలు. ఒక్క విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. న్యాయము-నీతి-ఇవి దేశకాల పాత్రాదుల్నిబట్టి మారుతూ ఉంటాయి. కనుక ఏదయినా ఒక గ్రంథాన్ని మనం పరిశీలించేటప్పుడు ఆనాటి సాంఘిక స్థితిగతుల్ని, సాంప్రదాయపు పోకడల్ని, నైతిక విలువల్ని దృష్టిలో ఉంచుకొని ఆలోచించినప్పుడే ఆ గ్రంథానికి న్యాయం చేకూర్చగలం. ఈ నేపథ్యంలో ఆనాటి స్త్రీ నడవడిని పరిశీలిద్దాం.

దాశరాజు కూతురు మత్స్యగంధి యమునా తీరంలో ఓడలునడిపే పనిలో నిమగ్నమై ఉంటుంది. వసిష్ఠుని మనుమడు పరాశరుడు అనే మునీశ్వరుడు నదిని దాటడానికి అక్కడికి వొచ్చాడు. తొలిమాపులోనే ఆ తొయ్యలిని ప్రేమించి ఆమెతో సమాగమాన్ని అర్థించాడు. తన కన్యాత్వం దూషితమౌతుందేమోనన్న అనుమానాన్ని ఆమె వెల్లడించింది. తన సంగమంవల్ల కన్యాత్వానికెలాంటి కళంకంరాదని వర మిచ్చాడు. అంటే ఒక అవివాహితయైన స్త్రీ పురుషున్ని స్వీకరించినప్పటికీ ఆమె కన్యాత్వం దూషితం కాలేదు. వీరిద్దరికీ కలిగిన సంపర్కాన్నిగాని, వీరిద్దరికి కలిగిన వేద వ్యాసున్ని కాని ఆనాటి సమాజం ఏ మాత్రం తిరస్కరించలేదు. పైగా వారిని స్తుతించింది. ఆ నాడు స్త్రీకి జీవితంలో ఒక పురుషుడితో సంబంధం అన్న నియమం

సర్వత్రా అనుసరింపబడలేదు. ఈ మత్స్యగంధే పిదప సత్యవతి అన్న పేరుతో భారత ప్రపితామహుడైన శంతనుష్ని వరించింది.

పాండురాజు పుట్టుకతోనే వ్యాధిగ్రస్తుడైనప్పటికీ కుంతి, మాద్రుల్ని వివాహమాడాడు. కుంతి తండ్రియింట కన్యగా వున్నప్పుడే సూర్యుడనే ఒక అజ్ఞాత వ్యక్తి ద్వారా కర్ణున్ని కని ఏటిలో పారవేసింది; అయినా వివాహానికి ఆనాడు ఆమె యోగ్యురాలే. సంతాన విహీనులైన వారికి ఊర్ధ్వలోక ప్రాప్తిలేదు కనుక నియోగ పద్ధతి ద్వారా సంతానాన్ని కనుమని భర్త ఆదేశించాడు. అప్పుడప్పుడే సంఘంలో నైతిక విలువలు కొంచెంగా మారుతున్నాయి కనుక కుంతి తిరస్కరిస్తుంది. అప్పుడు పాండురాజు ఈ నియోగ పద్ధతి ధర్మ సమ్మతమేనని నచ్చచెప్పుతూ రెండు ఉదాహరణల్ని చూపిస్తాడు. కేకయరాజు భార్య శ్రుతసేన ఋత్విజులవల్ల ముగ్గురు పుత్రుల్ని కన్నది. వ్యుషితాశ్వుడనే రాజు భార్య విధవ అయినప్పటికీ ఏడుగురు పుత్రుల్ని కన్నట్లు ఉదాహరణల్ని చూపించి స్త్రీలు ఈ విషయంలో సర్వస్వతంత్రులనీ, వారికా స్వేచ్ఛ ఉందనీ నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. అంతేకాదు, అంతా అంబాలికలు వైధవ్యంలో పొందిన సంతానమే భారతాధినేతలుగా ఆనాడు చలామణి అయినారు. ద్రౌపది అయిదుగురు భర్తల్ని కలిగిఉండి కూడా పతివ్రతకాగలిగింది. పాండవులు కాంపిల్యానికి వెళ్ళి స్వయంవరంలో ద్రౌపదిని గెలిచినామని చెప్పితే పూర్వ సాంప్రదాయాన్ననుసరించి అయిదుగురిని పంచుకొమ్మన్నది కుంతి.

ఇదే విధంగా, పురుషులు కూడా బహుభార్యాత్వాన్ని కలిగి ఉన్నప్పటికీ వారి ధర్మనిష్ఠకు గాని, న్యాయపరతకుగాని ఆటంకం కలుగలేదు. ధృతరాష్ట్రునికి నూర్గురు భార్యలు. శర్యాతికి నాలుగువేల మంది భార్యలట.

అయితే ఈ దేవర న్యాయాలు, నియోగ పద్ధతులు, అతిథిపద్ధతులు బహు భర్తృత్వం. బహు భార్యత్వం ఏ సమాజానికి కూడా ఆరోగ్యదాయకం కాదు. పటిష్ఠమైన కుటుంబవ్యవస్థ మీదనే సమాజం యొక్క క్షేమం ఆధారపడి ఉంటుంది. ఏ సమాజంలో నయినా ప్రాచీన దుస్సాంప్రదాయాలు, మూఢనమ్మకాలు సమాజాన్ని అధోగతికి లాగుతున్నప్పుడు కొందరు సంఘ సంస్కర్తలు ఆ దుస్సాంప్రదాయాల్ని ఎదిరించి పోరాడడానికి సిద్ధపడతారు. ఆనాడు శ్వేతకేతుడు అలాంటి బాధ్యత వహించాడు. ఒక వృద్ధ విప్రుడు అతిథిగా వచ్చి తల్లిని కోరినప్పుడు మహోగ్రుడైనాడు. అది ధర్మ విరుద్ధమని తలచాడు. ఈ విధానాన్ని రూపుమాపడానికై కంకణం కట్టుకున్నాడు అంతేకాదు, యువకుడైన ఆతడు ఒక ఉద్యమమే లేవదీసి ఉండవచ్చు. కాకపోతే తరతరాలు పేరుకొని పోయిన ఈ సాంప్రదాయాలు మామూలు మర్యాదలకు లొంగుతాయా ? భారతంలో ఆతడు "స్త్రీలకు మర్యాద పెట్టితి" నని మాత్రమన్నట్లుగా మనకు కనిపిస్తుంది. ఆ మర్యాదకు వెనుక ఎంతటి ఉద్యమం నడిచిందో

షనం ఊహించ వలసిందే. ఈ ఉద్యమ ఫలితంగా స్త్రీలకు కొన్ని నియమాలు, కట్టుబాట్లు ఏర్పడ్డాయి.

భర్త చేత నియోగింపబడక భార్య ఏ పనీ చేయరాదు. భర్త చేత నియోగింపబడిన పనిని చేయకపోవడం కూడా పాపమే. అయినా ఈ నూతన సాంప్రదాయం స్త్రీలపైన పురుషుని పెత్తనాన్ని సంపూర్ణంగా నిర్ణయించింది. ఈ విధానాన్ని వ్యతిరేకించిన వారు కులటలుగా, తల ఒగ్గినవారు పతివ్రతలుగా పరిగణింప బడ్డారు. సుకన్య ఒక గొప్ప పతివ్రత. వృద్ధుడైన చ్యవన మునికి పత్ని. అశ్వినీ దేవతలు ఈమె వద్దకు వచ్చి నీ రూపలావణ్యాలకు తగిన వరుణ్ణి చేపట్టు అంటే "చ్యవనుని యందే నాకు ప్రీతి గలదు" అంటుంది. అప్పుడు చ్యవనుడు దాని పతివ్రతాత్వమునకు సంతోషించాడు. తపతీ సంవరణోపాఖ్యానంలో సంవరణుడు తపతిని గాంధర్వ వివాహం చేసి కొమ్మని అడిగినప్పుడు తపతి "ఇంతులకు స్వాతంత్ర్యంబులేము నీ వెఱుంగుదువు గాదె" అంటుంది. ఈ విధంగా స్త్రీలు స్వాతంత్ర్యాన్ని కోల్పోవడమనేది ఒకటి, రెండు నెలల్లో జరిగిన విషయంకాదు. ఈ మార్పు ఒకేసారికాక కొన్ని శతాబ్దాల కాలంలో కలిగింది అని చెప్పవలసి ఉంటుంది.

## భారతంలో బ్రాహ్మణోత్కర్ష

భారతంపై ఒక అభియోగం మోపబడుతూవుంది. నన్నయభట్టారకుడు తన భారత భాగాన్ని బ్రాహ్మణోత్కర్షతో నింపినాడన్నది ఆ అభియోగం. భారతం బ్రాహ్మణ మత విజ్ఞాన సర్వస్వం అనడానికి తగిఉంది అని వారి ఆరోపణ. బ్రాహ్మణాధిక్యాన్ని నిరూపించే సందర్భాలు చాలానే కనబడుతాయి.

—ఉత్తమ జ్ఞానమనేది ఏదయినా ఉంటే అది బ్రాహ్మణులతోనే పుట్టింది.

—బ్రాహ్మణుల్ని పూజిస్తే జనులకు అభిమతార్థ సిద్ధికలుగుతుంది.

—తిట్టినా మహాపరుషాలు పలికినా ఉత్తమ ద్విజులు పూజ్యులే. వారికి కీడు తలిస్తే ఇహమూ, పరమూ చెడుతుంది.

—బ్రాహ్మణులు మాత్రమే అహింసాపరులు.

— శ్వల సంపర్కంతో అపవిత్రులు పూజ్యులౌతారు.

—బ్రాహ్మణులు మహాబలయుతులు, తపోబల సంపన్నులు. చరాచర అఖిల జగానికి పెద్దలు. ఇంద్రుడైనా కూడా బ్రాహ్మణులకు అవమానం తలపెడితే ప్రతాపహీనుడౌతాడు.

ద్విజశుశ్రూషా పరులై శూద్రులు అవనిలో వృద్ధి పొందుతారు.

ఇలాంటి సూక్తులెన్నో తడిమితేచాలు మనకు కనిపిస్తాయి, ఈ బ్రాహ్మణోత్కర్షకు, యజ్ఞయాగాది కర్మకాండను నిరూపించే ప్రయత్నానికి చారిత్రకులు ఒక కారణాన్ని చూపిస్తారు. నన్నయకు పూర్వం ఆంధ్ర దేశంలో బౌద్ధ, జైనాలు మిక్కిలి ప్రచారంలో ఉన్నాయి. బౌద్ధ, జైన ప్రచారకులు దేశభాషల్ని బాగానేర్చుకొని ఆ భాషలద్వారా తమ తమ మతాల్ని ప్రజల్లో వ్యాపింప చేస్తూ ఆకర్షించడం ప్రారంభించారు. ఫలితంగా కొంత కాలానికి వైదికమతం కొంతవరకు క్షీణించిపోవడం, తద్వారా యజ్ఞయాగాది కర్మకాండ రూపుమాసిపోతూఉండడం సంభవించింది. ఈ సందర్భంలోనే కుమారిలభట్టు జైన, బౌద్ధ సిద్ధాంతాల్ని ఖండిస్తూ పూర్వమీమాంసా పద్ధతిని ప్రవేశ పెట్టాడు. వైదిక మతాభిమాని రాజరాజు కూడా పరమతస్థుల ప్రయత్నాలను భగ్నం చేయాలన్న ఉద్దేశంతో నన్నయను రెండు కోరికలు కోరాడు. ఒకటి దేశభాషా సముద్ధరణము, రెండు వైదికమతోద్ధరణము. వైదిక మతోద్ధరణం ఆయన లక్ష్యమని భారతంలో ఎక్కడా వాచ్యంగా వ్యక్తం కాక పోయినా ఆనాటి పరిస్థితుల దృష్ట్యా ఆలోచిస్తే రాజరాజు నన్నయను కోరి ఉంటాడనే విమర్శకులు నమ్ముతారు.

ఈ బ్రాహ్మణోత్కర్షకు మరొక కారణంకూడా ఉంది. అది రాచరికపు వ్యవస్థ. ఆ వ్యవస్థలో బ్రాహ్మణాధిక్యత ఒక భాగం. ఆనాటి ప్రజలలో రాజకీయ చైతన్యంగాని, సాంఘిక చైతన్యంగాని లేదు. నిజంచెప్పాలంటే బానిసత్వాన్ని ప్రేమించే బానిసలువారు. వారికసలు సమస్యలంటూ ఉన్నాయని వారికే తెలియదు. బ్రాహ్మణులు మాత్రమే ఎందుకు వేదవేదాంగాలు చదువుకోవాలి ? తమ కెందుకు అవకాశాలు లేవు ? ఈ విషయాలేమీ వారు ఆలోచించలేదు. కేవలం కులవృత్తులకు అంటి పెట్టుకొని విజ్ఞానాన్ని విస్మరించారు. ప్రాచీన సంస్కృతికి ప్రతీకగా పరిగణింపబడే బ్రాహ్మణుడన్న, బ్రాహ్మణమతమన్నా అపారమయిన అభిమానాన్ని, ఆదరాన్ని ప్రకటించారు. పుట్టుకలకీ, పుణ్యకార్యాలకీ, పెళ్ళిళ్ళకీ, పేరంటాలకీ, చావులకీ, తద్దినాలకీ కూడా పురోహితులపైనే ఆధారపడ్డారు. రాజులపక్షంగా, ప్రజల పక్షంగా కూడా బ్రాహ్మణాధిక్యత బాగా పెరిగిపోయింది. ప్రజలు విజ్ఞానవంతులైతే తమ యొక్క, తమ ప్రభువులయొక్క ఆధిపత్యం ఎక్కడ అడుగంటుతుందో అన్న ఆందోళనతో తదితరవర్ణప్రజల్ని వర్ణాశ్రమ ధర్మాలన్న నెపంతో అజ్ఞానంలోనే ఉంచడానికి ప్రయత్నం చేశారు. వేదశాస్త్రాల్నిగాని, దైవభాష అని పేరు పడ్డ సంస్కృత గ్రంధాల్ని గాని ప్రజలు స్వేచ్ఛగా చదువరాదు. శూద్రుడు వేదం వింటే చెవిలో సీసంకరిగించి పోయాలన్నారు. ఇలాంటి ఎన్నో కఠినమైన శాసనాలతో ప్రజల్ని హడలగొట్టారు. ఏ శూద్రుడయినా, ఒక విద్యలో ప్రావీణ్యాన్ని గడిస్తే వాని విద్యను నాశనం చేసేంత వరకు వారు నిద్రపోలేదు. ఏకలవ్యుని వృత్తాంతమే మనకు ప్రత్యక్షనిదర్శనం.

ఎంత విశ్వాసాన్ని ఏకలవ్యుడు ప్రదర్శించాడో అంత ద్రోహాన్ని ద్రోణుడు తల పెట్టాడు. పెనువ్రేలు గురుదక్షిణగా కోసిమ్మన్నప్పుడు "నేనెందుకు కోసివ్వాలి" ? అని అడిగే చైతన్యంగాని, సాహసంగాని ఏకలవ్యుడిలో లేకపోయాయి. గురుభక్తి అన్న ముసుగు వేసి ఆ వ్యవస్థ అతని నోరుమూసింది. కనుక నన్నయగారు వ్యాస భారతాన్ని తెనిగించినా, తెనిగించకపోయినా నన్నయకు మారుగా మరొకరు ఆస్థానంలో వున్నా బ్రాహ్మణాధిక్యత కనిపించి తీరుతుంది.ఆ వ్యవస్థే అలాంటిది. నన్నయ రచనకు ఆధారం సంస్కృత భారతమయినప్పుడు ఆ బ్రాహ్మణోత్కర్ష మూలంనుండి వచ్చిందా లేక నన్నయ కులబ్రాహ్మణుడు కనుక స్వకులాభిమానంతో స్వయంగాదీన్ని చూపించాడా అనే ప్రశ్న ఉదయించడానికి వీలులేదు.

# నన్నయగారి తెలుగు దేశాభిమానం

లోకంలో ద్వేషాన్నయినా మనసు లోదాయ వచ్చునేమోకాని అభిమాన మంటూ ఉండాలికాని దాన్ని ఏ విధంగా కూడా దాచిపెట్టలేం. నన్నయగారు కూడా తెలుగు దేశంపై ఆయనకున్న అభిమానాన్ని ఎన్ని విధాలుగా ప్రకటించడానికి పాటు పడ్డాడో పరిశీలిస్తే ఆశ్చర్యంకలుగుతుంది.

అన్నగారి ఆదేశంతో ద్వాదశ మాసిక వ్రతం సలుపుతూ తీర్థయాత్రలకు బయలుదేరాడు అర్జునుడు. "బ్రహ్మచర్య వ్రతున్ని" అంటూనే ముగ్గురు భామల్ని చేపట్టాడు. ఆ మన బ్రహ్మచర్యం ఎలాంటిదో మనకు తెలియదుకాని నాగపురంలో ఉలూచిని పెండ్లాడి, తరువాత కళింగం దాటి మహేంద్ర పర్వతాన్ని చూచి మణిపురానికి వెళ్లినట్లుగా మూల భారతంలో చెప్పబడింది. ఆంధ్రదేశ ప్రసక్తి అందులో లేదు. ఆయా ప్రదేశాల్లోని తీర్థస్థలాల్ని, దేవాలయాల్ని చూచినట్లుగా వర్ణింప బడింది. కాని గోదావరి వంటి సుప్రసిద్ధ నది యొక్క ప్రశంస ఏ మాత్రం లేదు. నన్నయ గారి కిక్కడ తన ప్రాంతాభిమానాన్ని ప్రకటించుకోవడానికి చక్కని అవకాశం దొరికింది. అర్జునుడు దక్షిణ గంగగా ప్రసిద్ధి చెందిన గోదావరిని, భీమేశ్వరాన్ని, శ్రీ శైలాన్ని, వేగి దేశాన్ని చూస్తూ కావేరీతీరానికి పోయినట్లు ఒక సీస పద్యంలో చూపించాడు.

"దక్షిణ గంగనాఁదద్దయు నొప్పిన గోదావరియు జగ ద్వాదిరైన
భీమేశ్వరంబును బెడగుచున్న శ్రీ పర్వతంబును జూచియుర్వి లోన
ననఘులై శిష్టాగ్రహార భూయిష్టమై ధరణి సురోత్త మాధ్వర విధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేగి దేశ విభవంబు జూచుచు
విభుఁడు, దక్షి

గాంబురాశి తీరంబున కరిగి మహితమహాసైన కావేరీ మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమతార్థ దానంబు జేసి
కృతార్థుడగుచు
పరమపావన మాసంబున మణిపూరు పురంబునకుం జని”

అని పేర్కొన్నాడు. ఒక్కసారి గోదావరిని పేర్కొనడంతో నన్నయ తృప్తి చెందలేదు. వివిధ తీర్థ మహాత్మ్యాల్ని వర్ణించే సందర్భాల్లో “గోదావరి స్నానంబు చేసిన దశాశ్వ మేధ ఫలంబు వడయుదురు” అన్నాడు. అమూలకమైన ఈ వర్ణనకు ఆయన కున్న స్వప్రాంతాభిమానమే కారణమని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు. అట్లాగే మూలంలో లేని పెన్నను ప్రసిద్ధ నదుల్లో చేర్చి తెలుగు నదిపై తన అభిమానాన్ని చాటాడు. “పెన్నాయను మహానది నాడిన మయూర హంస విమానగతులగుదురు” అన్నాడు. ఇంత గొప్ప అర్థాన్ని అంత సులువుగా నెల్లూరు ప్రజలకు సంక్రమింప జేసిన నన్నయకు ఆ ప్రాంత ప్రజలు సర్వదా కృతజ్ఞులై ఉండాలి! విమానగతులు దేవతలు. దేవతలకు జరామరణాదులుండవు. అట్లే నెల్లూరు ప్రజలు జరామరణాదులులేక పెన్నానదే ఒక గొప్ప పెన్నిధిగా పాడిపంటలతో తులతూగాలని నన్నయ అభిప్రాయం కాబోలు!

ఆంధ్రాభిమానానికి మరో ఉదాహరణ. సహదేవుడు దిగ్విజయ యాత్ర చేసే సందర్భంలో పాండ్యులు, ద్రవిడులు, కేరళులు, కళింగులు, తాలవనులు మొదలైనవారితో పాటు ఆంధ్రుల్ని కూడా జయించినట్లు మూలంలో కనబడుతుంది. ఈ పట్టి నుండి ఆంధ్రుల్ని నన్నయ్యగారు తొలగించి రాజసూయ యాగానికి ఆహూతులైన వారితో చేర్చి తన ఆంధ్ర సోదరుల్ని అవమానం నుండి తప్పించి ఆంధ్రుల అభిమానానికి పాత్రుడయ్యాడు.

## నన్నయగారి సూక్తులు

మన దేశంలో ఎందరో మహనీయులు తమ సూక్తుల చేత భారతజాతికి స్ఫూర్తినీ కీర్తినీ, కలిగించి జాతిని చైతన్యవంతంగా తీర్చిదిద్దారు. తెలుగు సాహిత్యాన్ని సాధనంగా గ్రహించి తెలుగుప్రజల్ని లౌకికంగా, నైతికంగా పారమార్థికంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించిన మహనీయులెందరో ఉన్నారు. అందులో ఆదికవిగా, వాగనుశాసనుడుగా ప్రసిద్ధిగాంచిన నన్నయభట్టును ప్రప్రథమంగా పేర్కొనవచ్చు. నిజానికి అతని భారతభాగమే నానారుచిరార్థ సూక్తి

లకు నిలయంగాఉండి ప్రజల రాజకీయ, నైతిక, వ్యక్తిగత జీవితంలో ఒక భాగంగా జీర్ణించుకొని పోయింది కథాప్రకరణోచితాలే కాక విడిపద్యాలలో ప్రత్యేకంగా వ్యక్తం చేసిన సూక్తులెన్నో ఉన్నాయి. అవి సందర్భోచితంగా ఆయా సందర్భాలలో వాడుకోవడానికి అనువుగా ఉంటాయి. స్వయంసంపూర్ణంగా కథా సందర్భానికి సరిపోతూనే కథను అతీతంగా, స్వతంత్రంగా జీవించడం ఈ సూక్తులలోని విశేషం. సాధారణంగా హితము, మనోహరత్వము ఈ రెంటినీ సంతరించుకున్న సూక్తులు ఆంధ్ర సాహిత్యంలో అరుదుగా కనిపిస్తాయి. అవి నన్నయలో అతిశయించి కనుపించటం విశేషం ఈ సూక్తులన్నీ వివిధ పాత్రల సంభాషణల ద్వారా వ్యక్తం చేయబడినా, నన్నయగారి వ్యక్తిత్వాన్ని వ్యక్తపరిచే వజ్రపు తునకలు.

నన్నయ గారి పాత్రల్లో ఎంత వైవిధ్యముందో, సూక్తుల్లోనూ అంత వైవిధ్యం మనకు కనుపిస్తుంది. వ్యక్తిగత ధర్మాల నుంచి అటు వ్యవస్థ ధర్మాలదాకా, ఇటు ఆర్థిక విషయాలనుంచి అటు పారమార్థిక విషయాల దాకా ఏ విషయాన్నీ నన్నయ విడిచిపెట్టలేదు. అందులో గృహస్థుల ధర్మాలున్నాయి గృహిణికి ప్రాముఖ్య ముంది: ధర్మసూక్ష్మాలున్నాయి. ఒక సామాన్యుడి జీవితం సఫలంకావడానికను వైన ఆదర్శాలున్నాయి. రాజ్యాంగానికి సంబంధించిన మంత్రాలోచనల్లోని మెలకువ లున్నాయి. ఈ విధంగా ఒక సామాన్య సంసారి మొదలు ఒక సామ్రాజ్యాధినేత అనుసరించదగిన అంశాలెన్నో ఈ సూక్తుల్లో నిక్షిప్తమై ఉన్నాయి.

నన్నయ దృష్టిలో స్వచ్ఛమైన జ్ఞానార్జనం నిర్మలమైన జలంతో సమానం. బంధుమిత్ర ధనసంచయం వల్ల కలిగే శారీరక, మానసిక దుఃఖాగ్ని జ్ఞానజలం యొక్క స్పర్శతో ఉపశమిస్తుంది. స్నేహం వల్ల రాగం, రాగం వల్ల కామం. కామం వల్ల క్రోధం, క్రోధంవల్ల తృష్ణ కలుగుతాయి. ఈ తృష్ణ అన్నది సర్వదోషాలకీ, నిరంతర దుఃఖాలకీ నిలయంగా నన్నయ భావింపాడు కనుక బుద్ధి మంతులు ఒక వైపు జ్ఞానార్జన జేస్తూనే స్నేహరాగాదుల్ని అదుపులో పెట్టాలంటాడు. జ్ఞాన వంతుల చరిత్రల్ని చదువుతూ సజ్జనుల గోష్ఠితో కాలం గడపాలన్నాడు.

జ్ఞానార్జనం పట్ల ఎంత ఆసక్తి కనబఱువాడో అధిక అర్థార్జన పట్ల అంత వైముఖ్యాన్ని నన్నయ ప్రదర్శించాడు. "జలములందు మత్స్యంబులు చదలఁబక్షులా మిషంబెట్లు భక్షించునట్లు దివిరి యెల్లవారును జేరి యనేక విధుల నెనుదినంబును భక్షింతు రర్థవంతు" కనుక అధిక అర్థోపార్జనచింత మనసునుండి మానంపేస్తే మంచిదన్నాడు. అంతే కాదు ఇతరుల సంపదల పట్ల ఆశ పెంచుకునే పాపకారులు అర్థానికీ, ధర్మానికీ దూర మౌతారని హెచ్చరించాడు. ఓజానికి ధనకాంక్ష కంటే కీర్తికాంక్ష గణనీయమైనది. నిర్మలమైన కీర్తిముందు ఎన్ని నిధులున్నా నిరుప

యోగమే. కీర్తిలేని వానికి జీవితమేలేదు. కీర్తివిహీనుడు సమాజంలో గౌరవాన్ని అర్హతను కోల్పోతాడు. కీర్తిని, అపకీర్తిని-స్వర్గ, నరకాలతో సాటిగా పరిగణించా డాయన.

మానవుడిలోని ఒక బలహీనతను ఎత్తిచూపించాడు నన్నయ. అది ద్యూతం. ఇది ఎలాంటి శాంత చిత్తుల మధ్యనైనా కలహాన్ని కలిగించి తీరుతుంది. "కుటిలమార్గులైన కుత్సిత కితవు"లతో ద్యూతానికి తలపడితే డబ్బు, ధర్మ రెండూ దూరం కావడమేకాదు. వంశనాశనం కూడా సంభవిస్తుందన్నాడు. కనుక ధర్మమార్గాన్నే ఎన్నుకున్నవాడు ద్యూతానికి దూరంగా ఉండాలి.

కొన్నిసభామర్యాదల్ని కూడా నన్నయ చాటి చెప్పాడు. ఒక సభలో ధర్మం పట్ల సందేహం తలెత్తినప్పుడు సభ్య ప్రపంచం మౌనం వహిస్తే కలుగ బోయే అసత్యదోష ఫలానికి ఆ సభ్యులు సగం బాధ్యత వహించక తప్పదన్నాడు. ధర్మం తెలిసి కూడా స్వార్థంతో, లాభ, లోభ పక్షపాతలోల బుద్ధితో అసత్యం పలికిన సభ్యుడు సంపూర్ణమైన అసత్యదోష ఫలాన్ని అనుభవించక తప్పదు.

"తన యెఱిగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు సెప్పుమనియడిగిన జె
ప్పనివాఁడును, సత్యము సె
ప్పని వాఁడును ఘోరనరక పంకమున బడున్"

కనుక ప్రియము, హితము, పథ్యము, తథ్యము పరిమితము నైన పలుకులే పలకడం సజ్జన లక్షణంగా నన్నయ సంభావించాడు.

ధర్మచ్యుతివల్ల వ్యక్తులు జీవితంలో నైతిక విలువల్ని క్రమంగా ఎలా కోల్పోతారో స్పష్టంగా వివరించాడు. "అధర్మవర్తనుల యందు దర్పంబు పుట్టు, దర్పంబు వలన మానంబు పుట్టు, మానంబువలన క్రోధంబు పుట్టు, క్రోధంబు వలనంజేసి లజ్జయు వ్యక్తంబునుండెడు, నష్టలజ్జావృత్తులైన వారి నుపశమంబును, లక్ష్మియు విడుచు" ఈ విధంగా అధర్మతత్పరులైన వారు నాశనం కాక తప్పదన్నాడు.

సత్యవాక్కు యొక్క గురుత్వాన్ని గూర్చి నన్నయ చెప్పినంత సూటిగా, నిశితంగా మరే కవీ చెప్పలేదంటే అతిశయోక్తి కాదు.

సర్వ తీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావ
యెఱుగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు ధర్మజ్ఞులైన మునులు

అంటూ ధర్మాలన్నింటిలో సత్యానికే పెద్ద పీటవేశాడు. ఒక సత్యవాక్కును ఒక పళ్లెంలో పెట్టి, వేయి అశ్వమేధాలను మరొక పళ్లెంలో పెట్టి త్రాసులో తూస్తే సత్యంవైపునకే ముల్లు మొగ్గుచూపిస్తుందట! సత్యం యొక్క ఉత్తరోత్తర ఉత్కృష్ట స్వభావాన్ని నిరూపిస్తూ ఇలా చెప్పాడు.

"నుత జల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొక బావిమేలు, మఱి బావులు నూఱిటి కంటె నొక్కస
త్క్రతువది మేలు తత్క్రతుశతంబున కంటె సుతుండు మేలు, త
త్సుత శతకంబు కంటె నొక సూనృత వాక్యము మేలు
చూడఁగన్"

అట్లాగే సాంగోపాంగములైన నాలుగు వేదాల అధ్యయనం కూడా సత్యంతో సాటిరావని చాటి చెప్పాడు.

నన్నయ దృష్టిలో ఒక గృహస్థునకు ఉత్తమోత్తమస్థానముంది. "ఆర్తునకు శయనము భీతున కభయము. తృషితునకు జలంబు, బుభుక్షితునకు నన్నంబు, శ్రాంతునకు ఆసనంబు" ఇచ్చే గృహస్థును ఉత్తమ గృహస్థుగా పరిగణించాలని నన్నయ అభిప్రాయం.

గృహిణి యొక్క ప్రాముఖ్యాన్ని చాటిన ప్రాచీన కవి నన్నయ అంటే అబద్ధంకాదు. సతి, గుణవతి, సంతానవతి, అనువ్రత-ఇలాంటి భార్యను అవమానించిన భర్తకు ఇహమూ, పరమూ కూడా ఉండవన్నాడు. ధర్మార్థకామాల్ని ఒక పురుషుడు సాధించాలన్నా, వంశాన్ని పెంపొందింప జేసుకోవాలన్నా, సంతృప్తిగా, సంతోషంగా జీవించాలన్నా, ఆపదల్ని దుఃఖాల్ని అధిగమించాలన్నా భార్య తప్ప భర్తకు మరో శరణ్యం లేదు. అర్ధభాగాన్ని ఆక్రమించిన అర్ధాంగిని అవమానించిన భర్తకు ఇహమూ, పరమూ ఉండబోవని హెచ్చరించాడు. అంతేకాదు, పుత్రజననమే తండ్రికి మహానందకారణంగా నన్నయ అభివర్ణించాడు. దీపం వల్ల మరొక దీపం ప్రభవించినట్లుగా, తననీడ తాను నీళ్లలో చూచుకున్నట్లుగా, తండ్రే పుత్రుని రూపంలో పుట్టి వంశాన్ని ప్రకాశింపజేస్తాడు. అలాంటి కొడుకు పెరిగి పెద్దవాడై సమర్థుడైతే తలిదండ్రుల కష్టాలు కడతేరుతాయి. అట్లాకాకుండా "తనయుఁడు దలిదండ్రులు పనిచిన పని సేయుడేని, పలుకెదలో, జేకొనడేని వాఁడు తనయుండనబడునే, పితృ

ధనమున కర్హుండగునే ?" అంటూ బాధ్యతారహితుడైన కుమారునికి పితృధనముపై ఎలాంటి హక్కు లేదని నన్నయ భావించాడు !

రాజనీతి సూత్రాలు నన్నయకు మంచినీళ్ల ప్రాయం. రాచరికపు వ్యవస్థలో ఒక సమర్థవంతుడైన ప్రభువు యొక్క విధులు, అనుసరించవలసిన రాజనీతి, నన్నయ భారతభాగంలో ఎన్నో సందర్భాల్లో మనకు కనిపిస్తాయి ఒక శత్రువు పట్ల రాజుయొక్క వైఖరి స్పష్టంగా కనబడుతుంది. అవసరమైతే శత్రువుని జాగ్రత్తగా చేరదీసి అవకాశం దొరికినప్పుడు కుండను రాతిమీదవేసి పగుల గొట్టి నట్లుగా నాశనం చేయాలట ! శత్రువు అల్పుడని ప్రమత్తుడై ఉండకూడదు. ఉపేక్షిస్తే శత్రువు కాలులోని ముల్లులాగా, ఉగ్ర శైలాటవుల్ని కాల్చే అగ్నికణంలాగా నాశనానికి కారకుడౌతాడు.

ఇలాంటి సూక్తులెన్నో ! ఇలాంటి సూక్తి సుధారసాన్ని నింపుకున్న భారత భాండం నన్నయ స్వంతం. కనుకనే అతడు ఆంధ్రవాఙ్మయాకాశంలో ఈ నాటికీ సుధాకరుడై ప్రకాశిస్తున్నాడు.

## నన్నయగారి శాబ్దిక స్వరూపం

నన్నయగారి శాబ్దిక స్వరూపం సంక్షిప్తంగా చూద్దాం. వీరేశలింగంగారు చెప్పినట్లు నన్నయగారి భాషలో రెండు పాళ్లు సంస్కృతం, ఒకపాలు తెలుగు, తిక్కనగారిలో తద్విపరీతంగా రెండుపాళ్ల తెలుగు ఒకపాలు సంస్కృతం, ఎఱ్ఱనలో తెలుగు, సంస్కృతం సమపాళ్లలో ఉన్నట్లు అందరూ అంగీకరించిన విషయమే. దీన్నిబట్టి నన్నయగారి భాష ప్రౌఢ సమాన యుక్తం. కాని ఇక్కడ ఒక విశేషం- ఈతని పదాలు కర్కశంగా ధ్వనించకుండా, కొఱకరాని కొయ్యలు కాకుండా, ఒక్క సారి చదినినా, విన్నా కంఠస్థం కాదగినంత సరళంగానూ, మృదువుగానూ ఉంటాయి. అర్థసారళ్యం కూడా తక్కువేమీ కాదు. అర్థసారళ్యం ఒక ఎత్తుకాగా శబ్దగాంభీర్యం మరో ఎత్తు. ఎఱ్ఱన తన హరివంశంలో నన్నయగారిని భద్రకుంజరంతో పోల్చడం ఎంతో ఉచితంగా ఉంది. ఈయన శైలిలోని గాంభీర్యగుణమే దీనికి కారణమని విమర్శకు లంటారు.

"ఉన్నతగోత్ర సంభవము, నూర్జిత సత్త్వము, భద్రజాతి సం
పన్నము, నుద్ధతాన్య పరిభావిమదోత్కటమున్న రేంద్ర పూ
జోన్న యనోచితంబునయి యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్"

ఏ మాత్రం తొట్రుపాటు లేకుండా పరుగెత్తకుండా, గంభీరంగా తొండాన్ని అటూ ఇటూ ఊపుతూ ఒక భద్ర గజం తన ప్రాభవాన్ని ప్రకటిస్తుంది. అట్లాగే నన్నయగారి పద్యంకూడా ఏ మాత్రం తొట్రుపాటు లేకుండా గంభీరంగా సమాన విశేషాలతో సాగిపోతుందని భావం. ఇలాంటి గంభీ గుణానికి కారణ భూతమైన అంశం అక్షరరమ్యత. శబ్దాడంబరమేమో అని భ్రమింప జేసే శబ్ద సాంద్రత నన్నయ సొత్తు. ఇదయినా మొదటి రెండు పర్వాలలో కొంచెం అధికంగా కని పిస్తుందనీ, మూడవ దానిలో దాదాపు మృగ్యమనీ విమర్శకులంటారు.

నన్నయగారు వాడే వర్ణాలు కొన్ని మహాశక్తివంతాలుగా వ్యక్తమౌతాయి. ప్రయుక్తలయిన ఆ వర్ణాలు వర్ణింపదలచిన విషయాన్ని ఒక దృశ్యంలాగా మన కళ్ళకు కట్టింపజేస్తాయి. జనమేజయుడు సర్పయాగ దీక్షితుడైనాడు. యాజ్ఞికులు మంత్రయుక్త హోమాన్ని ప్రారంభించారు. అప్పుడు పాములన్నీ అగ్నికుండంలో పడటానికి పరుగెత్తుకొని వచ్చి పడిపోతున్నాయి. ఆ పడుతున్న దృశ్యం ఇది.

"తడబడ బడియెడు రవమునుబడి కాలెడు రవముఁ
గాలి పలు తెఱఁగు ప్రస్సెడు రవమును దిగ్వలయము
గడుకొని మ్రోయించె నురగ కాయోత్థితమై"

ఇందలి 'డ'కార పునరావృత్తి, హ్రస్వయుక్తమైన వర్ణాలు ఈ రెండూ కలిసి టపటపమని పాములు ఏ మాత్రం వ్యవధానం లేకుండా అగ్నికుండానికి ఆహుతౌ తున్నట్లుగా భావించే అవకాశమున్నది.

మరొక్క ఉదాహరణం. నలుఁడు ప్రచ్ఛన్నుడై ఋతుపర్ణుని ఆస్థానంలో తలదాచుకున్నాడు. ఒకనాడు దమయంతి విరహాన్ని సహింపలేక ఆమెను తలచుకొని దుఃఖిస్తున్న సందర్భంలో జీవలుఁడనే మరొక వంటవాడు నలున్ని గూర్చి ఈ విధంగా తలంచాడు.

అలుపోలును కుఱుచ చేతులు
నొలువ శరీరంబుఁగలిగి యొలులకుఁ జూడం
గొలు గాకుండియు మన్మథు
నొలుపులఁ బడియెడు సతిఁడు యువతీ ప్రియుఁడై

ఈ పద్యంలో ఉన్న హ్రస్వయుక్త శకట రేఫాలు నలుని హ్రస్వ శరీరాన్ని, గూని స్వరూపాన్ని చెప్పకచెపుతున్నాయి.

ఒక పండితుడు కద్రువ, వినతల సంభాషణలో కనిపించే "అక్క ఎక్కడిదె నల్ల" అన్నవాక్యాన్ని పేర్కొని, ఇందులోని నల్లశబ్దానికి త్వార్థంలో "న" గాని "తనము" గాని తద్ధితం 6వ సూత్రం ప్రకారంగా రావలసి ఉండగా ఇక్కడ రెండూ రాక పోవడం వింత అన్నారు. నిజానికి తప్పని సరిగా అవి రావలసిన అవసరంలేదు. కొన్ని చోట్ల కొన్ని విశేషణాలు విశేష్యలక్షకాలై కనుపించడం కద్దు. అంటే విశేషణమే విశేష్యం యొక్క పనిని నెరవేరుస్తుందన్నమాట.

"నీవు కట్టినమైల కట్ట నేర్తునే చెపుమా" అంటుంది దేవయాని. "మైల" శబ్దం కూడా అలాంటిదే. నన్నయ తరువాత కవుల్లో ముఖ్యంగా ప్రబంధ అనంతర ప్రబంధకవుల్లో ఇలాంటి రూపాలు మనకు కనిపిస్తాయి.

"కెంపును బోలె నీక్షణాంచలముల నెఱ్ఱదోచె" (కళిక-1-58 ప॥)
ఎర్రరంగు అని అర్థం చెప్పుకోవాలి.
"మోముల నెఱ్ఱలు దేరంగ" (హరి-ఏకాదశస్కంధం)
"ఓయమ్మ యివి మిగుల గ్రొత్తలు పొమ్మని" (రాజశే-3-10)

ఈ విధంగా ఎన్నో ప్రయోగాల్ని మనం చూపగలం.

ఏ సాహిత్యం ఎంతకాలం మనుతుందో, ఏ గ్రంథం ఎంత కాలం జీవిస్తుందో కాలమే నిర్ణయిస్తుంది, నిత్యపల్లవ శీలమైన సాహిత్యం ఎప్పుడూ మోడువారదు. జాతి జీవించి ఉన్నంత కాలం తన ఉనికిని ప్రదర్శిస్తూనే ఉంటుంది. కనుకనే భారతం జీవించి ఉన్నంత కాలం సాహితీ ప్రియుల ఊపిరై నన్నయ తన ఉనికి ప్రదర్శిస్తూనే ఉంటాడు.

(కవిత్రయ జయంతి సందర్భంగా నెల్లూరులో)

ఈ వ్యాసరచనకు ఆధారమైన గ్రంథాలు.

1. నన్నయ భట్టు విజ్ఞాన నిరతి - గొబ్బూరి వేంకటానంద రాఘవరావు
2. సారమతి నన్నయ—శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
3. భారత మహిళ—శ్రీ జె. రామచంద్రారెడ్డి
4. గౌతమ వ్యాసములు—శ్రీ పింగళి లక్ష్మీకాంతం
5. నన్నయభట్టు భారత భాగం.

# 2

# సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మత, నైతిక నేపథ్యంలో శ్రీనాథుడు

సమాజంలో వ్యక్తులకు విశ్రాంతి లభించినప్పుడే వారి మనస్సు సృజనాత్మకత వైపు మొగ్గు చూపుతుంది. అది వివిధ మార్గాలగా వ్యక్తం కావచ్చు. అనేక వ్యక్త రూపాల్లో కవిత్వం ఒకటి. బాహ్య సంఘటనల ప్రేరణ వల్లగాని, అంతర్భావ ప్రేరణ వల్లగానిపొందే అనుభూతి కవిత్వం రూపంలో వ్యక్తమౌతుంది. భావసృష్టిని బట్టి, అనుభవ పుష్టినిబట్టి, అభిలాష, అభినివేశాల అస్తిత్వాన్నిబట్టి కవితా సామాగ్రికి, కవితా స్వరూపానికి స్పష్టత సిద్ధిస్తుంది.

సాహిత్య సృష్టికి సమాజమే ఆధారం. సమాజం నీరయితే, సాహిత్యం అందులో జీవించే చేప వంటిది. వికసించే పద్మం వంటిది. ఏ కాలంలో నైనా, ఏ దేశంలో నైనా సమాజానికి హితము కూర్చేదే సాహిత్యం. ఇది విద్యాదాయకంగానూ, విజ్ఞాన ప్రబోధకంగానూ ఉండాలి. అంతేకాదు, నిర్దిష్టమైన నైతిక రాజకీయ, సాంఘిక, మతపరమైన నిర్ణయాలను ఎప్పటికప్పుడు తీసుకోవడంలో తోడ్పడుతూ, శాంతియుత సుఖ జీవనాన్ని సాగించడంలో సహకరించేదే ఉత్తమ సాహిత్యం.

నిజం చెప్పాలంటే ప్రాచీన సాహిత్యం కొంతవరకే ఈ ఉద్దేశాన్ని నెరవేర్చగలిగింది. ప్రాచీనాంధ్ర సాహిత్యమంటే చాలావరకు కవిత్వరూపంగానే మనం భావించవచ్చు. ఇది అనాడూ, ఈనాడూ కూడా కేవలం పండిత వర్గానికే పరిమితం. ప్రజలందరూ కావ్యాల్ని చదవడానికిగాని, అర్థం చేసుకోవడానికిగాని అవకాశం లేదు. కొంతవరకర్థం చేసుకోగలిగినా సమగ్రమైన సమాజ స్వరూపాన్ని కనులకు కట్టించగలిగిన గ్రంథాల్ని వేళ్ళమీద లెక్కపెట్టగలం. పురాణాలు, మధ్యకాలపు ప్రబంధాలు సమాజాధ్యయనానికి పిసమెత్తు కూడా తోడ్పడవు. కేవలం ప్రకృతి వర్ణనలు, విరహావస్థలు మొదలైన ప్రబంధోచిత వర్ణనలు నాటి ప్రజల జీవన విధానాన్ని కాని, వారి సమస్యల్ని కాని చిత్రించడంలో సమర్థవంతాలు కావు. కొన్ని గ్రంథాలు కొంతవరకు చిత్రించగలిగినా సమగ్రమైన రాజకీయ, సాంఘిక, మతపరమైన సమస్యల్లోకి చొచ్చుకొనిపోయి ఆ సమస్యలకుగల మూలకారణాలను, తత్పరిష్కార మార్గాలను సూచించగలిగిన గ్రంథాలసలు లేవు. దీనికి కారణం అనాటి వ్యవస్థే అని వేరుగా చెప్పాల్సి అవసరంలేదు. అయినా కవి సమాజంలోని వాడే. సమాజంలో వుంటూ

తన చుట్టూగల సంఘంలోని ఆటుపోటులకు అతీతుడుగా ఉండడం సంభవం కాదు. ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా తన అనుభూతుల్ని స్వల్పంగానైనా మనకు అందించక పోడు. ఎడారిలో ఒయాసిస్సులాగా, గాఢాంధకారంలో మిణుగురులాగా, ఎక్కడో ఒకచోట సామాజిక స్పృహ కనిపించకపోదు. ఇతర కావ్యాలతో పోల్చి చూస్తే శ్రీనాథుని కొన్ని కావ్యాలలో, ముఖ్యంగా చాటు పద్యాల్లో కొంతవరకు ప్రజల జీవన విధానం చిత్రింపబడినట్లు మనం గమనించవచ్చు. దాన్ని పరిశీలించడమే ఈ వ్యాస లక్ష్యం.

నవరము చిననారాయణ కవి తన బహుళాశ్వ చరిత్రలో శ్రీనాథుని గూర్చి "జాతి వార్తా రసర్ధి పదోజ్జృంభణ శబ్దజృంభణ కళా శ్రీనాథున్" అన్నట్లుగా ఇతడు సాంఘిక, రాజకీయాది ఆంధ్రజాతి వార్తల్ని ఎంతవరకందించాడో, అతని గ్రంథాలాధారంగా పరిశీలిద్దాం.

# దేశ పర్యటనం - ఆంధ్రాభిమానం

ప్రజ్ఞాపాటవాలు, యశోభిలాష— ఈ రెండూ కలిగిన ఏ కవైనా అవకాశం దొరికితే దాన్ని సద్వినియోగం చేసుకోక మానడు. శ్రీనాథుడలాంటివాడు. పువ్వుకు వాసన తోడైనట్లు ఈతని పాండిత్య ప్రకర్షకు పర్యటనానుభవం తోడై పరిసర రాజాస్థానాల్లో ప్రతిష్ఠల్ని పండించింది. కంచుఢక్కని పగులగొట్టడానికి, కనకాభిషేకాల్నందడానికి, సింగభూపాలుని సరసకవితతో మెప్పించడానికి, అన్నయమంత్రి, వేమభూపాలుర ప్రశంసల్ని పొందడానికి, రచనలో వైవిధ్యం ప్రదర్శించడానికి, దేశ పర్యటనంవల్ల కలిగిన విజ్ఞానమెంతో తోడ్పడింది. ఈతడు కేవలం ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాల్నే కాక, కాశీ క్షేత్రాన్ని చూచినట్లు ఈతని రచనల్లోని కొన్ని స్థానిక వర్ణనలు చెప్పక చెప్పుతున్నాయి. ఎలాంటి ప్రయాణ సౌకర్యాల్లేని పదిహేనవ శతాబ్దంలో శ్రీశైలంలోని దృశ్యాల్ని, కాశీక్షేత్రంలోని వివిధ ప్రదేశాల్ని అత్యంత సహజ సుందరంగా కన్నులకు కట్టేటట్లుగా వర్ణించాడు. దేశాటనాపరుడైన ఈతనికి దేశంపట్ల సంఘంపట్ల, సంస్కృతిపట్ల ఒక అఖండమైన దృక్పథం ఏర్పడింది. ఆంధ్రదేశంపై ఈయనకుగల ప్రత్యేక అభిమానం అడుగడుగునా మనకు గమ్యమానమౌతుంది. మూలాన్నిమించి కాశీఖండ, భీమేశ్వర పురాణాల్లో వర్ణింపబడ్డ విషయాలే ఇందుకు సాక్ష్యం. ఆంధ్రదేశానికి అతిథిగా వచ్చిన అగస్త్యునికి అచ్చరల దేశీ నృత్తంతోపాటు భీమ మండలంలో వున్న గిరి నదీ క్షేత్రాల గరిమను ప్రకటించాడు. భీమ మండలంతో పాటు అతనికి అభిమాన పాత్రమైన ప్రదేశం రాజమహేంద్రవరం. ఆ పురవైభవాన్ని పరోక్షంగా భీమేశ్వర పురాణంలో ప్రశంసించాడు. (భీమే—1—43) ప్రాంతీయ నృత్య సంగీతాలపట్ల తనకుగల అభిరుచిని పరోక్షంగా పలుచోట్ల వెల్లడించాడు.

"దేశి మార్గములఁ దిన్నని రీతుల పాడి పాడి" (మార-3-82)
"అచ్చరలు పాము హిందోళ మాలకించి"
"క్రొత్తంతు చెగ్గాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్ష గాన
సరణి" (భీమే —)

"కన్గొనియె నా స్థానంబునన్ రాజన దన యుందానను
దేశి మార్గమున గంధర్వాప్సరో నృత్తముల్" (కాశీ-3-19)

కాశీ ఖండంలోని అగస్త్యుని దక్షిణకాశీయాత్రను స్వతంత్ర కల్పనతో సంతరించడంలోని పరమార్థం ఆంధ్ర ప్రాంతాభిమానమే కాక ఆంధ్ర పాఠక లోకానికి ఆ ప్రదేశాన్ని పరిచయం చేయాలన్న ఆలోచన కూడా వుంది. కనుకనే తన పర్యటన అనుభవాల్ని తాను చూసిన క్షేత్రాల్ని, స్థలాల్ని కన్నులకు కట్టించాడు. పట్టిన క్షేత్రం తాళ్ళపూడి, అనంత భోగేశ్వర స్థానం, రాజమహేంద్రవరంలోని కమలాద్రి, గోదావరీ తటంలోగల మార్కండేయస్వామి ఆలయం, వృద్ధ గౌతమికి రెండు ప్రక్కలా వున్న కోటిపల్లి కుండలేశ్వరాలు - ఇది అగస్త్యుని తీర్థ యాత్రాక్రమమేకాక శ్రీనాధుని యాత్రాక్రమమని కూడా మనం ఊహించడం సులభం.

అగస్త్యుడు కాశీ విరహ సందర్భంలో చెప్పిన "కమలలోచన ! మనుజుడొక్కటిఁ దలంప దైవమొక్కటిఁ దలచు టెంతయు నిజంబు (కాశీ-2-103) అనడంలో శ్రీనాధుఁడు కొండవీటిని విడిచి వెళ్ళినప్పటి దుఃఖం స్ఫురిస్తుందని విమర్శకులనడంలో ఎంతో సత్యముంది.

"ఆ మచ్చికఁ ఆ చనువా
ప్రేమాతిశయంబు విస్తరింపగ వశమే
భూ మండల తిలకమ ! పర
భూమికి నిన్నెట్లు వాసిపోవుదుఁ గాశీ" (కాశీ-2-135)

తన కొండవీటి వియోగ దుఃఖాన్ని యీ రూపంలో వ్యక్తం చేశాడని విమర్శకుల ఊహ.

ఈతడు కన్నడ, ద్రావిడ దేశాల్ని కూడా పర్యటించినట్లు కొన్ని చాటువుల్ని బట్టి గ్రహించగలం.

# నైతిక సాంఘిక జీవనం

## శ్రీనాథుడా ? స్త్రీ నాథుండా ?

శ్రీనాధుని కాలాన్ని గూర్చి శీలాన్నిగూర్చి చాలాకాలం పండిత లోకంలో తర్జన భర్జనలు జరిగాయి. ఈ వాదోప వాదాలకు వార, పక్ష మాసపత్రికలే వేదికలు. సంవత్సరాల తరబడి సాగిన ఈ వాద వివాదాలు వారి వారి మేధస్సుల్ని పదునెక్కించు కోవడానికి పనికివచ్చాయికాని సత్యాసత్యాలింకా సంశయాస్పదంగానే వున్నాయి. అయినా నిరాశకు ఇలాంటి సందర్భాల్లో తావుండదు. ఒరిపిడివల్ల వస్తువు నిగ్గుదేరేటట్లు, వాదోపవాద సంఘర్షణలో సత్యం నిగ్గు దేరడం సహజం.

శ్రీనాధుఁడు శృంగార ప్రియుడా ! అన్న అంశాన్ని గూర్చిన వాదోపవాదాలు కొంతకాలందాకా తీవ్ర రూపాన్ని దాల్చాయి. శ్రీనాధుని రచనల్ని పరిశీలిస్తే శృంగారపు ముద్ర లేనేలేదని చెప్ప సాహసించలేం. క్రీడాభిరామాన్ని పచ్చి శృంగారాన్ని ఒలకపోసే కొన్ని చాటువుల్ని అటుంచి తక్కిన రచనల్ని పరిశీలిస్తే ఒక వ్యక్తి జీవితంలో శృంగారానికి ఎంత స్థానం వుంటుందో అంతే ఆయన రచనలలో కనిపిస్తుంది. భక్తిరస ప్రదర్శనలో ప్రకటించబడ్డ శృంగారం భక్తి శృంగారమే కాని రక్తి శృంగారం కాదు.

క్రీడాభిరామం విషయం వేరు. ఇదొక ప్రత్యేక సందర్భాన్ని పురస్కరించుకొని వ్రాయబడింది. శ్రీకాకుళాంధ్ర దేవుని తిరునాళ్ళకు వచ్చిన ప్రజానీకాన్ని ఉద్దేశించిన గ్రంథం. ఏనాడయినా సామాన్య గ్రామీణ ప్రజానీకానికి ఏకైక వినోద విజ్ఞాన స్థానం తిరునాళ్ళే కదా! ఆ ప్రజల్లో ఉల్లాసోత్సాహాలు వుప్పొంగే ఏకైక సందర్భమిది. ఇలాంటి సందర్భాన్ని ప్రజల మానసిక స్థితిని దృష్టిలో వుంచుకున్న శ్రీనాధుఁడు ఈ గ్రంధాన్ని శృంగారపు ముసుగులో ముస్తాబు చేసి ఉండొచ్చు. ఈ ముసుగు తొలగిస్తే మనకు గమ్యమానమయ్యేది నాటి సామాన్య ప్రజాజీవన విధానం. వాస్తవ ప్రపంచంలో ఈనాడు ప్రజా జీవన గమనంలో ఎంత వైవిధ్యం కనిపిస్తుందో అంత వైవిధ్యాన్ని అతడు ఇందులో చూపించాడు. ఆనాటి ప్రజా జీవితంలోని కొంత కల్మషాన్ని ఎత్తి చూపించడానికి ఉద్దేశింపబడిందే కాని, దుర్నీతిని వ్యాపింప చేయడానికి కాదు. కులటలతో పాటుగా, కులకాంతల్నికూడా శృంగారపు రంగుటద్దాలలో చూపించినమాట వాస్తవమే. వీధిలో నడుస్తున్న ఒక అందమైన ఆడదానిని తల తిప్పిచూచి ఆహా అని మెచ్చుకోని మగవాడుండడు. అది మానవ సహజం. శ్రీనాధుడు పైగా రసికుడు, కవి. తాను చూచిన జడ పదార్థాలకే తన చేతివాసితో చైతన్యాన్ని ఇవ్వగల సమర్థుడు. అలాంటివాడు చైతన్యం తొణికిసలాడే స్త్రీల కచకుచాదుల్ని వర్ణించడంలో వింతలేదు. అందాన్ని తన కలంతో ఆరాధించినంత

మాత్రాన ఆత్మీయతా ముద్ర వేయాల్సిన అవసరం లేదు. కవి ఐనంత మాత్రాన మానవ బలహీనతల్ని అధిగమించాల్సిన అవసరమూ లేదు. అంతేకాక ప్రభు చిత్తవృత్తికే దాసుడైన శ్రీనాధుఁడు వారి నిమిత్తమే తత్ప్రీతికై వ్రాశాడని ఎందుకనుకోకూడదు ?

ఆనాటి వ్యవస్థలో భోగానుభవం ఒక విడదీయరాని అంశం. ప్రభువుల ప్రీతి కోసం వ్రాసిన వ్రాత కవినే జారునిగా మార్చే తలవ్రాత కాకూడదు. కేవలం మనసులో ఊహించి వర్ణించి "ఆహా" అనిపించే ప్రతిభావంతులుండొచ్చు. స్వానుభవం కంటె ఒక్కొక్కసారి పూర్వ గ్రంధ పఠనం, పరానుభవ వర్ణనం, వీనివల్ల కలిగిన అను భవం స్వానుభవం కంటె సహజంగానూ, బలీయంగానూ ఉండొచ్చు. అది కవి గొప్పతనాన్నే చాటుతుంది. కనుక శ్రీనాధుఁడు సానిని వర్ణించినా, సాతాని వెలదిని వర్ణించినా ప్రభువుల మెప్పుకోసమే పాటుపడ్డాడంటే తప్పులేదు.

వేశ్యల కానాటి సమాజంలో విశేష ప్రాధాన్యముంది. అన్ని కులాలలాగానే అదొక కులం. కర్ణాట వేశ్య, మేదర కరణ వేశ్య అనేటట్లు జాతి ప్రాతిపదికమీద వాళ్ళను పిలిచేవారు. ఈ వేశ్యావృత్తి ఆనాడు చట్టబద్ధమైందనడానికి "జారధర్మాసనం" ప్రత్యక్ష సాక్ష్యం వేశ్యల విటుల మధ్య ఏర్పడే కలహాలను పరిష్కరించే తాత్కాలిక న్యాయస్థానమిది. శాసనోల్లంఘనం చేసిన వేశ్యలకు, వేశ్యమాతలకు కఠినమైన శిక్షలు విధింపబడేవి. బ్రాహ్మణులు మొదలు మాలలదాకా బహిరంగంగానో, రహస్యంగానో పడుపు వృత్తి సాగింది. వేశ్యల్ని పోషించడం ఒక సామాజిక గౌరవచిహ్నంగా ఆనాటి ధనిక వర్గం భావించింది. మాచల్దేవి లాంటి ప్రఖ్యాతిగన్న వేశ్య ఓరుగల్లులో ప్రతాపరుద్రునికి ఉంపుడుకత్తెగా ఉంది. ఈ నైతిక విశృంఖలత్వం అధికార వర్గాల నుండి క్రమంగా ప్రజలలోకి ప్రాకిందనడానికి ఈ క్రింది ఉదాహరణలు చాలు.

"వేశ్యవాటిక మధ్య వీధిఁ దఱిసి చిత్తమున కెక్కినట్టి
లంజియల తోడ సరస సల్లాప సౌఖ్యంబు సలుపవచ్చు".
(క్రీడా - పు. 36)

"క్రొత్త లంజెల కాముంక సూత్రముడవు. (క్రీడా - పు. 64)

"ఎందఱితివల నలపించి తెచటనెచట" ( ,, - పు 64)

"పరనారీ సంగ మాదుల్ భగవదనుమతిం బాపముల్
గాక యుండున్" (క్రీడా - పు 66)

"ముకుర వీక్షా విధానంబు మొదల లేక నెల పదారింటికిఁ
గారాదు విటుని గవయ" (క్రీడా - పు.62)

"వారకాంతను దల్లి, దాసి, యుప్ప, చెలియలు, కూతురు దాది యని కేళికా గేహంబునం బరిహరించుట విట ధర్మంబు గాదు" ((క్రీడా - పు. 82)

బ్రాహ్మణ పూటకూటి యిండ్లుకూడ వ్యభిచార నిలయాలుగా ఆనాడు ప్రసిద్ధి కెక్కాయి. వితంతువుల వ్యభిచారం బాగా వ్యాపించింది ఏకపత్నీవ్రతం సంఘంలో చాలా అరుదు. ఆస్తి, అధికారం దర్పం వున్న పెద్దలు ఇద్దరులేదా ముగ్గురు భార్యల్ని స్వీకరించడం సామాన్యం. అనాటి వైవాహిక నైతిక జీవితం ఎంత కల్మషపూరితంగా ఉందో తెలిసికొనడానికి ఒక్క క్రీడాభిరామం చాలు. ఈ వ్యభిచారం ఆనాడు ఇంతగా ప్రబలడానికి కొన్ని కారణాలు మనం ఊహించొచ్చు.

1) ధనవంతుల భోగలాలసత.
2) బాల్య వివాహాలు
3) నిరంతర యుద్ధాల ఫలితంగా సమాజంలో అనాధలుగా మిగిలిపోయిన విధవలు.
4) పరిస్థితుల ప్రాబల్యంవల్ల స్త్రీలపై విధింపబడ్డ విశేషఆంక్షలు.
5) భరింపరాని పేదరికం.

రాజధానుల్లోనేకాక వేశ్యలానాడు గ్రామీణప్రాంతాల్లో కూడా ఉన్నారు. వలివెల గ్రామ మానాడు వారకాంతలకు ప్రఖ్యాతి చెందిందట! ఇది కోనసీమలో ఒక పుణ్యక్షేత్రం. జన సంచారం ఎక్కువగా ఉండే యాత్రా స్థలాలలో వేశ్యవాటికలు విరివిగా ఉండడంలో వింతలేదు. నైతిక పతనం చెందిన విధవల్ని ఆనాడు సమాజం బహిష్కరించి పాపపరిహారార్థం పుణ్యక్షేత్రాలకు పంపడమే హిందూ ఆచారమైతే, ఆ ఆచారమే వేశ్యల్ని సృష్టించడంలో వింతేముంది ?

ఆర్థిక తారతమ్యాల్నిబట్టి వేశ్యల్లోకూడా అంతరాలున్నాయి. ఆనాడు మాచల్దేవి భవనం అత్యంత సుందర భవనాలలో ఒకటి. చందనపు కలయంపులు, ఇందురజపు రంగవల్లులు, కంజముల తోరణాలతో వెలిగే వేశ్యవాటికలొకవైపు— "ఉలిమిడి చెక్కయున్ మిగులనుక్కయు, జవ్వని రొట్టెముక్కయున్ మలినపు గుడ్డతో" అసహ్యంగా ఉండే నిర్భాగ్యుల కొంపలు మరొకవైపు. రాజాశ్రయం దొరికిన కవుల పైనా, కాంతలపైనా కనకవర్షం కురిసిందానాడు. అలాంటి పరిస్థితులలో వలివెల వంటి పల్లెలలో వేశ్యలపై పేదరికం తన ప్రభావాన్ని చూపడంలో ఆశ్చర్యంలేదు. అయినప్పటికి గ్రామసీమలలో ఒకరో ఇద్దరో సంపదగల వేశ్యలుంటే ఉండొచ్చు. అలాంటివారు బెండపూడి అన్నయామాత్యుని వంటివారికే ఎసరు పెట్టగల ఎలనాగలు. "కాంచీ కంకణ తార హార కటక గ్రైవేయ భూషావళులే లంచం పెట్టగల లక్షాధి కారిణులు !" (భీమ - 1 - 17)

"రాయవేశ్యాభుజంగులు", "పంచారామ వధూటీ పంచాస్త్ర విహారకేళి పాంచాలు"రున్నచోట వేశ్యల వైభవానికేం కొదువ ? ఈ విధమైన నైతిక విశృంఖలత్వం ఆనాటి సమాజంలోని ప్రధాన బలహీనతలలో ఒకటి. ఒకవైపు సాహిత్యం, కళలు వర్తక వాణిజ్యాలు అభివృద్ధి పొంది నాగరకత నాలుగు చెఱగులూ వ్యాపిస్తూ ఉంటే, మరొకవైపు సాంఘిక నైతిక జీవనం అత్యంత కలుషితమైపోయి వీటలు వారడం గమనార్హం. కులవ్యవస్థపై, ఆర్థిక అంతరాలపై మూఢనమ్మకాలపై ఆధారపడ్డ ఆనాటి రాచఱికపు వ్యవస్థయొక్క నైతిక జీవన స్వరూపమిది.

## సహగమనం

శ్రీనాథుని ఒకటి రెండు రచనలలో సహగమనమొక సాంఘికన్యాయంగా మనకు గోచరిస్తుంది. కాని ఇది నిర్బంధ విధానం మాత్రం కాదు. ముఖ్యమైన ఉదాహరణలు మనకు మూడు కనిపిస్తాయి.

1) కళావతి కథ. (కాశీఖండం)
2) పేరిందేవి (పల్నాటి వీరచరిత్ర)
3) అనపోతు అర్ధాంగి(పల్నాటి " )

కళావతికి పూర్వజన్మలో సుశీల అనే పేరుంది. ఈమె కాశీనివాసి హరిస్వామి కూతురు. ఒక విద్యాధరుడీమె అందానికాశించి ఎత్తుకొనిపోయిన పాపకార్యాని కాతన్నే పతిగా భావించి, ఎలాంటి నిర్బంధం లేకుండానే భర్తతో సహగమనం చేసింది. పలనాటి వీరచరిత్రలో పేరిందేవి సహగమనం ప్రత్యక్ష కథనం కాకున్నా

"ఆడు బిడ్డను చంపి అల్లుని జంపి
హింసకు రోయవి హీనవర్తనుఁడ" (పల్నాటి పు. 22)

అని దూత భట్టుమూర్తి నలగామున్ని తూలనాడడంబట్టి,

"మన అక్క వెలలేని మాణిక్య మరియు
చచ్చి ఆ కైలాస శైలంబునందు
అలరాజు గలిసిన దాక్షిణ్య సరణి" అన్న పాదాల్నిబట్టి మనం

ఊహించాలి. అలాగే అనపోతు దహన సంస్కార క్రియా సందర్భంలో

"తగు శాస్త్ర మార్గంబు తప్పిపోకుండ
జాయ వెంబడినేగ సమ్మతి రాగ
దంపతులిద్దరి దహనానకిచ్చి
చనిరి దేహములకు స్నానముల్ చేసి" (పల్నా)

అని ఉంది.

ఈవిధంగా సహగమనం చేసిన స్త్రీల కానాడు పూజ్యస్థానం కల్పింపబడింది. కాశీఖండంలో శివశర్మ అనే విప్రుడు వార్ధక్యం పైబడగా పశ్చాత్తప్తుడై "పేటాం డ్రను నర్చింప నేరనైతి" అంటాడు.

కాశీఖండంలోని ఉపాఖ్యానాలలో కళావత్యుపాఖ్యానం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. మూలాన్ని అతిక్రమించడంవల్ల కథాగతిలో కలిగిన మార్పే ఆ ప్రత్యేకత.మూలంలో సుశీల తన ఉత్కటమైన విరహబాధను సహించలేక మరణించింది అని ఉంటే అనువాదంలో ఆమె సహగమనం చేసినట్లుగా మార్చబడింది.

"......అనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుబోలె
కొసర కగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి"

కవి ఇలాంటి మార్పెందుకు చేశాడనడానికి కాలప్రభావమే కారణంగా చెప్పొచ్చు. చరిత్రకూడా దీనికి తోడైంది. కాకతీయ సామ్రాజ్యం క్రీ॥శ॥ 1323 లో మహమ్మదీయుల వశమైంది. పతివ్రతల్ని చెఱబట్టడం, గో బ్రాహ్మణుల్ని హింసించడం మొదలైన అత్యాచారాలు మిన్నుముట్టాయి. ముసునూరిప్రోలయ నాయకుడు మొదలైన వీరులు మహమ్మదీయుల్ని మట్టికరిపించి ఆంధ్ర సామ్రాజ్యం స్థాపించినప్పటికీ ఆంధ్రుల్లో ఐకమత్యం చెడిపోయింది. అంతఃకలహాలు ప్రారంభమయ్యాయి. కాపయ నాయకుని అవివేకం కారణంగా బహమనీ సుల్తానులు తఱచుగా దండయాత్రలు సాగిస్తూ హింసాకాండకు పూనుకున్నారు. ఆనాడు తురకల్లోగల ఐకమత్యం ఆంధ్రుల్లో లేదు. తురకల దౌర్జన్యానికి ఆంధ్రులు ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకొని బ్రతికారు. స్త్రీల మాన ప్రాణాలకు రక్షణ లేకుండా పోయింది. అలాంటి వాతావరణంలో స్వజన, స్వధర్మ రక్షణ కోసం విపరీతమైన కొన్ని కట్టుబాట్లు ప్రచారంలోకి రావడం తప్పనిసరి అయింది. అలాంటి నియమాల్లో సహగమనం ఒకటి. దీన్ని ప్రోత్సహించడమే కాకుండా స్త్రీలను ఎన్ని విధాలుగా అణచి వుంచగల కట్టుబాట్లున్నాయో, అన్నింటినీ అనాటి సమాజం ఉద్ధరించింది. మొదటినుంచి ప్రచారంలో వున్న పాతివ్రత్య ధర్మాలు మరింత పదునెక్కాయి. వీటిని ప్రచారంలోకి తేవడానికి కవులు, పండితులు కూడా పాటుపడ్డారు. కాశీఖండం యొక్క ద్వితీయాశ్వాసంలో బృహస్పతి లోపాముద్రకు పతివ్రతా ధర్మాలు చెప్పే ఘట్టమొకటుంది. అందులో సహగమనం పతివ్రతా ధర్మాల్లో అత్యుత్తమమైందిగా వర్ణింపబడివుంది.

"చిచ్చులకబోవు నికచ రాజీవనేత్ర
కశ్వమేధంబు ఫలము తథ్యంబుగలుగు (2-86)

"భర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్నినుఱికిన యట్టి పద్మాయ తాక్షి ఆ-ప (2-87)

"ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్య వర్షంబులన్ని మోదించు సాధ్వి
నాక భువనంబు నందాత్మ నాథుఁగూడి
వెఱపొకింతయు లేక చిచ్చు జికెనేని" ఆ-ప (2-91)

అంటూ భర్తను కోల్పోయిన స్త్రీ చిచ్చులోకి ఉరికి మెచ్చు పొందడానికి ఎన్ని ఉచ్చులు వన్నాలో అన్నింటిని ఆనాటి సాహిత్యం సమకూర్చి పెట్టింది. అంతేకాదు ఒక పురుషునికి స్త్రీ ఎన్ని విధాల లొంగి ఉండడాని కవకాశాలున్నాయో అన్నింటిని అమలులో పెట్టడానికి ప్రయత్నించారు. ఆనాటి పురుష ప్రాబల్యానికి ఈ క్రింది సీస పద్యం సరైన మచ్చు తునక.

పతిపిల్వ బంచినఁ బనియేమి యనివచ్చి
చెప్పిన యుసిగంబు సేయవలయు
భర్త యానతి లేక ప్రకృతి బంధునికైన
నే పదార్థంబును నీగి పెట్ట
జీవితేశ్వరుఁడు ఉంచిన యాగిరంబును
గుత్స సేయక భుక్తి గొనఁగఁదగవు
సుఖ సుప్తుఁడగు విభుఁ బ్రబోధ మొనర్పఁ
గా దనుష్ఠాన భంగముల దప్ప
నొంటి నే చోటి కరుగుట యుక్తిగాదు
తమపు గట్టక నీరాడఁ దగవు గాదు
కడపమీదను, మఱి సన్నెకంటిఁ మీదఁ
జక్కిమీఁదను గూర్చుండ జాడగాదు (2-75)

ఇంకా భర్తముందు నాగరకత్వం వాచాప్రాగల్భ్యం చూపకూడదు.

—భర్త సంతోషిస్తే సంతోషించాలి సంతాపిస్తే సంతాపించాలి-
(కాశీ-2-78)

—మగడు కోపిస్తే అలుగరాదు ఆ ప (నైష-7-9)

—ఏకాంత వేళ్ళల్లో కాంతుని ఎదుట ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి

—స్త్రీకి పురుషుడే ఆధారం (పల్నా-పు 68) (కాశీ-3-63)

భర్త ఆదరించినా ఆదరించకపోయినా పతే ప్రత్యక్షదైవం. పతి తన ధర్మాన్ని నిర్వర్తించకపోయినా ఇదేమని ప్రశ్నించకూడదు. మాంచాల భర్త ప్రవర్తనను

అత్తతో మాత్రం చెప్పి "సరిచేసి యీ మాట సభ నెన్న రాదు" అని అనాటి సాంఘిక మర్యాదను పాటించింది, సంఘనిష్ఠమైన న్యాయం అట్లా వున్నా మనో నిష్టమైన ధర్మం మాంచాల పక్షమే! ఈ విధంగా న్యాయధర్మ సంఘర్షణం మధ్య ఎందరు మాంచాలలు నలిగిపోయినారో ?

పై ఉదాహరణల్ని బట్టి చూస్తే ఆనాటి భార్యాభర్తల సంబంధం కేవలం ఒక యజమానికి దాసీకి మధ్యగల సంబంధం లాంటిదేనని స్పష్టమౌతుంది. భార్యాభర్తల మధ్యగల ఆర్థిక సంబంధమైన కీలక రహస్యాన్నొకదాన్ని సూచించాడు శ్రీనాథుడు. ఒక భార్యభర్తకు సేవలు చేయడంలోగల పరమార్థం "అర్థమే !"

"ప్రార్థితంబైన ధనమెంతయైన నిచ్చు
ప్రాణనాథుని సరియే యే బంధువులును ? (కాశీ-2-82)

వండిపెట్టడం, విహారశయ్యపై ఊరువు లొత్తడం మొదలైన ధర్మాల్ని పాటించడానికి కారణం ఆమె ఆర్థిక నిస్సహాయతేనని పరోక్షంగా శ్రీనాథుఁ డంగీకరించినట్లే కదా !

విధవలపట్ల ఆనాడు సమాజం యొక్క కఠిన వైఖరి, సమాజంలో వారికిగల దయనీయ స్థితి భారతీయ సంస్కృతికే ఒక దుస్థితి !

"బైసిమాలిన పరమ నిర్భాగ్యురాలు
విధవ, దాని యాశీస్సు విష సమంబు" (కాశీ-2-85)

"పతిఁబాసి వితంతుత నొందినట్టి రాజీవ దళాయ తాక్షి యశుచిత్వము సహస్ర ఘటంబుల అవ బృథాభిషేక మాచరించినను" తీరదట ! కనుక సూర్యోదయానికి ముందు విధవ దర్శనం కూడదు. పతితో పరలోకానికి పోలేక జీవించి వున్న జీవన్మృతుల జీవిత మిది ! కనుకనే సుశీల "విధవనై జన్మమెల్లను వేగజాల"నని వేగంగానే చితి పేర్చుకున్నది !

పైన వివరింపబడ్డ దురాచారాలు కొన్ని వ్యాసుని కాలంలో కూడా ప్రచారంలో వున్నాయి. కాకపోతే మధ్య యుగంలో మరింత తీవ్ర రూపాన్ని దాల్చాయి. శ్రీనాథుఁడు సాంఘిక దృక్పథం కొంత కలవాడు కావడంచేత దేహళీదీప న్యాయంగా తెలిగించాడని తలంచాలి. ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. కొన్ని పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఏర్పడ్డ తాత్కాలికమైన కట్టుబాట్లు శాశ్వత సాంప్రదాయాలుగా మారిపోవడానికి చరిత్ర సాక్ష్యమిస్తుంది. ఏ సంఘంలో అవసరానికి మించిన ఆంక్షలు కట్టుబాట్లు, ఆచారాలు నిర్బంధ విధానం అమల్లో వుంటుందో ఆ సంఘంలో అవినీతికి అంకురార్పణ జరిగినట్లే భావించాలి. తిరిగి అవినీతిని అణచడానికి కట్టుబాట్లు ఇదొక విష వలయం లాంటిది. వేలాది సైనికుల మరణాలు వయసులో వున్న విధవల్ని

వ్యాప్తి పరచాయి. కఠినమైన కట్టుబాట్లు స్త్రీలను జారిణులుగా మార్చివేశాయి. జారిణులున్న సంఘంలో సుకుమారులు, గుణ నిధులుండడంలో వింతలేదు కదా! ఒకవంక నైతిక విశృంఖలత్వం ఎంత ప్రబలినా, మరొకవైపు వేశ్యాలంపటత్వం పాపం అన్న భావానికి కూడా అంకురార్పణ జరిగింది.

"కలధనమెల్ల భోగినులదాని కిచ్చి
చేసితి పాపంబు చెడ్డవెచ్చంబు
ఇహ పరదూరపు టీ వృత్తి యేమి"

అంటూ అనపోతు బాలచంద్రుని మందలించడం ఒక విధంగా నైతిక పతనానికి ప్రతిఘటనయే.

## భోజనం - ఆచార వ్యవహారాలు - క్రీడలు

మన జీవితావసరాల్లో ప్రప్రథమంగా పేర్కొనదగింది భోజనం. శ్రీనాథుడు వర్ణించిన ఆనాటి భోజన పదార్థాల్ని రుచి చూసిన విమర్శకులు అతన్ని భోజన ప్రియుడన్నారు. శ్రీనాథుడు భోజన ప్రియుడు కావడం అటుంచి మనమే భోజన ప్రియులుగా మారే అవకాశముంది !

నైషధంలో బువ్వపు బంతి ఆ వ (6-20) ఘట్టంలో వివిధ రకాలైన వంటకాల్ని శ్రీనాథుడు మన ముందుంచాడు. గోధుమ సేమ్యాలు, పూరీలు, ఖండశర్కరలు, జున్ను, పల్చనిదోసెలు-వీటిని మరీ మరీ వర్ణించడం గమనించొచ్చు. ఛాయపప్పు, బూరెలు, లడ్లు ఈనాడు కూడా తెలుగుదేశపు ప్రత్యేకతను నిలిపే వంటకాలు. అన్నపూర్ణాదేవి లేత తెలినవ్వు వెన్నెలలతో సమానమైన పాయసం క్రొత్త నేతితో, తెల్లని పులకండపు పొడముల్తో కూడి గుబాళిస్తుంది. భీమేశ్వర పురాణం ద్వితీయాశ్వాసంలో భోజన వర్ణన విపులంగా వుంది. పంపా తద్వక్ష దేశీయమైన ఒక స్త్రీ వ్యాసుణ్ణి భోజనాని కాహ్వానించిన సందర్భాన్ని ఊతగా తీసుకొని పిండి వంటల్ని కమ్మగా వర్ణించాడు. అవి వడ్డింపబడిన లేత చిగురాకుల్ని సైతం వర్ణింపకుండా వదల్లేదు. కాశీ ఖండంలో దాదాపు నూరు వంటకాలు చెప్పబడ్డాయి. (కాశీ 7-145) ఆ పట్టికలోని "లడ్డు కంబులు, ఇడ్డెనలు, కుడుములు, దోసియలు, సేవియలు, పొట్టియలు, చక్కిలములు ఇప్పటికీ ఆంధ్ర కుటుంబాల ఆహారంలో భాగాలే. కొన్ని పదార్థాలు మారు పేర్లను సంతరించుకొని మరుగుపడి ఉన్నాయి. శివరాత్రి మహాత్మ్యం, క్రీడాభిరామం- వీటిలోని వంటకాల్ని కూడా అతడు రుచి చూపించక వదల్లేదు. మొత్తంమీద కపురపు భోగి వంటకం, గోధుమ పిండి వంటలు, పెసరపప్పు నంజులు ప్రతి భోజన వర్ణనలో చెప్పడంచేత అవే ఆనాటి ప్రజల ప్రియమైన ఆహార వస్తువులుగా మనం ఊహిం

చొచ్చు. తెలుగువారి భోజనంలో తప్పొనసరైన నేతి వాడుకను శ్రీనాథుడు మరువలేదు. [నైష - 6-124]

పంది మాంసాన్ని ఆనాడు రాజులు మొదలు రైతుదాకా అతిప్రియంగా భుజించారు. [నైష] హర విలాసంలో మాంసాహారం వండే విధానం వర్ణితమైంది. మిరియాలు, ఉల్లిపాయలు, పసుపు, జీలకర్ర, పెరుగు—వీటితోపాటు ఈనాటి మాంస పాకంలో పనికి రాని మెంతులు, ఇంగువ, పంచదార కూడా ఉపయుక్తాలుగా ఆనాడు వున్నాయి. పంది మాంసపు వంటకాన్ని "జంబీర రసంతో, నూనెతో అవంబెట్టిన రుచిని మనకందించాడు· [నైష-6-127] మెత్తని మాంసాన్నేకాక మూల్గలతోకూడిన ఎముకల్ని, నెత్తుటిని కాయగా వచ్చిన నల్ల బారును కొవ్వుబారును కూడా శ్రీనాథుడు వర్ణించడం ఒక విశేషమే !

ధనవంతుల భోజనాన్నేకాక అతిసామాన్య తెలుగు ప్రజల భోజనాన్ని కూడా వర్ణించాడు. ఫలోపహారాల్ని వదలి మృడుడు చలిదిముద్దల్ని మ్రింగడం [కాశీ] మూలంలోని మామిడి పండును వదలి తాటిపండును ఆరగించడం [కాశీ–5–81, కాశీ-1-114] పీఠికాపురవర్ణనలో మూలంలో లేని బొట్ల, కాకర, దోస, పెరుగుతోటకూర, ముల్లంగి నీరుల్లి, సిర్రికూర మొదలయిన శాక విశేషాల్ని దూర్చడం ఉదాహరణంగా చెప్పొచ్చు. వ్యాసునిచేత సర్వపురంలో చేయబడ్డ శని వారోత్సవాన్ని తెలుగు పిండి వంటల్తో తెనిగించడం స్థానికాహారంపై ఆయనకు మక్కువ ఎక్కువని తెలుసుకోవచ్చు.

ఆనాటి రాజప్రాసాదాల్లోని సభా భవనాల్లో గోడలు కనబడకుండ చిత్రపటాల్ని వ్రేలాడదీయడం ఒక కళ. ఇప్పటికి గ్రామసీమల్లోని కొన్ని యిండ్లలో చిత్రపటాల ప్రదర్శన మనం చూడొచ్చు. నలగామరాజు సభా మంటపం, బాలచంద్రుని మామ ఇల్లు ఇలాగే అలంకరింపబడ్డాయి· ముఖ్యంగా శ్రీరామ కథలు. శ్రీకృష్ణ కథలకు సంబంధించిన చిత్రపటాలే ఎక్కువ. "ముంగిట గోమయంబున గోముఖము దీర్చి కడలు నాల్గుగ్రముగ్గుకట్టు పెట్టడం" మన నిత్యచర్యల్లో ఒక భాగమే. [కాశీ-7—142]

వివాహాది శుభకార్యాలకు సూచనగా నగరాల్లో లేదా రాచనగరాళ్ళలో లేదా ఉన్నతాధికారుల నగళ్ళలో గంటల్ని మ్రోగిస్తే, అది విని ప్రజలు శుభకార్యాల్ని కొనసాగించేవారు. గంటారావానికి అవకాశంలేని పల్లెల్లో పురోహితుడు"గడియ కుడుక" అనే గిన్నెల్ని నీటిపై ఉంచి అవినిండి మునిగేక్షణంలో శుభకార్యాల్ని జరుపుకోవడం ఆనవాయితీ ఉండేది. ఈనాటికీ వివాహ సందర్భంలో ఐరేని కుండలపైన గడియ కుడుతలనే పేరుతో మట్టి పాత్రల్ని ఉంచడం పరిపాటి.

దమయంతి వివాహ సందర్భంలో ఆమెను ముత్యాల చలికలో స్నానం చేయించి "నిజకులాచార సరణి" ఆమె చేతికి "గన్నెరాకము" [గన్నెరాకు వంటి అలుగు ఉన్న బాణ విశేషం] ఈయబడింది. ఇది ఆనాటి ఆచారంగా భావించాలి. యవన దండయాత్రల నుంచి ఆత్మరక్షణ కావించుకోడానికై స్త్రీలచేత ధరింపజేసిన

ఆత్మరక్షణా సాధనం యొక్క అవశేష రూపమిది కావచ్చు. ఈనాడు కూడా కొన్ని వివాహాల్లో వరునిచేత ఆనాటి కత్తికి అవశేష రూపమైన అడకత్తెర పట్టించడం కనిపిస్తుంది.

వివాహ సమయంలో పెండ్లి పందిట్లో వున్న పెద్దలచేత, ముత్తయిదువులచేత ఆశీర్వదింపజేయడం లోక సహజం. శ్రీహర్షుడు సరస్వతిచేత వరాలిప్పించాడేగాని ఆశీర్వదింపజేయలేదు. "ముత్తదువపై విజేశ్వరుని యర్ధ శరీరము పాలుగొమ్మ"ని శ్రీనాధుఁడు దమయంతిని ఆశీర్వదింపజేశాడు.

శుభకార్యానంతరం విప్రాంగనలకు మ్రొక్కించడం శుభావహమన్న అభిప్రాయము ఆనాడూ ఈనాడూ ఉన్నదే. [నైష-6-14] వివాహ సమయంలో వధూవరుల చెట్టఁబట్టించడం [నైష-6-104] వధువు తలిదండ్రులకు పట్టువస్త్రాలియడం [నైష-6-97] పెండ్లి పందిట్లోని పేరటాండ్ర ముచ్చట్లు !

దమయంతి శిరోపచారాల కుపయోగింపబడ్డ గొజ్జగినీరు,వట్టివేర్ల వింజామర, చందన స్నానం, పుప్పొడి శ్రీనాధుఁడు సమకూర్చిన తెలుగు వస్తువులే. [నైష-2-140] నైషధ భూమి భర్తకు తెగవారెడు వెంట్రుకలున్నాయి. కనుకనే "చెంగలువలు జాజులుంగలయఁ గమ్మని పువ్వుల సేసకొప్పు దావల కొరుగంగ" పరిచారికలు తీర్చిదిద్దారు. [నైష-6-51] ఈతఁడు దేవపూజా గృహంలో ప్రవేశించేటప్పుడు "సీమంత మేర్పడఁ జికుర ధారమును సుశ్లిష్ట బంధముగ శిఖయమర్చు"కున్నాడు. ఈతడు కట్టిన సలిల కాషాయవస్త్రం తెలుఁగువారు కట్టే నీర్కావి ధోవతే. [నైష-8-103], అర్చనలో ఉపయోగింపబడ్డ చెంగల్వలు, బంతి, చేమంతి, బొండు మల్లెలు తెలుఁగు వారనల్ని వెదజల్లేవే. చిఱు గజ్జెలు, గండపెండారం, మద్దికాయలు, ముత్యాల రావిరేక వజ్రాల కమరు చంటిపిల్లలకు అలంకరించేవే. [కాశీ-3-241] పెద్దవారికి తలపాగా తప్పనిసరి. పసిడి కమ్ముల పట్టుపచ్చడాలు, అలాంటివే చీరెలు ఆనాడు బాగా ప్రచారంలో ఉన్నట్లు స్పష్టంగా చెప్పొచ్చు. ఆనాటి మనుగుడుపు పెండ్లికొడుకు రూపమెలాంటిదో హర విలాసంలో కనిపిస్తుంది. [హర-5-5]

కొండవీటి ప్రాంత మానాడు కవులకు కాణాచి. కవిత్వాన్ని ఆదరించి కనకాభిషేకాలు చేసే రాజులున్నచోట కవులకేం కొదవ ? ఎక్కడ చూచినా కవితా రచనలే, గోష్ఠులే. దానితో రాశిపెరిగి వాసి తగ్గిపోయింది. అసమర్థుల రచనల్ని అపహాస్యం చేయడానికై గాడిద నుద్దేశించి చెప్పిన చాటువు అలాంటి కవుల కొకపోటు. గురిజాల సీమకు చెందిన గ్రామాలలో, తనను అనాదరించిన కాపుల్ని, కరణాల్ని దుయ్యబట్టిన చాటు వొకటుంది. ప్రజలపట్ల ఆనాటి గ్రామ పెత్తందార్ల ఉదాసీన వైఖరికిది ప్రత్యక్ష సాక్ష్యం. మొసర రాజ్యానికి వెళ్ళినప్పుడు అక్కడి ప్రజల వేష భాషల్ని చాలా అనాగరికమైనవిగా వర్ణించాడు.

వంకర పొగలు, నడుము వంగిన కత్తులు, మైలకోకలు, సంకటి ముద్దలు, జనుప శాకాలు, ఏనబాసలు-ఇదీ వారి జీవితం. అరవవారిని కూడా మిరియపుముద్దలు తినే అనాగరకులుగా వర్ణించాడు. కంచిలో వారింటి వంటకం మ్రింగి మంటరేగి చెప్పిన చాటు వున్నది.

విజయనగర రాజదర్బారీ వేషం అతిచిత్రంగా ఉంటుంది. పొడవైన అంగీ, పొడవైన టోపీ, మెడలో ఒక సెల్లా, ప్రయోజనాన్ని ఆశించిపెళ్ళిన శ్రీనాధుడీ వేషం వేయక తప్పలేదు. గోలకొండ వ్యాపారుల పొడవైన గడ్డాలు శ్రీనాధునికి భయం కలిగించాయట.

సర్వాంధ్ర కవులలో చాటు పద్యాలు లెక్కకు మిక్కిలిగా చెప్పిన ఏకైక కవి శ్రీనాధుడు. దేశ సంచారమే ఈ చాటు పద్య రచనకు ప్రేరకమైంది. తాను తిరిగిన తావుల్లో తన కష్టసుఖాల రూపంలో స్పందింపజేసిన సన్నివేశాలే చాటువుల రూపం ధరించాయి. కనుకనే వాటికంత పదును. రాజుల్ని ఆశ్రయించుకొని ఉండి వారి ప్రశంసలే పరమావధిగా జీవించిన శ్రీనాధునకి దేశ సంచారం ప్రజల వాస్తవ జీవితం లోకి వారి ఆశయాల్లోకి తొంగి చూచే అవకాశం కల్పించింది.

## మతం

శ్రీనాధుని కాలం నాటికి మహమ్మదీయుల దాడులింకా ముమ్మరంగానేసాగాయి. అవి ప్రజల సాంఘిక మత జీవనాన్ని అస్తవ్యస్తం చేశాయి. వర్ణ వర్గ విభేదం లేక కొందరు ప్రజలు బలవంతంగా మతాంతరీకరణానికి గురైనారు. బ్రాహ్మణాధిక్యతను, తమపట్ల అధికార వర్గాల ఉపేక్షను చవి చూచిన మరికొందరు క్రింది తరగతి ప్రజలు స్వయంగా ఇస్లాం మతంవైపు ఆకర్షింపబడ్డ సంఘటనలుకూడా లేకపోలేదు. మొత్తం మీద ప్రజానీకమంతా ఒక భయావహమైన, అస్థిరమైన జీవనానికి గురైనట్లు ప్రోలయ నాయకుని విలసతామ్ర శాసనంలోఉన్న విషయాన్ని సురవరం వారు తమ గ్రంథంలో వివరించారు. [అం. సా. చ. పు 104]

ఇలాంటి భయావహమైన కష్టతర వాతావరణంలో శైవవైష్ణవాలు ప్రజలకు శీతల పవనాలై తాకి ఉపశమనాన్ని కలిగించాయి. ప్రధానంగా శైవమతం విజృంభించి ప్రజల మత జీవనానికి ఒక మార్గం చూపింది. ఆ రోజుల్లో ప్రభువు మతమేదో ప్రజల మతం కూడా అదే కనుక శైవమత వ్యాప్తికి మరింత దోహదం లభించింది. అధికారులు కూడా రాజానుమతాన్ని పాటించి శైవమత వ్యాప్తికి తోడ్పడ్డారు. ఆంధ్ర దేశంలో ఈ పాశుపత మత వ్యాప్తికి తేరంబి మఠం ముఖ్యకారకమైంది. గోళకి మతా ఛార్యులు ఈ శాఖను మరింత పటిష్ఠం చేయడానికి ప్రయత్నించారు. ఈ శివాచార్యు లంతా రెడ్డి ప్రభువులకు గురుత్వం నెఱపడమే కాకుండా దేవాలయాలకీ మఠాలకీ

స్థానాధిపతులై తమ ప్రాబల్యాన్ని ప్రకటించారు. శ్రీశైలం, దాక్షారామం, త్రిపురాంతకం మొదలయిన ప్రదేశాలు పాశుపతానికి ఆనాడు ముఖ్యకేంద్రాలు.

ఈ మతమానాడు ప్రజల్లోకి బాగా చొచ్చుకొని పోయింది. పాశుపతులకు లింగధారణం ప్రధానం. చేతుల్లోగాని, వెంట్రుకల్లోగాని ఈ లింగాన్ని ధరిస్తారు. నకులి, మైత్రేయ, కపిలేంద్ర, అత్రి, పింగళ, అగస్తి - శివుని యొక్క ఈ అవతారాల్ని వీరు పూజించారు. "వీర శైవ దర్శనంలో స్థలం, లింగం, అంగం అనేవి చాలా ముఖ్యమైన పదాలు. 'స్థల' పదానికి "విశ్వానికి ఆధార భూమి" అని అర్థం. ఈ స్థలం పరతత్వం. ఈ పరతత్వమే జీవులపట్ల జాలితో లింగ రూపాన్ని దాల్చి ఉపాస్య దేవత ఔతుంది లింగా రాధన చేసే జీవుడే అంగం. ఇతడే ఉపాసకుడు లేదా ఆరాధకుడు. పరిమ దైవతమైన లింగానికీ, పరిమిత జీవుడైన అంగానికీ అభేదం. ఈ అంగం లేదా జీవుడు తన అవధులన్నింటినీ నిర్మూలించుకొని తనలో తానే నిరవధిక మహాతత్త్వాన్ని సాక్షాత్కరింప జేసుకోవాలి. అలాంటి ఆరాధన కోసం ఇష్ట-లింగాన్ని శరీరంపైన ధరించి ఆరాధనా భావాన్ని అభ్యసించాలి దీనివల్ల శివుని గూర్చిన అచంచల ధ్యాన సమాధి సిద్ధిస్తుందని వీరి నమ్మకం" [విజ్ఞా - పు 700] కనుక లింగ ధారణం వీరికి చాలా ముఖ్యం. అందుచేతనే

"కక్ష కరస్థల కంఠో త్తమాంగ
వక్షస్థలాదిక వర లింగ ధరులు" [బసవ-పు 33]

ఆనాడు లెక్కకు మిక్కిలిగా ఉన్నట్లు తెలుస్తుంది. ఈ లింగధారణం శ్రీనాధుని గ్రంథాల్లో ఒకటి రెండుచోట్ల కనిపిస్తుంది. వీర శైవమతస్థులైన జంగాల ప్రస్తావన పలనాటి వీర చరిత్రలో ఉంది.

"యుద్ధ సన్నద్ధులై యుర్వికంపింప
వారితో డనెకూడి వడియు జంగాలు
నల్లబొంతలవారు నాలుగు వేలు
ఎర్రబొంతలవారు ఎనుబది వేలు
ఉరమున లింగాలు మెరిసెడివారు
గళమున రుద్రాక్ష గలిగినవారు." యుద్ధంలో పాల్గొన్నారు.

దాదాపు 11 వ శతాబ్దం నుండి ఈ వీర శైవోద్యమం ప్రచారంలో ఉంది. రెడ్డిరాజుల కాలం నాటికీ ప్రచారం మరింత ఉధృత రూపం దాల్చింది. రెడ్డి రాజుల్లో చాలామంది శైవులై తమ ప్రభుత్వ యంత్రాంగాన్ని శైవమత ప్రచారానికి ఉపయోగించడం ఒక విశేషం. రాజులే మతాన్ని అవలంభిస్తే ప్రజ లదేమతాన్ని ఆచరించడం ఆనవాయితి. కనుకనే ఆనాడు వీరశైవపు వెల్లువ రెండు పాయలుగ ఆంధ్ర దేశాన్ని

అక్రమించడానికి ప్రయత్నించింది. కన్నడ ప్రాంతం నుండి ఎగుమతైన వీరశైవం ఒకవైపు - వైదిక సాంప్రదాయ బద్ధమైన వీరశైవం మరోవైపు ముమ్మర ప్రచారానికి పూనుకున్నాయి. రెండవ సాంప్రదాయానికి చెందిన వారిని అరాధ్యులన్నారు. ఈ మత వర్గానికి చెందిన పండితారాధ్యుడు కన్నడ శైవంలాగా కులావారాల మీద దండెత్తక భక్తికి, కులభేదాలకు సమన్వయం సాధించడానికి ప్రయత్నించాడు. దాదాపు ఆంధ్ర దేశంలోని అగ్రవర్ణాలన్నీ ఈ మతాన్నే అనుసరించాయి "భవుని మీద వలపు బ్రాహ్మణ్యంబుతో పొత్తు పాయలేని" పండితారాధ్యుడే వీరికి ప్రతినిధి. ఈనాటికీ బ్రాహ్మణులలో ఆరాధ్యులు, బ్రాహ్మణేతరులలో జంగాలు—వీరు ఈ మతోద్యమానికి చిహ్నాలుగా నిలిచిపోయారు.

శైవంలో కాలాముఖి, కాపాలిక పాశుపతాది ముఖ్యశాఖలలో కాలాముఖ శైవం కాకతీయ యుగ ప్రారంభములో కొంతకాలం చెల్లినా గణపతిదేవుని కాలానికి పాశుపతమే రాజమతమై కూర్చుంది.

శ్రీనాథుని రచనల్లో పాశుపతమే పలుతావుల్లో చోటు చేసుకుంది. ఇది ఈతని రచనల్లో మబ్బు విరిసిన సూర్యమండలంలాగా ప్రకాశవంతమై ఉండడం విశేషం. పరమతనింద, ఆత్మస్తుతి-వీని స్థానాన్ని ఆత్మాహుతి, ఆత్మహింస ఆక్రమించాయి. శ్రీనాథుని ప్రత్యేకత ఇందులోనే ఉంది. ఈతని పాత్రల్లో మతావేశం మచ్చుకైనా కానరాదు. అన్ని పాత్రలు శివలింగార్చనా తత్పరాలే నలుడు, అర్జునుడు, వ్యాసుడు, అగస్త్యుడు, కాశీఖండములో బ్రహ్మలోకాన్నుంచి దిగి వచ్చిన దేవతలు, ధ్రువుడు, ఈశానుడు, ప్రమథులు—వీరంతా పంచాక్షరీ మంత్ర పరాయణులే. షట్కాల లింగార్చనతోపాటు అఘమర్షణ స్నానం చేసేవారే. లింగార్చనలో అన్నిటికన్నా అగ్రేసరమయింది ఆత్మానుసంధానం. బాహిరమైన పూజాడంబరాలకంటే, ఆంతరమయిన ఆత్మానుసంధానమే అచ్చపు భక్తి తత్త్వంగా శ్రీనాథుడు భావిస్తాడు. దీనికి శివరాత్రి మహాత్మ్యంలోని యాజ్ఞదత్తి సరయిన ఉదాహరణం.

ఈతడింత ఈశ్వరార్చన కళాశీలుడయినా "అవగింజంత భూతిమైనలదికొనిన.... గుమ్మడికాయంత వెట్టి పుట్టువాడు" కాడు. హరుని ఎంత ఆరాధించాడో హరినికూడా అంతే పూజించాడనడానికి ఆతని గ్రంథాలే సాక్ష్యం. శ్రీనాథుని గ్రంథాలటుంచి కొన్ని వీరశైవ గ్రంథాలానాడు బ్రాహ్మణాధిక్యతను నోరారా నిరసించాయి. వైదిక కర్మ సిద్ధాంతాలను అవహేళన చేశాయి. ఈ సందర్భంగా హేతువాద యుక్తమైన వాదనలెన్నో మనకు కనిపిస్తాయి. నైతిక సూత్రోల్లంఘనతో కూడిన మతప్రచార మానాడు దాదాపు కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నం చేసింది.

ఈ యుగంలో మత గురువులయొక్క లేదా ఆచార్యుల యొక్క ప్రాబల్యం పదింతలు పెరిగింది. కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరు రెడ్డిరాజులకు

ఘోడెరాయ కుటుంబీకులు శైవ గురువులుగ చెలామణి అయినారు. ఘోడెరాయ గంగయ దయతోనే ప్రోలయ వేమునికి రాజ్యం ప్రాప్తించింది. త్రిపురారి దేవుడు, ఆయన కుమారుడు భీమయిదేవుడు రాజమహేంద్రవర రాజులకు గురువులుగా ప్రసిద్ధి చెందారు. వీరభద్ర నృపతికి "ఈశ్వరుడింటి వేల్పు జగదేక గురుండగు ఘోడెరాయ భీమేశ్వరుఁ డాత్మవంశ గురుఁడని" శ్రీనాథుఁడు కాశీఖండంలో ప్రకటించడమే దీనికి నిరూపణం. (కాశీ-1-50)

ఈ జంగమ మఠాధి కారులానాడు లక్షాధికారులుగ, కవి పోషకులుగ కని పిస్తారు. శ్రీ శైల మఠాధికారులు శ్రీనాథుణ్ని పోషించి శివరాత్రి మహాత్మ్యాన్ని అతని చేత వ్రాయించడం. శంకర పీఠాధిపతి మాధవారణ్యులవారు విజయనగర సంస్థానాభివృద్ధికి కారకుడు కావడం, ఆనాటి మఠాధిపతుల ప్రాబల్యానికి, పలుకుబడికి మచ్చుతునకలు.

మత ప్రచార సాధనా లానాడు మనకు రెండు రూపాలతో దర్శన మిస్తాయి. 1. దేవాలయం, 2. మఠం—ఈ రెండు ప్రాథమిక మత కేంద్రాలానాడు కళలకు, మతానికి పుట్టిల్లుగా, కళా వ్యాప్తికి మారుపేర్లయి నిలిచాయి. రాజాదరణ ప్రజాదరణ వాటికి ఊపిరి. దేవాలయం గ్రామ జీవితానికి కేంద్రంగా ఉండడమేకాదు, స్వయం సంపూర్ణ పరిపాలనా యంత్రాంగం కలిగిన ఒక సంస్థ. దేవాలయం లేని గ్రామం లేదానాడు. పట్టణాల్లో కూడా వీటి సంఖ్య అధికం. రాఘవేశ్వరస్వామి దేవాలయం, మూలస్థానం మైలారు దేవాలయం, నాగేశ్వర దేవాలయం, అంగడి గోపీనాథ దేవాలయం, కొండవీట కొలువు తీర్చినాయి. స్వయంభు శ్రీ మహాదేవుడు, త్రిపురాంతకుడు, కళ్యాణ చంద్రశేఖరుఁడు, ఇష్ట కామేశ్వరుఁడు, మల్లేశ్వరుఁడు, మల్లినాథుఁడు, మైలార దేవుడు, వీరభద్రుడు, కాలభైరవుడు- ఈ శైవ దేవతలు శివుని అవతారాలుగా భావింపబడ్డారు. క్రీడాభిరామంలో వర్ణింపబడ్డ మైలారు దేవుని ఉత్సవంలో మైలారు భటులు ప్రాణాంతకమైన ఆత్మహింసాకార్యాల్ని భక్తి పారవశ్యంతో మ్రొక్కుబడులను చెల్లించడానికై చేసేవారు. ఎఱ్ఱని నిప్పుల్లో దూకడం, శూలాలను భూమిపై పాతి ఎత్తుప్రదేశం నుండి వాటిమీద దూకడం, గాలం వంటి ఇనుపకొండిని వీపు చర్మానికి గ్రుచ్చుకొని వ్రేలాడబడి గడెచుట్టు వృత్తాకారంగా తిరగడం, బాణాల్ని శరీరపు భాగాల్లో గ్రుచ్చడం, అఱచేతుల్లో కర్పూరాన్ని వెలిగించి హారతులీయడం మొదలైన సాహస కృత్యాలు మొన్నమొన్నటివాకా గ్రామసీమలలో పీర్ల పండుగనాటి సాహస కృత్యాల్ని పోలి ఉన్నాయి.

శ్రీ శైల ప్రాంతంలో అనవేమునిచేత నిర్మింపబడ్డ ఒక వీర మంటపంలో వీరులనేకులు మహా సాహస కృత్యాలు చేసేవారట. తలలు, నాలుకలు గండగత్తెర్లచే ఛేదించుకుంటూ భక్తి సాహసాల్ని ప్రదర్శించేవారని అక్కడి ఒక శాసనములో వర్ణింపబడింది. [రెడ్డి సంచిక పు—31]

ప్రజలలో విజ్ఞాన వ్యాప్తి కానాడు మతాలు ఎంతో సహాకరించాయనడంలో సందేహం లేదు. ఆనాడు శ్రీశైల పర్వతం మీద నెలకొన్న ప్రసిద్ధి వహించిన ఐదు శైవ మతాల్లో భిక్షావృత్తి మఠం మాత్రం శాసనాల్లో పేర్కొనబడింది. శాంత భిక్షావృత్తిని భిక్షావృత్తి మఠాధిపతిగా శ్రీనాథుని శివరాత్రీ మహాత్మ్యం పేర్కొన్నది. శ్రీశైలానికి వెళ్ళినప్పుడు శ్రీనాథుడు ఈ భిక్షావృత్తి మఠ జంగాలను దర్శించి వారి ఆదర సత్కారాలను పొందాడు. ఆ అనుభవంతో హరవిలాసంలో చిరు తొండనంబిని ఇష్ట లింగాభిషేకానికై ఇక్షురసం తూమెడు తెమ్మని కోరిన జంగాన్ని "భిక్షావృత్తి మఠ జంగంగా వర్ణించాడు. [హరి -2 అ]

ఈ మఠా లానాడు ఆరోగ్య కేంద్రాలుగా, విద్యాసంస్థలుగా వర్ధిల్లాయి. గోళకి మఠం శాఖోపశాఖలుగా విస్తరించింది. ఈ మఠంలో సూర్యోదయం మొదలు అస్తమయం దాకా పంచముడు మొదలు పరమ శ్రోత్రియుని వరకు ఎవరొచ్చినా అన్నదానం జరిగేదట. శ్రీశైల క్షేత్ర ప్రభ ఆనాడు వేయింతలు వెలిగింది. ఈ క్షేత్రానికి భిక్షావృత్తి మఠస్థులు పరిపాలకులు. శ్రీనాథుని కాలానికి శాంత భిక్షావృత్తి యతీశ్వరుడు ఆ మఠానికి అధికారి. శ్రీనాథుని శివరాత్రీ మహాత్మ్యాన్ని కృతిగొన్న శాంత భిక్షువు ఈ మఠానికి చెందినవాడే.

రెడ్డిరాజులకు పూర్వమే వైష్ణవం ఆంధ్ర దేశంలో ప్రవేశించినా, ప్రజల్ని ప్రత్యేకంగా ఆకర్షించింది రెడ్డిరాజుల కాలంలోనే. భట్టర్లు, తిరుమలైలు మొదలయిన వైష్ణవ కుటుంబాలు తీరాంధ్ర దేశంలో స్థిరపడి మత ప్రచారానికి పూనుకున్నాయి. భట్టర్ల వంశంలో ఏడవవాడు పరాశరభట్టు ఆంధ్ర దేశమంతా తిరిగి రాజుల్ని శిష్యులుగా స్వీకరించి తద్వారా మత ప్రచారం చేశాడు. ఈతనికి శిష్యుడైన వారిలో కోరుకొండను పాలించిన ముమ్మడి నాయకుడొకడు ఈతని కాలంలోనే లక్ష్మిదాసి అనే ఒక వేశ్య కోరుకొండ పురములో పరాశర నృసింహమూర్తి ఆలయాన్ని కట్టించింది. [రెడ్డి సంచిక]

ప్రసిద్ధి పొందిన మరొక వైష్ణవ గురు వంశం తిరుమలై వంశం. ఈ వంశపు గురువుల్లో నల్లండి చక్రవర్తి ప్రముఖుడు. ద్రావిడ దేశం నుండి తెలుగు దేశానికి వచ్చిన మరొక మత గురువు వరదాచార్యులు. ఈ మత గురువులంతా రాజాస్థానాల్ని దర్శించి తమ తమ, మత స్థాపన కోసం కృషి చేయడమే కాకుండా వేలాది ప్రజల్ని తమ మతంపైపు ఆకర్షించే ప్రయత్నం చేయడం ఒక విశేషము. వీరు కేవలం మత ప్రచారకులేకాక తెలుగు సంస్కృతాలలో పండితులు. కవులు కూడా ఆనాడు మతగురువులకు శిష్యులై మత ప్రేరితులై తెలుగు సాహిత్యాన్ని సృష్టించారు. తెలుగు సాహిత్య సృష్టికి మతం ముఖ్యమైన ప్రేరకంగా పనిచేసింది.

వైష్ణవ దేవాలయాలానాడు అధిక సంఖ్యలోనే కనిపిస్తాయి అనంత గోపీనాధుడు, వరద గోపీనాధుడు, ప్రసన్న గోపీనాధుడు, భువన మంగళ గోపీనాధుడు, కేశవుడు, చెన్నకేశవుడు, నరసింహుడు, రాముడు, జనార్దనుడు— వీరు వైష్ణవులకు ఆరాధ్య దేవతలానాడు. శ్రీ కూర్మం, సింహాచలం, నప్పవరం, శ్రీకాకుళం, బాపట్ల అహోబిలం — ఇవి ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రాలు. ఆనాడు నప్పవరక్షేత్రం "త్రిలింగ క్షోణీ వైకుంఠ మే"నట. [భీమే - 2 65]

వ్యాసునికి ఈ క్షేత్ర దర్శనం కాశీ విరహ తాపాన్ని చల్లార్చింది. ఆ ప్రదేశంలో కనిపించే విష్ణు తత్పరత అపారం. ఇక్కడ ద్వారానికి ఇరుప్రక్కల శంఖ చక్రాలు గుర్తుగాలేని ఇల్లే లేదట ! ఈనాటికీ మిగిలి ఉన్న వైష్ణవ గృహాలకు ఆ గుర్తులున్నట్లు, అక్కడి ప్రజలు ఈనాటికీ ఊర్ధ్వపుండ్రాలు దాలుస్తున్నట్లు మనకు తెలుస్తున్నది. [చిలుకూరి పాపయ్యశాస్త్రి శ్రీ. క. న-నం-3-పు-114]

శాక్త తాంత్రికారాధనం యొక్క ఉనికిని కూడా సమకాలీన సాహిత్యాన్ని బట్టి గ్రహించడానికి వీలుగలుగుతున్నది. ఈ సాంప్రదాయంలో నవసంఖ్యగల నట గురువులు ప్రాధాన్యం వహిస్తారు. ఈ నవ సిద్ధుల మహిమలు సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. నాధ గురువులలో శివుడు ప్రధముడుగా గణింపబడతాడు. సమకాలీన గ్రంధమైన నవనాధ చరిత్రలో గురువుల పహాసకృత్యాలెన్నో వర్ణింపబడ్డాయి. నవ నాధులలో ఒకడైన నాగార్జున సిద్ధుడు రసయోగశాస్త్ర నిర్మాత. ఈతడు శ్రీశైలాన్నే తన ప్రభావం చేత బంగారు కొండగా మార్చడానికి ప్రయత్నించాడని నవనాధ చరిత్రలో ఉంది. ఇలాంటి యోగాచారాలు, అధ్యాత్మిక సిద్ధులు వారి అతిమానుషశక్తుల్ని ప్రకటిస్తాయి. సిద్ధమంత్రాలలో ఒకటైన సిద్ధసారస్వత మంత్ర ప్రసక్తి విక్రమార్క చరిత్రలోనూ (పు 163), క్రీడాభిరామంలోనూ (పు-9) కనిపిస్తుంది.

భైరవ తంత్రంలో మద్యమాంసాల యొక్క వాడుక ఒక సాంప్రదాయం. మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునం — వీటికి పంచమకారాలని పేరు. కౌలికులు, సమయ మార్గులనే తాంత్రిక తెగలవారు ఈ పంచ విధ పద్ధతుల్ని అనుసరించేవారట. (విజ్ఞాన-పు 443) దీనినే కులాచారం అనేవారు. సిద్ధమీననాధు డనేవాడు తాంత్రికంలో ఒక భాగంగా ఈ కులాచార తెగను వ్యాపింపజేశాడు. క్రీడాభిరామంలో దీని ప్రస్తావన కనిపిస్తుంది. [క్రీడా - పు 240]

భూతప్రేత పిశాచాలపట్ల ప్రజలకు బాగా నమ్మకముంది. భూతవైద్యులు, తాంత్రికులు దేశమంతటా అసంఖ్యాకంగా ఉన్నారు. శైవుల్లో చాలామంది తాంత్రిక పద్ధతులపట్ల ఆసక్తి చూపేవారు. శక్తి పూజలు బాగా ప్రబలిపోయాయి. ఆదిభైరవీ శక్తిని పెదకోమటి వేమభూపాలుడు పూజించినట్లు వేమభూపాల చరిత్ర చెబుతుంది. ఈ శక్తికి మద్యం సమర్పించే ఆచారం కూడా కనిపిస్తుంది. శ్రీనాధుని గ్రంధాలలో

ఈ శాక్తేయం క్వాచిత్కంగా మాత్రం కనిపిస్తుంది. కాశ్మీర సంబంధమైన శాక్తేయాన్ని తాంత్రిక మార్గంలో ఒకటి రెండు చోట్ల మాత్రం శ్రీనాథుడు ప్రపక్సించాడు. ఇందులో శక్తికే అత్యంత ప్రాధాన్యం ఉంటుంది. భోగాపవర్గ లక్షణమైన ఫలాన్ని పరమేశ్వరుడు పశుగణాలకిచ్చేటప్పుడు శక్తిని ముందుంచుకొని గాని ఈయలేడట. శబ్దబ్రహ్మం పరా, పశ్యంతీ మధ్యమ వైఖరీ వాక్కులుగ ఎట్లా అభివ్యక్తమౌతుందో కాశీ ఖండములో వ్రాశాడు-(కాశీ-3 ఆ - 49 ప) ఈ తాంత్రికమార్గములో నాడీమండలాలు, షట్చక్రాలు మొదలైన విషయాల వివరణ కనిపిస్తుంది.

ఆత్మాహుతి తాంత్రికాచారాలలో ఒక భాగం. "చంపుడు గుళ్ళ" ఉనికి దీన్ని నిరూపిస్తుంది. భూతప్రేతాల తృప్తికోసం రక్తంతో తడిపిన ఆహారాన్ని రాత్రిపూట యుద్ధ భూమిలో ఉంచడాన్ని "రణముకుడుపు" అనేవాళ్ళు. (His-R-K)

ఆనాడు శైవ వైష్ణవాలేకాక జైన చార్వాకాది మతాలు కూడా కనిపిస్తాయి. ఈ విషయం నైషధం (ఆ-ప 7-128) కాశీఖండం (6 - 85,86) హరవిలాసం. [2-28] లోని కథా సందర్భాల్ని బట్టి గ్రహించగలము. అయినా ఇవి నామ మాత్రాలే. కాకతీయుల కాలములో మూడు పూలు ఆరుకాయలుగా వెలిగిన జైనం ఈకాలంనాటికి వీరశైవం వెల్లువలో కొట్టుకొని పోయింది. ముఖ్యంగా ఈ జైనం తెలంగాణా ప్రాంతంలోని వృత్తి పనులవారిలో, వ్యవసాయదారులలో వ్యాపించిందానాడు. జైనం కూడా కుల వ్యవస్థకు శత్రువే. అయినా వీరశైవులు జైనుల్ని హింసించినట్లు చారిత్రక సాక్ష్యాలు కనిపిస్తాయి. కొన్ని జైన దేవాలయాలు శైవ దేవాలయ రూపుదాల్చాయి. విగ్రహాలు ముక్కలైనాయి. హనుమకొండ, పటంచెఱు, కోప్పూరు మొదలయిన ప్రదేశాలే విధ్వంసకాండకు లక్ష్యాలైనట్లు చరిత్రే సాక్ష్యం.

వీరశైవులు జైనుల్ని హింసించారే కాని, బ్రాహ్మణ మతస్థుల్ని హింసించినట్లు సాక్ష్యాధారాలు లేవని చెప్పుతూ దీనికిగల కారణాన్ని ఏటుకూరి బలరామమూర్తి గారు తమ ఆంధ్రుల చరిత్రలో నిరూపించారు. "అద్వైత సిద్ధాంతంగాని వైదికమతం గాని ఆనాటి ప్రజాసామాన్యంలో వ్యాపించలేదు. ప్రజలలో బలంగా వేరూని వున్న జైనమతాన్ని తొలగించి అస్థానాన్ని ఆక్రమించే ప్రయత్నం వీరశైవులు చేసినారు. దాని ఫలితమే ఈ సంఘర్షణ. అగ్రవర్ణస్థులైన బ్రాహ్మణులకు మొదటి నుండి యువరాజుల ప్రాపకమున్నది. వారికి అగ్రహారాలిచ్చి అనేక రక్షణలిచ్చి ఆంధ్ర రాజులు పోషించినారు. ఆనాడు ఏ మతకల్లోలం వచ్చినా బాధపడినది సామాన్యులు. తమను సూటిగా ఎదిరించిన అన్ని ఉద్యమాలను రాజులు క్రూరంగా అణచి వేసినారు. తమ వ్యవస్థకు ముప్పులేనంతవరకు జైన, శైవ, వైష్ణవ మతాలు ఏవి వ్యాపించినా సహించినారు. ప్రజలు కులమత ప్రాదిపతికపై తమలో తాము నిరంతరము కలహించుకోవడం తమ అధికార భద్రతకు ఒకవిధంగా లాభమనే తలచినారు" [పు-133]

శైవమానాడు ఒక విప్లవాత్మకమైన వెల్లువై ఆంధ్ర దేశాన్ని ఆక్రమించ డానికి చారిత్రకులు లోక కారణాన్ని చూపించారు. ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబాలానాడు అద్వైతాన్ని స్వీకరించాయి. భక్తి కర్మజ్ఞానమార్గాలలో కేవలం జ్ఞానమార్గమే మోక్ష సాధనకు మొదటి మెట్టుగా ఇది సిద్ధాంతీకరిస్తుంది. జ్ఞానమార్గం సామాన్యుల కందు బాటులో ఉన్నది కాదు-అక్షరాస్యత ఉన్నంతమాత్రాన అర్థమయ్యేదీకాదు.

"జ్ఞాన సంపదఁ గాని మోక్షంబు లేదు
కర్మశతములనైన యో నిర్మలాత్మ !
జ్ఞాన మనగ వేదాంత విజ్ఞాన మబల
యితర విజ్ఞాన మజ్ఞానమెంచి చూడ"

అని భీమేశ్వర పురాణంలో పరమ శివుడు పార్వతీదేవికి అద్వైత భక్తి భావంతో భీమనాథదేవుడిని ఆరాధించే క్రమం తెలిపాడు. పరమాత్మయొక్క నిర్గుణ తత్త్వాన్ని గూర్చి కాని, రజ్జు సర్ప న్యాయ భ్రాంతి నిర్మూలనాన్ని గూర్చి కాని, పర మాత్మానుసంధానం, ఆత్మానుసంధానాల గూర్చి కాని, "తత్త్వమసి" అనే మహావాక్య తత్త్వాన్ని గూర్చికాని, జీవేశ్వరుల అభేదాన్ని గూర్చికాని వివరించి చెప్పనిదే అర్థం కావడం అసంభవం. ప్రజలలోకి వెళ్ళి ఈ మార్గాన్ని వారికి అర్థమయ్యే పద్ధతిలో బోధించేవారు కావాలి. ఆనాటి బ్రాహ్మణవర్గం ఇందుకు సిద్ధంగాలేదు. ఫలితంగా జన సామాన్యంలో ఈ మతం వ్యాపించక పోవడమేకాక అశేష ప్రజానీకానికీ, అద్వైతా నికి మధ్య ఒక పెద్ద అగాధమేర్పడింది. ప్రజలకిప్పుడొక ప్రత్యామ్నాయం కావాలి. ఈ అదనులో వీరశైవులు విజృంభించి తమ సిద్ధాంతాల్ని వారికి అర్థమయ్యే పద్ధతిలో బోధించి ఆకర్షించడం ప్రారంభించారు — బ్రాహ్మణాధిక్యతపట్ల ప్రజలలో పెరిగిన నిరసన భావం వీరశైవ వ్యాప్తి రూపంలో ఫలించిందని చారిత్రకుల అభిప్రాయం. (వేటుకూరి — ఆంధ్రు—సాంఘిక చరిత్ర) ఒక సిద్ధాంతం యొక్క ఆదరాభిమానాలకు దూరమైన ప్రజాబాహుళ్యం మరొకమతంవైపు సులభంగా మరలడానికి మనకు చరిత్రే సాక్ష్యం. ఈ వీరశైవం కూడా కులమత నిర్మూలనమనే ఎఱను చూపి సామాన్యుల్ని ఆకర్షించిందే తప్ప, తదితర సూత్రాలన్నీ మూఢనమ్మకాలపై ఆధారపడినవే - అన్య మత దూషణం, మూఢభక్తి ఇవి సంఘసంస్కరణాన్ని సాధించవు. పైగా కీడునే కలిగిస్తాయి. కనుకనే ఆంధ్ర దేశంలో జంగాలు విశ్శేషంగా తుడిచిపెట్టుకొని పోవ డానికి చారిత్రకులు పై కారణాన్ని చూపించారు.

# ఆర్థిక జీవనం

అనాడు ప్రజల ముఖ్య జీవనాధారం వ్యవసాయం. అడవుల్ని నరికి భూమిని సాగులోనికి తేవడం, చెఱువులు, కాలువలు త్రవ్వించి నీటిపారుదల సౌకర్యాల్ని కల్పించడం రాజు ప్రధమ కర్తవ్యం. పదిహేనవ శతాబ్దంలో కోస్తాప్రాంతాన్ని పరిపాలించిన రెడ్డిరాజులు ఈ విషయంలో కొంతవరకు కృషిచేశారని చెప్పొచ్చు. అయినా సాగు చేయబడిన భూముల్తో పోల్చి చూసినప్పుడు అడవులు, గుట్టలు అధికంగానే విస్తరించి ఉన్నట్లు కాశీ ఖండాది గ్రంధాల్నిబట్టి మనం ఊహించగలం. గౌతమీ నదికి ఇరుపైపులా వ్యాపించి ఉన్న భూములు అత్యంత సారవంతాలై అరటి, కొబ్బరి, పనస, పోక, మామిడి మొదలయిన తోటల పెంపకానికి అనుకూలంగా ఉండేవి. కృష్ణా గోదావరి డెల్టాలలో కర్పూరపు భోగి ధాన్యాలు, నువ్వులు, పెసర్లు, బొబ్బెర్లు. చెఱకు, సజ్జ, మినుములు మొదలయిన ధాన్యాలు పండింపబడుతుండేవి— "నదీమాతృకాయమానవిశ్వంభరా భరితకలమ, శాలిసిరా ముఖ షాష్టిక, పతంగ హాయన, ప్రముఖ బహువిధ వ్రీహీభేదములను" (హర-1-10) శ్రీనాధుడు వర్ణించాడు. వీరి కాపురాన్ని వ్యాసుడు దర్శించిన సందర్భంలో ఏలేటి నీటితో వీతికాపుర పరిసరాలలో పండిన పంటల్ని, చెట్టు చేమల్ని వివరంగా శ్రీనాధుఁడు చిత్రించాడు. [భీమే - 2-54]

ఏలేటి కాలువ నీరు సమృద్ధిగా దొరికిన వేళల్లో వరి పంట ఇప్పటికీ పుష్కలంగా చేతి కందుతుంది. ఏలేటి ఒడ్డు పొడుగునా పనసచెట్లు ఇప్పటికీ అధికంగానే ఉన్నట్లు తెలుస్తున్నది. కొనసీమలో మంచి రుచిగల పనస దొరికినా, వేరు పనసకు ఈ ప్రాంతం ప్రత్యేకతను వహించింది. పనసకాయలు నెలలోపలే ఎదిగి పండినతోట భూమి బీటలువారి పండ్ల సువాసనలు పైకి వ్యాపించడం- ఆ పరిమళానికి తుమ్మెదలు మూగడం- శ్రీనాధుని యదార్ధ కధనం. శ్రీనాధుడు వర్ణించినట్లు పోక తోటలు మాత్రం ఆ ప్రాంతములో ఇప్పుడు కానరావట. చెఱకు పుష్కలంగా పండేదనీ, ఈ ప్రాంతములో ప్రవహించే ఒక కాలువకు 'చెఱుకుల కాలువ' అనే పేరున్నట్లు తెలుస్తున్నది. (చి. పా 3-పు 100) కొబ్బెర తోటలు, అరటి తోటలు, ఆ తోటల నడుమ పోకచెట్లు, తమలపాకుల తీగలున్నట్లుగా శ్రీనాధుడు వర్ణించాడు. పిఠాపురానికి నలువైపులా వుండే పొలాలలోని తోటల్లో దోస, పొట్ల, కాకర, గుమ్మడి, వంగ, మిర్చి, చింత, పెరుగు తోటకూర. ముల్లంగి, కొత్తిమిరి, సిరికూర, పిప్పలి, పెద్ద బచ్చలి మొదలయిన ఆకుకూరలు, నీరుల్లి, అల్లం, చిఱుగడం, పెండలం, చేమ మొదలయిన దుంప కూరలుపండింపబడేవి-[భీమే - 2 - 56] కొన్ని ప్రాంతాల్లో పైన పేర్కొన్న వాటిలో కొన్ని కూరలు లభించినా, పెద్దబచ్చలి, గొల్లప్రోలు మిర్చి, నీరుల్లి మాత్రం ఈనాటికీ పిఠాపురపు ప్రత్యేక పంటలుగా విమర్శకులు చెప్పారు. [శ్రీనాధ క-సమీ-3 సం - పు 104]

కదళీవనాలకు, ద్రాక్షాలతాఫల స్తబకాలకు కృష్ణాజిల్లాలోని కళసాపురం కూడా ప్రసిద్ధి వహించింది. శ్రేష్ఠమైన నల్లచెఱకు కూడా ఆనాడు పుష్కలంగా పండేదట. [హం స - 2 - 8)

సప్త గోదావరాంబు నిర్ఝర సహస్ర
సారణీసేక పాంతత్య సంప్రవృద్ధ
వివిధ తరుగుల్మ వల్లికా వేల్లమైన
తత్పురోద్యాన వీధికాంతంబు నందు [భీమే-3_38]

చిలుకల గుంపులు పంచాక్షరీ మంత్ర పారాయణం చేసేవట. తెలంగాణా ప్రాంతాలయిన నల్లగొండ, నకిరేకల్లు మొదలయిన ప్రాంతాలు ఆనాడూ ఈనాడూ కూడా తరిసేద్యానికి అనువైనవి. ముల్కి విషయం అంటే నేటి మహబూబునగర్, కర్నూలు, గుంటూరు ప్రాంత భూములు కొన్ని "మింటజలముట్టిన మాత్రాన నావరాలలో విత్తిన యావనాళము" ఫలించేదట- [క్రీడా-పు 39] కొన్ని భూములింత సారవంతాలు కనుకనే ఆనాటి ధనికుల జీవితం మూడు పూలు ఆరుకాయలుగా ఉంది.

ఇఁకపోతే రేనాడు, పల్నాడు, కడప మొదలయిన ప్రాంతాల్లో మెట్టభూములు విస్తారంగా ఉండడం చేత ప్రజలు శ్రమజీవులుగా, నిరాడంబరంగా జీవించారు. ఈ ప్రాంతాల్లో జొన్నే ప్రముఖమైన పంట.

మందరాద్రి సములు మానవులందఱు
చందమామ కూనలిందుముఖులు
కందులేని మౌక్తికంబులు జొన్నలు
కుందవపు బెడ్డ కుందుగడ్డ

అని శ్రీనాథుఁడు ప్రశంసించాడు. ఆహార పదార్థాలు చాలా వరకు జొన్న పిండితో సిద్ధం చేసినవే. వీనిలోనికి అనుపానం చింతచిగురు, బచ్చలి ఆకును కలిపి వండిన ఉడుకు కూర. విస్తళ్ళ భోజనము, కుండల వంటకం, చద్ది అన్నం — ఏ కాలంలోనయినా పేదల జీవిత మిదే కదా! పల్నాటి ప్రాంతంలో రేగడి భూమి చాలా భాగం విస్తరించి ఉండేది. అది నల్లరేగడి. ఇది ముఖ్యంగా జొన్న పంటకు, ప్రతి పంటకు పనికి వస్తుంది. తరిసేద్యం కంటే ధన వ్యయం, శారీరక శ్రమ చాలా అవసరం. కనుక కొన్ని గ్రామాల్లో సమిష్టి సేద్యం అమల్లో వున్నట్లు, గ్రామ జనులంతా కలిసి కృషిచేసి సమిష్టిలోనే సేద్యపు వ్యయాన్ని తీసివేసి, ప్రభుత్వపు పన్ను మినహాయించి, సమిష్టి సేద్యపు భూమినుండి అగ్రహారాల్ని తొలగించి ఫలితాన్ని అందరు సమంగా పంచుకొనేవారని సురవరం వారి

ఆంధ్రుల సాంఘిక చరిత్ర చెప్పుతున్నది. [పు-128] పలనాటి ప్రాంతంకూడా ఇలాంటి సమిష్టి వ్యవసాయ కేంద్రమే. కనుక రాజయినా మడి దున్నందే మనుగడలేదు. దున్నేవానిదేభూమి. దాని ఫలం రంభయినా ఏతులు వడకవలసిందే-అందరూ జొన్న కూడు కుడువవలసిందే. కష్టించి పనిచేసేవారికే సంఘంలో గౌరవం, కష్టం ఒకరిది, ఫలితం మరొకరిది కాదు. కర్ణాటరాజ్యంలో చేరి ఉన్న రాయలసీమలోని కొన్ని ప్రాంతాలు ఇలాంటివే, కార్యార్థిగా వెళ్ళిన శ్రీనాథుఁడు కూడా చల్లా, అంబలి త్రాగక తప్పలేదు.

శ్రీనాథునికి వ్యవసాయమంటే వల్లమాలిన అభిమానం. అవకాశం కల్పించుకొని మరీ వర్ణిస్తాడు. దేవతల తెగిన హారాలనుండి దుల్లిపడిన ముత్యాలు "చతుర హాలికుండు జల్లు పరువంపు మొలకల చెలువుప" శ్రీనాథునికి కనబడతాయి. ఆంధ్ర దేశములోని సేతురేఖలు, ఉద్యానవనాలు, ధాన్యజాతులు ఏవీ ఈతని దృష్టినుండి తప్పించుకోలేవు. [శివరాత్రి]

పలనాటి సీమలోని కొన్ని పల్లెల్లో నీటి ఎద్దడి ఎక్కువ. ఎంత లోతుత్రవ్వినా నీరు ఊరదు. ఎంతో వ్యయంతో కూడుకున్న పని. నీళ్ళు లేకపోతే ప్రియమైన వనాలు, వరి అన్నం ఎట్లా వస్తుంది? పరిశుభ్రత కూడా అంతంత మాత్రమే. నీరు కొద్ది మడి కదా మరి ! ఇలాంటి స్థితి చూచే శ్రీనాథుఁడు "గంగ విడుము పార్వతి చాలున"ని పరమేశ్వరున్ని ప్రార్థించాడు.

అనాడు గ్రామాలు రాచ ఊళ్ళు, అగ్రహారాలు, నాయంకరపాట్లని మూడు రకాలుగా ఉండేవి. అగ్రహారాలు పన్నుల మినహాయింపు పొందేవి. నాయంకరపాట్లలో భూస్వాములు కౌలుదార్లనుండి సొమ్ము వసూలుచేసి రాజుకు కొంతమాత్రం చెల్లించి తక్కింది తామనుభవిస్తారు. రాచ ఊళ్ళలో రాజే స్వయంగా భూమి కౌలుకిచ్చి ప్రత్యక్షంగా ప్రజల నుండి పన్నుల్ని రాబట్టే పద్ధతి ఉండేది. శ్రీనాథుడు చివరి రోజుల్లో గుత్తకు తీసుకున్న భాగం ఈ రాచ ఊరుకు సంబంధించిందే కావచ్చు. (ఏటు—ఆంధ్ర చరి-164) కనుకనే రాజు అంత కఠినంగా ప్రవర్తింపగలిగాడు. వ్యవసాయం పన్ను అనాడు ప్రభుత్వానికి ప్రధానమైన రాబడి, పన్నుల చెల్లింపు విషయంలో కవైనా, కర్షకుడైనా శిక్ష ఒక్కటే. శ్రీనాథుడిలాంటి మహాకవికి కూడా శిక్ష వేయడానికి వెనుకాడలేదు. రాజులు మారినపుడెల్లా పన్నుల భారం ప్రజలకు పెరిగేది. పెదకోమటి వేమారెడ్డి కుమారుడు రాచ వేమారెడ్డి పురిటి పన్ను విధించి అక్రమంగా పన్ను రాబట్టేవాడని చరిత్ర చెపుతున్నది. తన భృత్యుడైన సీరము ఎల్లయ అనే ఒక బలిజ నాయకునిపై పురిటి పన్నువేసి బలాత్కారంగా వసూలు చేశాడని, ఆతడాగ్రహించి ఒకనాడు ముత్యాలమ్మగుడివద్ద అతని తలను కఠారితో కత్తిరించాడని కొండవీటి దండ కవిలెలో వ్రాసి ఉన్నట్లు తెలుస్తున్నది. (చి.వీ. శ్రీనాథకవి పు—151)

నగర ప్రజలలో చాలామంది ఆనాడు సకల సంపదలతో తులతూగినట్లు మనం ఊహించవచ్చు. దూర దేశాల నుంచి "చందనాగరు కర్పూర హిమాంబు కుంకుమ రజః కస్తూరి"కాది సుగంధ ద్రవ్యాలు, చీని చీనాంబర శ్రేణుల్ని, ఆణిముత్యాలు మొదలైన భోగ్యవస్తువులు విరివిగా తెప్పించడంద్వారా అవచి తిప్పయలాంటి వర్తకులు వ్యాపారం సాగించడం ఒక రాజుల కోసం మాత్రమే కాదు. ధనవంతులు చాలామంది అలాంటి సుగంధ వస్తువుల్ని విరివిగా కొని ఉపయోగించకపోతే వర్తకం అంత విస్తరించడానికి వీలులేదు. వర్తకం యొక్క అభివృద్ధి ప్రజల అవసరాలపై, కొను గోలు శక్తిపై ఆధారపడి ఉంటుంది కదా! ద్రాక్షారామపురంలోని గంధర్వాప్సరో భామినుల వక్షోజాలపై వాసించేది కస్తూరే. బ్రాహ్మణోత్తముల నొసళ్ళమీద తీర్చ బడేవి కస్తూరికా పుండ్రాలే. శ్రీనాథునిలాంటి కవీంద్రులాశించేవి కస్తూరికా దానాలే. మెడలలో ముత్యాల సరులతో, శిఖల్లో చెంగల్వ విరులతో అలంకారాల్లో అతివలతో పోటీపడితే వ్యాపారం మూడుపూలు ఆరుకాయలు కాక మరేమౌతుంది? అగ్రహార బ్రాహ్మణుల అలంకారమే ఇంత అతిశయంగా ఉంటే శృంగారానికి పుట్టినిండ్లయిన స్త్రీల విషయం చెప్పేదేముంది?

పూట కూటిండ్లు ఆనాడు ఆహారానికేకాక విహారానికి కూడా విలువను సంత రించుకున్నాయి. ఒక్క రూపాయకే కపురపు భోగి బియ్యపు సన్నన్నం, గోధుమ పిండి వంట, గుప్పెడు పంచదార, అప్పుడు కాచిన ఆవునెయ్యి, పెసరపప్పు కొమ్మ వల్ల నేటి పండ్లు, నాలుగయిదు పచ్చళ్ళు ఊరగాయలూ, అప్పలతోడి కమ్మని పెరుగు గల దొడ్డ భోజనం నగరాలలో దొరికేది. గ్రామసీమల్లో భోజనం దీనికింత భిన్నంగా ఉంది. నూకలేని సన్నని అన్నం, వడబోసిన నెయ్యి, బుడమవరుగు, పెరుగు లభించేవి.

పట్టణాలు పై భవాలకు. వస్తు సమృద్ధికి నినాదాలుకాగా, పల్లెలు మాత్రం హీన దశలోనే ఉన్నట్లు స్పష్టమౌతుంది. పేదవారికీ ధనవంతులకు మధ్య ఆర్థిక తారతమ్యం అధికం. అంతస్తుల తారతమ్యం, అసమానతలు అనాడు కూడా తప్పలేదు. కులానికి పెద్దలైనా కూటికి పేదలైన పురోహితుల జీవితాలు ఈ నాటికీ పల్లెల్లో నివసించే పురోహితుల జీవితాలకు ప్రతిబింబంగా ఉన్నాయి. పల్నాటిప్రాంతాలలో గ్రామాని కెవ్వరైనా పెద్దలు వస్తే పురోహితుని ఇంట్లో విడిది చేయడం ఆచారం. శ్రీనాథుడు కూడా అక్కడికి వెళ్ళినప్పుడు ఒక పురోహితుని ఇంటి దారిద్ర్య స్థితిని ఇలా వర్ణించాడు.

దోసెడు కొంపలోఁ బసుల త్రొక్కిడి,
మంచము దూడరేణమున్
బాసిన వంటకంబు పసిబాలుర
శౌచము విస్తరాకులున్

మాసిన గుడ్డలున్ దలకుమాసిన

ముండలు వంట కుండల న్

రాసెడు కట్టెలుందలంపరాదు

పురోహితు లింటి కృత్యముల్.

ఆశ్రితుల ఇండ్లకు అనుదినం విస్తళ్లు కుట్టి ఈయడం నిత్యవిధి. కనుకనే నిల్వ ఉంచిన విస్తరాకుల కట్టలు ఇంటో ఉన్నాయి. ఏనాడయినా పౌరోహిత్యపు దిన వెచ్చంతో ఏ పూట కాపూట బ్రొప్పుగడిపే పురోహితుని స్థితి ఇంతకంటె మెరుగుగా ఎట్లా ఊహించగలం ? శుచికి మారుపేరుగా ఉండవలసిన బ్రాహ్మణ పురోహితుని గతే ఇట్లా ఉంటే ఇతర ప్రజల శుచిత్వం, జీవన స్థాయిని గూర్చి చెప్పవలసిన పని లేదు. మసర రాజ్యంపై చెప్పిన చాటువు కూడా వారి జీవన ప్రమాణానికి అచ్చపు మచ్చుతునక. (వేటూరి-ప్ర-చాటు-పు 128) "రెడ్డి రాజుల రాజ్య కాలంలో జనులు ప్రభుత్వమునెడ చాల సంప్రీతులై యుండినట్లున్నది. లేకున్న ఓఢ్ర కర్ణాట, ముస ల్మాన పద్మనాయకోజ్జృంభణ దండయాత్రలలో ఎన్నడో తిరుగుబాటుచేసి యుందురు" ఇది సురవరం వారి అభిప్రాయం. కాని ఇక్కడ ఒక విషయం. చైతన్య రాహిత్యాన్ని సంప్రీతిగా భ్రమపడే అవకాశం లేకపోలేదు. అది సంప్రీతో స్మశాన శాంతో సందే హమే ! ఏ సమాజంలోనయినా అత్యధిక సంఖ్యాకులు సామాన్య ప్రజలు. కాయ కష్టం మీద బ్రతికే కృషీవలులు, వృత్తులే ఆధారంగా రెక్కాడితే కాని డొక్కాడని నిరుపేదలు ఏనాడయినా ఉన్నారు. అక్షరాస్యతలేదు. రాజకీయ,సాంఘిక చైతన్యంలేదు కష్టాలకూ కర్మసిద్ధాంతాలకూ ముడిపెట్టి, మన జీవితమింతే అనుకునే ఉదాసీనత కరుడు కట్టిన రోజులవి. విశ్వాసంతో నాటి రాచరిక వ్యవస్థను నమ్ముకొని జీవించడమే వారికి తెలుసు. ఆర్థిక తారతమ్యాలు అంతస్థుల అగాధాలు అనాడూ ఉన్నాయి.

పాయసాన్నాలొకవైపు—పాసిన వంటకాలు మరోవైపు—కస్తూరీ గుబాళింపు లొకప్రక్క, కంపుగొట్టే మలినపు గుడ్డలు మరోప్రక్క—మాణిక్యాంగుళీయాలు. తార హారాలు, ముత్యాలసరాలు ఒకవైపు - కానుకు రాని కమ్మలు, వీసం చేయని మంగళ సూత్రాలు మరోవైపు. ఈ వర్గ తారతమ్యాలు వేశ్యల్ని కూడా వీడలేదు. ఏనాడయినా రాచరిక వ్యవస్థయొక్క నిజస్వరూపమిదే. విదేశాలతో విస్తారంగా వ్యాపారం జరిగినా అది అవచితిప్పయసెట్టిలాంటి కోటీశ్వరులనే సిద్ధం చేసింది.

## రాజకీయ స్థితిగతులు - పరిపాలనా యంత్రాంగం సమకాలీన సాహిత్యంతో సమన్వయం

రెడ్డిరాజుల కాలంనాటి రాజకీయ స్థితిగతుల్ని గ్రహించడానికి ఆనాటి రాగిరే కులుగాని, శిలా శాసనాలుగాని అంతగా ఉపకరించవు. సకల నీతి సమ్మతము వంటి

గ్రంధాలు రాజనీతిని గురించి చెప్పినాయి. కాని అవి కేవలం కామందకము, పంచ తంత్రము మొదలైన సంస్కృత గ్రంధాలకు అనువాదం కావడం చేత, మార్పులేని రాజనీతి సూత్రాల్నే వల్లించడంచేత రెడ్డి రాజుల కాలపు ప్రత్యేకతను ఈ గ్రంధాలు చాట జాలవు. రుక్మాంగద చరిత్ర కొంతవరకు ఆనాటి పరిస్థితుల్ని అర్థంచేసుకోవడానికి అవకాశం ఇచ్చింది. శ్రీనాధుని రచనల్లోని కొన్ని మూలాతిక్రమణ ఘట్టాలు ఆనాటి రాజకీయ జీవితాన్ని ప్రతిఫలింప జేస్తున్నాయి.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం స్వతంత్రులైన రెడ్డిరాజులు దాదాపు నూట పది సంవత్సరాలు అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరు, కోరుకొండ మొదలైన ప్రాంతాల నుండి ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. వీరి రాజ్య విస్తీర్ణం కర్నూలు జిల్లా నుంచి విశాఖపట్టణం జిల్లాదాకా, దక్షిణంలో నెల్లూరు జిల్లా పర్యంతం ఉన్నట్లు తెలుస్తున్నది. ఒకవైపు ముసల్మానుల ముట్టడులు, బహ్మనీసుల్తానుల దండయాత్రలు, మరొకవైపు వెలమదొరల వైరం, కర్ణాట రాజుల రాజ్య విస్తీర్ణ కాంక్ష, ఓఢ్ర రాజుల హుంకారాలు- ఈ విధంగా నలుదిక్కుల అలుముకున్న దట్టపు చిక్కుల్ని లెక్కించక అలు బెంగాల్‌దాకా, ఇటు బస్తరుదాకా విజయయాత్ర సాగించారు. బెండపూడి అన్నయ మంత్రికి అన్న, అల్లాడ రెడ్డికి మంత్రి అరియేటి లింగ ప్రభువరుడు రూాడ (జయపూరు) నప్తమాడె (గంజాం, మన్నెదొరల సంస్థానాలు) బాహువౌంతి (ఒరిస్సా) జంత్రనాడు (ఒడ్డాది విశాఖపట్టణంలోనిది) మొదలైన ప్రదేశాల్ని జయించి తెలుగు భూమిని తన ప్రభువుచేత ఏలించాడని భీమేశ్వర పురాణం చెప్పుతున్నది.

పూర్వ ప్రభుత్వాల్లాగానే వీరిది కూడా రాచరికపు వ్యవస్థ. అన్న కుమారులు చిన్నవారైతే, తమ్ములు రాజ్యాధికారాన్ని చేపట్టే ఆచారం రెడ్డి రాజ్యంలో కనిపిస్తుంది. కోరుకొండను పాలించిన ముమ్మిడిరెడ్డి అనంతరం అతని తమ్ముడు సంగారెడ్డి రాజ్యాన్ని పరిపాలించిన తరువాతనే అతని కుమారులకు రాజ్యం దక్కింది. అనపోతారెడ్డితరువాత కుమారగిరిరెడ్డి చిన్నవాడుకావడంచేత తన తమ్ముడు అనవేమారెడ్డిని సింహాసనాన్ని ఎక్కించడం మనకు తెలుసు. వేమ వీరభద్రారెడ్లు అలాంటివారే. రాజమహేంద్రవర రాజ్యాన్ని వీరభద్రారెడ్డికి స్వాధీన పరచింది వేమారెడ్డి. ఈ విషయం కాశీఖండ, భీమేశ్వర పురాణాలు తెలియజేస్తున్నాయి. ఇంతేకాదు, రాజులు ఆనాడు కేవలం వంశ ఔన్నత్యాన్నిబట్టే కాక శక్తి సామర్థ్యాలు, తెలివి తేటలాధారంగా కూడా అధికారాన్ని చేజిక్కించుకున్నారు. ప్రోలయ వేమారెడ్డి, మల్లారెడ్డి, కాటయ వేమారెడ్డి, పెదకోమటి వేమారెడ్డి, అల్లాడరెడ్డి, అల్లాడ వేమారెడ్డి - వీరంతా దీనికి లక్ష్యాలే. ఆనాడు రాచ కుటుంబాల్లో బహుపత్నీకులున్నట్లు కాటయ వేమారెడ్డిని ఉదాహరణగా చూపవచ్చు. ఈతనికి నలుగురు భార్యలట ! రాజ్యాన్ని సుస్థిరం చేసుకోవడానికి, వంశ విస్తీర్ణానికి బహుభార్యాత్వం ప్రయోజనకారిగా ఉండేది.

ఈనాడు ఒక విశేషమైన వినోదంగా ఉన్న వసంతోత్సవం కూడా రాజకీయ ప్రయోజనాల్ని నెరవేర్చడం కోసమే అంటే అతిశయోక్తికాదు. ఆ ఉత్సవ సంవర్భంలో రాజు తన నగరం నుండి అశ్వారూఢుడై వసంత పూజ చేయడానికై వైభవంగా బయలుదేరుతాడు. సామంత రాజ బృందం ఉపవనంలో రాజు రాకకై వేచి ఉండి తాము తెచ్చిన కానుకల్ని సమర్పిస్తారు. పరస్పరం పరిచయాల అనంతరం రాజు వారి కుశలమడిగి వీడియము లిప్పించి గౌరవిస్తాడు. తరువాత దేవతారాధనం. పంచ మహా వాద్యాలు మ్రోగుతూ ఉంటే స్త్రీలు ఆటపాటల్ని ప్రదర్శిస్తారు. మొత్తంమీద ఈ ఉత్సవాలు వివిధ రాజుల, కవుల పండితుల పరస్పర పరిచయాలకీ, సుహృద్భావం యొక్క పెంపుదలకు ఉపయోగపడింది. ఈ ఉత్సవం కేవలం రాజులు, వారి అనుచరులు, పండితులు, కవులు వీరికే పరిమితం. సామాన్య ప్రజానీకం ఇందులో పాల్గొన లేదు. వారు ప్రేక్షకులుగా మాత్రమే ఉండేవారు. (సింహా-7-140) ఈనాటి హోళీ పండుగలో వలెకాక ఆనాడు వసంతోత్సవం కస్తూరీ గంధసారాది సువాసన ద్రవ్యాలతో కూడి వ్యయంతో కూడుకొని వుండేది. సామాన్యులకు అందుబాటులో ఉందనడానికి అవకాశం లేదు

ఆనాడు దూత పరిపాలనా యంత్రాంగంలో ఒక కీలకమైన వ్యక్తి. దూతల్ని అవమాన పఱచరాదనీ, చంపరాదనీ, గౌరవంతో చూడాలనీ పల్నాటి వీర చరిత్ర చెప్పుతున్నది. భాస్కర రామాయణం, సిద్దేశ్వర చరిత్రలు కూడా ఇందుకు సాక్ష్యం. దూతలు చాలావరకు బ్రాహ్మణులు కావడం ఒక విశేషం. దాదాపు వీరు దౌత్య రంగంపై గుత్తాధిపత్యం వహించారు. శృంగార నైషధంలో నిషధ దేశం నుండి వచ్చిన దూతలు "విప్రనికరమే" మూలంలో దూత, ద్విజ, వంది చారణులు దూతలుగా వస్తే ఇక్కడ కేవలం విప్రనికరమే వచ్చింది. "నిషధ దేశపు విప్ర నికరంబుఁ బూజించి, యలయక ప్రియుసుద్ది అడుగఁ దలచి"నది దమయంతి.

రాజనీతి ప్రకారం రాజ్యం సప్తాంగ ప్రధానమై ఉండాలి. రాజు రాజ్యాధినేత. అయినా ధర్మశాస్త్రాలలో, స్మృతులలో చెప్పబడిన రాజ్యాంగ నియమాలకు ఆతడు కట్టుబడి ఉండాలి. మంత్రివర్గం యొక్క సలహాలను ఎప్పటికప్పుడు పాటించాలి. పురోహితుఁడు, సేనాని వీరిద్దరూ కూడా మంత్రివర్గ సభ్యులుగా ఉంటారు అవసరమైతే సలహాలు ఇస్తారు. అయినా రాజు నిర్ణయమే అంతిమ నిర్ణయం-రెడ్డి రాజుల్లో రాచవేమారెడ్డి ఈ అధికారాన్ని దుర్వినియోగపఱచి, ప్రజాపీడకుడై, ప్రజల కోపానికి ఆహుతైనాడు.

ముఖ్యమంత్రిని ప్రధాని అనిపిలవడం వాడుక. అనవేమారెడ్డి దానపల్లి శాసనంలో ఇమ్మడి మంత్రి "నీతిమంత్రీశ్వరుఁడుగ" పేర్కొనబడినాడు. నీతి శాస్త్రాలు బ్రాహ్మణుల్ని మాత్రమే మంత్రులుగ నియమించాలని చెప్పుతున్నాయి. రెడ్డిరాజుల్లో కుమారగిరి ఈ నియమాన్ని ఉల్లంఘించాడు. రామప్రెగ్గడ, మల్లినాథుఁడు, మామిడి

సింగయ-పీద రెడ్డి రాజ్య నిర్వహణలో సహాయం చేసిన సచివుడు. కుమారగిరి తన బావమరిది కాటయ వేమారెడ్డిని మంత్రిగా గ్రహించినా, జతనముపెద్ది అనే బ్రాహ్మణున్ని సలహాదారుడుగా నియమించినట్లు తెలుస్తున్నది.

పూర్వంకంటె రెడ్డి యుగపు మంత్రుల్లో ఒక విశేషముంది. వీరిలో కొందరు అదనపు బాధ్యతల్ని స్వీకరించి తమ అధికృతను కనబరచారు. అనుక్రమంగా వచ్చే వారసత్వపు హక్కును తొలగించి రాజ్యాన్ని మరొకరికి కట్టబెట్టే అధికారం వీరి కుంది. కుమారగిరి విషయంలో ఇలాగే జరిగింది. అనపోతారెడ్డి మరణానంతరం కుమారగిరిరెడ్డి బాలుడైన కారణంచేత అతని సోదరుడు అనవేమారెడ్డిని సింహాసనం అధిష్టింప చేయడం ఒక ఉదాహరణం. కనుకనే అనవేమారెడ్డి "రాజ్యశ్రీ రమణి స్వయంవర పతిగ" శాసనాలలో పరిగణింపబడ్డాడు. యువరాజు పదవి కూడా అత్యంత ప్రధానమైనది. రాజు తరువాత ప్రముఖ వ్యక్తి యువరాజే. "యువరాజు సమాత్యుం డును నవనీపాలునకు దంచి తాయత భుజముల్" అని సకల నీతి సమ్మతంలో ఉంది. ప్రోలయ వేమారెడ్డి కుమారుడైన అనపోతారెడ్డిని ఎఱ్ఱనామాత్యుడు "చమూపాగ్రే సరుడు"గ వర్ణించాడు. తీరాంధ్రదేశంలో రెడ్డిరాజ్యస్థాపనకు ప్రోలయవేమారెడ్డి సోదరులు సహాయం చేయడం, కుమారగిరిరెడ్డి కుమారుడు రెండవ అనపోతారెడ్డి తూర్పు తీరాన్ని జయించడంలో సహాయం చేయడం గమనిస్తే యువరాజులు కూడా బాధ్యతాయుతమైన కార్యాలు నిర్వహించారని తెలుస్తుంది.

## ప్రభుత్వాధి కృత్యాల విభాగం :-

ప్రభుత్వ నిర్వహణకోసం రాజ్యం నాలుగు ముఖ్య విభాగాలుగా విభజింపబడింది. 1. సీమ, 2. నాడు, 3. స్థలము, 4. గ్రామము. స్థలమనే విభాగం తూర్పు చాళుక్యుల కాలం నుంచీ మనకు పరిచితమే. కాకతీయులనాటి 'నాయంకర' పద్ధతి కూడా ఈనాడుంది. ఈ నాయంకరాలే నాడులుగ, ఈనాడులే స్థలాలుగా విభజింపబడే పద్ధతి రెడ్డి యుగంలో కూడా కొనసాగింది.

వీటితోపాటు 'సీమ' అనే క్రొత్త రాజకీయ విభాగం రెడ్డి యుగంలో అదనంగా ప్రవేశపెట్టబడింది. ఇది కేవలం రెడ్డి రాజులు కల్పించిన నూతన విభాగం. కాకతీయులనాడిదికానరాదు. కొండవీటిశాసనాలుకొన్ని "కోట భూమి" "శ్రీశైలభూమి" అన్న పేర్లనుతెలియజేస్తున్నాయి. కొన్నిసీమలుకలిపి ఒక"భూమి"గాను,కొన్నిభూములు కలిపి ఒక దుర్గంగానూ పరిగణించేవారు. నాలుగు దుర్గాలు, వన్నాలుగు సీమలు రెండు వేల నలభై ఎనిమిది గ్రామాలు కొండవీటి దండకవిలెలో పేర్కొనబడినట్లు తెలుస్తున్నది.

ప్రాంతీయ పరిపాలనా సౌలభ్యం కోసం ప్రభుత్వోద్యోగులు మూడుశ్రేణుల్లో విభజింపబడ్డారు. 1) రాచతికపు ఉద్యోగులు, 2) సామంతులు, 3) తదితరులు.

రాచటకపు ఉద్యోగులు గవర్నర్లుగ, సైనికాధిపతులుగ, నియమింపబడేవారు. వార్షిక కప్పాన్ని చెల్లించే ఒప్పందంపై సామంతులు గ్రామాల్ని కౌలుకు తీసుకునేవారు. వీరు కాక ఇతర రాజోద్యోగుల పని స్వభావమెలాంటిదో తెలిసే ఆధారాలు లేవు.

అనాటి గ్రామం ఒక సమిష్టి కుటుంబంగా విలసిల్లింది. ఏ గ్రామానికాగ్రామమే ఒక కేంద్రం. గ్రామ పరిపాలనా బాధ్యతల్ని నిర్వహించే వ్యక్తుల్లో రెడ్డి, కరణము, పురోహితుడు, తలారి, బారికాపు, కమ్మరి, కుమ్మరి, సాలె, కంసాలి మొదలైనవారు ముఖ్యులు. రెడ్డి వ్యావసాయిక సంస్థకు అధిపతి. గ్రామ వ్యవహారాల్ని నిర్వహించే బాధ్యత ఈయనదే. రాజుకు ప్రతినిధిగా వ్యవహరిస్తూ ధాన్యరూపంలో, కానుకల రూపంలో, సువర్ణ రూపంలో ఆదాయపు పన్నును వసూలుచేసి ధనాగారానికి పంపే బాధ్యత వహిస్తాడు. వసూలు చేసిన ధాన్యాన్ని రాచగాదెలకు తరలించి అవసరమైతే పండుగలకు స్థానిక దేవాలయాలకు రాజు అనుమతితో వెచ్చించే అధికారం ఈతని కుంది. గుంటూరులోని తంగెడ సమీపంలోవున్న కుమారగిరిరెడ్డి శాసనంలో ఈ రాచ గాదెల ప్రస్తావన వుంది. కొన్ని చోట్ల గ్రామ పెత్తందార్లయిన రెడ్లు, కరణాలు, పౌర, న్యాయ పరిపాలనాధికారాల్ని చేజిక్కించుకొని నిరంకుశంగా ప్రవర్తించినట్లు శ్రీనాథుని చాటు వొకటి చాటుతుంది.

గ్రామ ఆదాయపు లెక్కలు సరిచూచే ఉద్యోగి కరణం. బ్రహ్మాదాయ దేవాదాయ లెక్కల్ని సరి చూడడం, తరి, మెట్ట సేద్యాలనుండి వచ్చిన ధాన్యాల్ని విలువ కట్టి పన్ను నిర్ణయించడం, భూముల్ని కొలిపించడం మొదలైన పనులు ఈతడు నెరవేరుస్తాడు. రెడ్డి కరణం-వీరిద్దరు గ్రామ వ్యవహార నిర్వహణంలో కీలక పాత్ర ధారులు.

గ్రామ వ్యవస్థలో పురోహితుడు అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తాడు. ప్రజలకు పంచాగం చూసి తిథి, వార, నక్షత్ర వర్జ్యాల్ని తెలియ చెప్పడం, వ్యవసాయపు పనుల ప్రారంభానికి మంచి దినాన్ని సూచించడం, ఈయన బాధ్యతల్లో ముఖ్యమైనవి. ప్రభాత కాలంలో "దొరల ఇండ్లకు నేగి తులసియుఁబెట్టి వరుస నిచ్చలు విన వారముఁజెప్పి" వచ్చుట ఈతని నిత్యకృత్యం. [నవ—పు 153]

గ్రామాన్ని రక్షించే రక్షక భటుని "యామికు"డనేవారు. ఈతనికే "తలారి" అనిపేరు. ప్రతి అర్ధ యామానికి ఈతడు వీధుల్లో గస్తీ తిరుగుతూ గ్రామంలోనికి రాకపోకలు చేసే వారిని పరీక్షించి అనుమానితుడిని అధికారుల కప్పగించడం ఈతని పని. సింహాసన ద్వాత్రింశికలో ఈ యామికుడికి "ఆరెకు"డనే పేరు ప్రయుక్తమైంది. దొంగిలించిన దొంగ దొరకని పక్షంలో పోయినసొమ్మునకు ఈతడే బాధ్యుడు కావడం ఒక విశేషం. ఈ పద్ధతివల్ల కొన్ని సమయాల్లో అమాయకులు శిక్షింపబడడంలో ఆశ్చర్యంలేదు. ఈ రక్షక భటులు వెలికావలి వారని, అచ్చుకావలివారని

రెండు రకాలుగా ఉండేవారు- సాధారణంగా ముతరాజు కులంవారు ఈ కావలి పనిలో నియుక్తులు కావడం ఆచారం. రెడ్డిరాజుల నాటి ఒక శాసనంలో ఇలా ఉంది.

"అనవేమారెడ్డిగారి ప్రభుత్వంలో... చోరుల ఉపద్రవంచేత నిర్వాహకం లేక సంసార్లు ప్రభువుతో చెప్పుకున్నంతలో, బిప్పేటి బోడి లింగనాయుడు అనే ముతరాచ కొల్వుడు అయి వుండగా అతని సామంత్వంకు అచ్చు కావలి నిర్వాకం కొన్నింటికి చేయగలదని ప్రభువుకు తోచిన ఈ కోట మొదలైన సీమలు అచ్చు కావలి నిర్ణయం చేసినారు, "అడపాసింగమ నాయకుని వెలికావలి"

గ్రామాన్ని రక్షించే మరొక రక్షక భటుడు బారికాపు. అడవి ప్రాంతాలు అధికంగా ఉండడంచేత క్రూరమృగాల, శత్రువుల బారినుండి రక్షణకోసం ప్రతిగ్రామం చుట్టూ ప్రహరి గోడ యొక్క నిర్మాణం అత్యంతావశ్యకమై ఉండేది. ఈ బారికాపు "పారా" తిరుగుతూ ప్రమాదాన్ని సూచించడానికి చప్పుళ్ళతో ప్రజల్ని హెచ్చరించే వాడు. బారికాపు-తలారి వీళ్ళిద్దరు గ్రామం యొక్క బాహ్యాంతర్భాగాల్ని రక్షించడంలో అప్రమత్తులై ఉండేవారు. ఈ ప్రహరి తిరగడాన్ని శ్రీనాధుడు తన గ్రంధాల్లోసూచిం చాడు.

"ప్రహరి చరింతు రెప్పుడును
భైరవు లర్ధ నిశాగమంబులన్" (భీమే)
"అడ్డ పెట్టెదగాక తీవ్రాంశు రధముఁ
బ్రహరిఁ దిరుగక యుండగ భర్మగిరికి." (కాశీఖండం)

ఇతర గ్రామోద్యోగులకు వలెనే ఈ రక్షక భటులకుకూడా మాన్యాలున్నాయి. పండుగలు, ఉత్సవాల సందర్భాల్లో "తలారి కట్నం" అదనంగా లభించడం ఆచారం. వంశక్రమానుగతమైన ఈ ఉద్యోగ నిర్వహణంలో అప్రమత్తులై శాంతి భద్రతల్ని కాపాడడం వీరి బాధ్యత.

రైతు వ్యవసాయపు పనుల్లో నిమగ్నుడై వుండగా అతని జీవితావసరాలన్నిం టిని వృత్తి పనులవారు సమకూర్చేవారు. గ్రామ సమిష్టి జీవిత నిర్వహణానికి సాయ పడేవారందరికి "యీనాము" భూములుండేవి. వీటికి పన్ను మినహాయింపున్నది. ఈ ఈనాము పద్ధతే వెట్టి చాకిరికి మూలమై రాచవెట్టి, గ్రామవెట్టి, కులవెట్టి రూపాల్లో అనాటి నుండి గత దశాబ్ది వరకూ ఏదో ఒక రూపంలో కొనసాగింది. ఇప్పటికీ కొన్ని గ్రామాల్ని ఇది ఇంకా పట్టి పీడిస్తూనే వుంది.

గ్రామమంతా ఐక్యంగా ఉండవలసిన అవసరం ఆనాడెంతో వుంది. నిరంతర యుద్ధ మేఘాలు, రాజకీయ తుఫానులు- గ్రామ జీవితం వీటి తాకిడికి తట్టుకొని ఆనాటి నుండి గత శతాబ్ది వరకు చెక్కు చెదరక నిలిచి ఉందంటే దాని స్వయం

సంపూర్ణ లక్షణమే కారణమని చారిత్రకుల అభిప్రాయం. రాజులు - రోజులు వీపు మారినా ప్రజల ప్రశాంత జీవనానికి దెబ్బతగుల నంతవరకు గ్రామవ్యవస్థ సుస్థిరంగానే నిలిచింది.

## సైనిక వ్యవస్థ - యుద్ధాలు :-

గజ తురగ పదాతి దళాలు యుద్ధ రంగంలో ఉపయుక్తాలయ్యేవి. పల్నాటి వీర చరిత్రలో భద్రగజాలయొక్క వర్ణనముంది. (పల్నా—పు 29-30) కొండపీటి రాజుల యొద్ద గజదళాలున్నట్లు అనవేమారెడ్డికున్న "పరిచితానేక గతి విశేషవారణ మారణోపాయ" అనే బిరుదునుబట్టి తెలుస్తుంది. అరేబియా పర్షియా గుర్రా లానాడు ప్రసిద్ధి వహించాయి. అల్లాడరెడ్డి కుమారుడు దొడ్డారెడ్డి గొప్ప అశ్వికునిగ పేరు పొందాడు. కాశీఖండంలో ఈతని అశ్వవిద్యా నైపుణ్యం ఉగ్గడింపబడింది. (కాశీ-1-53], పదాతి దళమానాడు నాలుగు రకాలుగా కనిపిస్తుంది. 1) సెలగోలు బలం 2) విలుకాండ్రు 3) కైజీతగాండ్రు 4) ఎక్కటులు. బల్లెం అనే అర్థం గల సెల కోల ధరించి యుద్ధం చేసేవారు సెలగోలు బలం. అలాగే విలుకాండ్రు. ప్రాచీన కాలం నుంచీ పదిహేడవ శతాబ్దాంతం దాకా ఈ బాణ విద్య ప్రచారంలో వుంది. తమ విలువిద్యా నైపుణ్యాన్ని శత్రువులకు సూచించి భయావహాల్ని చేయడానికై తమ బాణాలమీద నామాక్షరాల్ని చెక్కించడం సాంప్రదాయమైనట్లు హరవిలాసంలోని ఒక పద్యాన్నిబట్టి గ్రహించవచ్చు. [హర-3-57] దినబత్తెపు జీతగాండ్రే కైజీతగాండ్రుగా పిలువబడ్డారు. ఆంధ్ర భాషార్ణవంలో ఈ పదానికి "శపథా యుధ విశేషః" అనే అర్థ మున్నట్లు, దానికి యుద్ధంలో వెనుకంజ వేయనని ఒట్టు తిన్నవాడని, వీరు తాత్కాలిక వీరభటులుగ ఉండి దిన జీత బత్తేలకై యుద్ధంలో చేరినట్టివారని H.R Kingdom వివరించింది. ఎక్కటి బహువచన రూపం ఎక్కటులు. ఎక్కటి అంటే ఒంటరివాడని అర్థం. యుద్ధ రంగంలో సైన్యాలు తిరోగమనం పొంది అపజయం తథ్యమని తోచి నప్పుడు ఈ నిలువ బలం ఉపయోగపడుతుంది, వీరు అసాధారణ బలవంతులై గ్రామ గ్రామాల్లో నెలకొని ఉన్నట్లు, తంగెడ, పోలెపల్లి మొదలైనచోట్ల ఎక్కువగా నివసించినట్లు శాసనాలవల్ల తెలుస్తుంది.

పైన పేర్కొన్న బలాలన్నీ పలనాటి వీరచరిత్రలో ఉన్నాయి. [పల—పు 20, 28] ఎక్కటి శబ్దానికి బదులుగా వంటరి శబ్దం పర్యాయంగా ప్రయుక్తమైంది. "సెల గోలు ప్రజలను హెచ్చు వంటర్ల" రెడ్డిరాజుల కాలంలో రాజ్య వ్యాప్తంగావున్న ఈ "ఎక్కటులు" తరువాత కాలంలో ఒక ప్రత్యేక సైనిక విభాగంగా మారి ఈనాడు 'వంటర్లు' అనే పేరుతో తెలగ జాతిలో- ఒక తెగగా మిగిలిపోయినట్లు చారిత్రకులు గుర్తించారు.

ఆ యు ధా లు :-

సాంప్రదాయ సిద్ధమైన ముప్పయిరెండు రకాల ఆయుధాలు ఆనాడు ప్రచారంలో వున్నాయి. కత్తులు, ఖడ్గాలు, బాకులు, గదలు, ఈటెలు, గొడ్డళ్లు మొదలైనవి అందులో ముఖ్యం. ఇవేకాక ఈ కాలంలో బాణాలు, బండలు మొదలైన వాటిని విసరి వేయడానికి త్రాళ్ళతోనూ, మీటతోనూ నడపబడే పాషాణ యంత్రాలు చాలా ప్రచారంలో వున్నట్లు తెలుస్తున్నది. ఫెరిస్తా వ్రాతల్నిబట్టి యుద్ధరంగంలో ఫిరంగులు కూడా వాడబడినట్లు తెలియగలం. "అరిగె" అనే పేరుగల డాలు కూడా ఈనాడు ప్రచారంలో ఉంది. "అరిగెల వారలు" (విక్ర 4-85) "అరిగ బిళ్ళలు" (సింహా-1-156), వర్ణ వివక్ష లేకుండా ప్రజల్ని నిర్ణయించి సైన్యంలో చేర్చుకునేవారు. వారి వారి అర్హతల్ని నిర్ణయించి సైన్యంలో చేర్చుకోవడానికి నియమింపబడ్డ ప్రత్యేకోద్యోగు లను "కాలరు"లని పిలిచేవారు. [వీరం వి-2-87, 88] సైన్యంలో చేరడానికి గల అర్హతలేవో బార్బోసా చెప్పాడు. ఇందులో చేరిన వారికి అదనపు సౌకర్యాలు కల్పింప బడేవి. సేనయొక్క వినోదానికై యుద్ధ శిబిరాలున్నచోట వేశ్యావాటిక ఉండడం గమ నార్హం. అదొక వింత ప్రపంచం. ఒక ఉత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని వివిధ వస్తు ప్రదర్శనలు, క్రయ విక్రయశాలలు వెలసినట్లుగా, యుద్ధ శిబిరాలు కూడా ఉత్సవాల ఉరుసులాగా గోచరించడం ఒక విశేషం.

"ఆదండు లోపల అఖిల వణిజులును
సకల ధాన్యంబులు సకల రత్నములు
బంగారు వెండియు బహుధన వితతి
సరిగ వస్త్రంబులు సరసం బట్టు."

పటములు ఘనతంతు పటములు. మరియు "కాంస్య తామ్రేశ్వేకక్రమ భాండ ముల" క్రయ విక్రయాధికాలు జరిగేవని పల్నాటి వీరచరిత్ర చెబుతుంది.

స్థల, జల, వన, గిరి భేదాలచేత దుర్గాలు నాలుగు రకాలు. రాజమహేంద్రవర విరవద్యపురా లానాడు స్థల దుర్గాలుగా ప్రసిద్ధిచెందాయి. కుమారగిరికి మంత్రీ, వేమా రెడ్డికి తండ్రీ అయిన కాటమరెడ్డి జలదుర్గాల్ని యథాస్థితికి తేవడంలో చాలా శ్రద్ధ వహించి "జలదుర్గమల్ల" బిరుదు పొందాడు. అనవేమారెడ్డి "స్థల దుర్గ విదళన బల రాముడుగ, జలదుర్గసాధన రఘురాముడుగ" శ్రీశైల శాసనంలో ప్రశంసింపబడ్డాడు. కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ, నాగార్జునకొండ అనాటి గొప్ప గిరి దుర్గాలుగ ప్రసిద్ధి చెందాయి.

రెడ్డిరాజుల కాలంలోనూ, విజయ నగరరాజుల కాలంలోనూజరిగిన అసంఖ్యాక మైన యుద్ధాలన్నీ కేవలం హిందూ మహమ్మదీయ ప్రాతిపదికపై మాత్రమే జరిగినా

యని చెప్ప వీలులేదు. "శత్రువు యొక్క శత్రువు మిత్రుడు" అన్న రాజనీతి ఆనాటి యుద్ధాలకు మూలం. ఈ విషయాన్నే శ్రీనాథుఁడు కాశీఖండంలో ఒక చోట వ్యక్తపఱచాడు [కాశీ-6-292] మహమ్మదీయులు తమలో తాము కలహించుకొని హిందూ రాజుల సహాయాన్ని కోరడమో లేక హిందూ రాజులు తాము కలహించుకొని మహమ్మదీయ ప్రభువుల సహాయం పొందడమో జరుగుతుండేది. తుగ్లక్ పాలన మంతరించినా, మహమ్మదీయుల నుండి ఆంధ్ర దేశం విముక్తమైనా కాకతీయులనాటి వలె ఒక్క ఏలుబడిలోకి మాత్రం రాలేకపోయింది. దక్కనులో బహ్మనీసుల్తానులు రాజ్యకాంక్షతో, ఓరుగంటితోనూ, విజయనగర రాజుల్తోనూ వైరం పెట్టుకున్నారు. ఇలాంటి సందర్భంలో రాజులంతా కలిసి సుల్తానును ఎదుర్కోవడానికి మారుగా తమలో విరోధాలు పెంచుకున్నారు. ఇలాంటి స్థితిలో ఇద్దరు తెలుగు వీరులు బలవంతులై రెండు క్రొత్త రాజ్యాల్ని స్థాపించారు. ఒకడు రేచెర్ల అనపోతా నాయుఁడు. రెండవ వీరుఁడు ప్రోలయవేమారెడ్డి. పూర్వాంధ్ర దేశంలో ముసునూరి నాయకుల అధికారం క్షీణించగానే వేమారెడ్డి స్వతంత్రుడై తన నలుగురు సోదరుల సహాయంతో తీరాంధ్రదేశాన్ని ఆక్రమించాడు. అద్దంకి ఈతని రాజధాని. తెలంగాణ మప్పటికే విముక్తమైంది. తుంగభద్రానదీ ప్రాంత ప్రదేశాన్ని విజయనగరరాజు లాక్రమించుకొని తమ రాజ్యాన్ని స్థాపించారు. ఈ విధంగా ఆంధ్ర దేశం 14 వ శతాబ్ది చివరి భాగంలో మూడు ముఖ్య రాజ్యాలుగా చీలిపోయింది. 1) తెలంగాణం, 2) పశ్చిమాంధ్ర దేశం, 3) పూర్వాంధ్ర దేశం.

## శ్రీనాథుని అంతిమ కాలం - సమకాలీన రాజకీయ సాంఘిక స్థితిగతులతో సమన్వయం

నాటి సంస్థానాలు కవులపాలిటి కల్పవృక్షాలు. అధికార యుక్తమైన ఔదార్యం దాని లక్షణం. ఆ ఔదార్యమే కవులపట్ల, కళలపట్ల అభిమానం చూపించింది. అగ్రహారాలు బ్రాహ్మణులకు ప్రసాదించింది. ఇది వారి సాంప్రదాయం. అయితే నలుగురు కవుల్ని నాలుగు అగ్రహారాల్ని పోషించడానికి నాలుగువేల కర్షకుల కడుపులుకొట్టే సాంప్రదాయం కూడా వారిదే. శ్రీనాథుఁడొక కవిగాకాక ఒక కర్షకుడుగా ఆ వ్యవస్థకు బలైనాడు. ఏ వ్యవస్థ శ్రీనాథునకు ఒక కవిగా కల్పవృక్షమై నిలబడిందో ఆ వ్యవస్థే అతన్ని అవస్థలపాలుచేసి ఒక కర్షకుడుగా కఠిన శిక్షల్ని విధించింది. వారి కరుణకూ, కాఠిన్యానికీ కూడా లక్ష్యమై నిలిచాడు. వారు రెడ్డి రాజులైనా, ఒడ్డెరాజులైనా ఆనాటి భూస్వామ్య వ్యవస్థలోనే ఆ లోపముంది. అది కనకాభిషేకాలు చేయగలదు. కాళ్లకు సంకెళ్ళుకూడా వేయగలదు. కాలప్రభావ మలాంటిది.

బ్రాహ్మీదత్త వరప్రసాదుడైన శ్రీనాథుడు ఒక విద్యాధికారిగా, ఆస్థాన కవిగా విద్వాంసుడుగా అనేక సంవత్సరాలు అనన్య సౌభాగ్య కవితా వైభవ ప్రాభవాల్ని ప్రకటించాడు పరిస్థితుల ప్రాబల్యంవల్ల రెడ్డి ప్రభువుల ప్రాపకం తప్పి ఒడ్డె ప్రభువుల ఏలుబడిలో కేవలం ఏడు నూర్ల టంకాల గుత్తపైకం చెల్లించలేక విలపించడం తెలుగు సాహిత్యాభిమానుల మనసుల్ని చివుక్కుమనిపించక మానదు. ఈతని మహా వైభవ జీవిత నాటకంలోని చరమాంకం ఎలాంటివారినైనా చలింపచేయక మానదు. సాహిత్య చరిత్రకే ఇదొక కళంకం అంటారు విమర్శకులు. శ్రీనాథుని జీవితంలోని ఈ విషాద సన్నివేశానికి సమకూడిన పరిస్థితులేవి?

రాజమహేంద్రవరంలో కూడా రెడ్డి సామ్రాజ్య మస్తమించింది. నిలువనీడ లేని శ్రీనాథుడు కృష్ణ తీరంలోని బొడ్డుపల్లెలో భూమిని గుత్తకు తీసుకున్నాడు. ఈ గుత్త వ్యవసాయానికి ముందు ఈయనకు కొంత సొంతవ్యవసాయమున్నట్లుగా పొన్నుపల్లి తామ్ర శాసనంలోని "శ్రీనాథ భట్టరు శాసనాచార్య దక్షిణ భాగం వకటి" అన్న వాక్యం నిరూపిస్తుంది. చారిత్రక సమన్వయాన్నిబట్టి కొండవీటి రాజ్యం, రాజమహేంద్రవర రాజ్యం 1450 సంవత్సరం నాటికి కపిలేంద్ర గజపతి అధీనమైనాయి. [డా॥ కొర్లపాటి–శ్రీనాథుడు.పు.281] మొదటి నుంచీ రాజమహేంద్రవరం గజపతుల రాష్ట్రానికి ప్రక్కలో బల్లెమై భయపెడుతుండేది. కర్ణాటకులు కూడా వారికి శత్రువులే. రెడ్లు, కర్ణాటకుల మధ్య మైత్రి దృఢంగా ఉంది. గజపతులు విరోధభావం వహించడానికి ఇదొక కారణం. పశ్చిమంలో బహ్మనీ రాజ్యం వర్ధిల్లుతూవుంది. అహమ్మదుషా మరణానంతరం అల్లాఉద్దీన్‌షాహి పరిపాలన చేపట్టి కర్ణాటక సామ్రాజ్య చక్రవర్తి ప్రౌఢదేవరాయలతో యుద్ధాలు ప్రారంభించాడు. రాయలు తురక ప్రభువు బహమనీ సుల్తానేకాక హిందువైన గజపతికూడా శత్రువు కావడంవేత ఒక ప్రక్క గజపతులతో, మరో ప్రక్క తురకలతో యుద్ధం చేయవలసి వచ్చింది. యవన కర్ణాట రాజులు సమాన బలం కలవారు. సమర్థులు. కనుక దక్షిణంలో తమ తమ సామ్రాజ్యాల్ని సుస్థిరంగా నిలపడానికై ఘోరంగా పోరాడుతున్నారు. ఇలాంటి వృద్ధుల నడుమ రెడ్డి రాజ్యం ఎంతో కాలం నిలువలేక పోయింది. గజపతులు రెడ్డి రాజ్యాన్ని కబళించే పట్టుదలతో ఉన్నారు. దీనికి పరిస్థితులు కూడా అనుకూలించాయి. గజపతుల రాజధాని కటకపురంలో పిప్లవంరేగి రాజైన భానుదేవుడు చంపబడ్డాడు. ఇంతటితో కళింగ గాంగ వంశం అంతరించింది. మంత్రిగా ఉన్న కపిలేంద్ర గజపతి రాజయ్యాడు. ఈతడు చాలా సమర్థుడు. పరాక్రమవంతుడు రెడ్డి రాజ్యాన్ని ఆపోశనం పట్టదలచాడు. మొదటిసారి మరలిపోయినా, పట్టువిడువక రెండవమారు రాజమహేంద్రవరాన్నేకాక దక్షిణంలో ఉదయగిరి వరకూగల కర్ణాటక రాజ్యాన్ని ఏకశిలా నగరం వరకుగల పద్మవెలమ నాయకుల రాజ్యాన్ని ఆక్రమించి ప్రతినిధుల్ని ఏర్పాటుచేసి వెడలిపోయినట్లు చారిత్రకుల కథనం (చిలు. వీర శ్రీనాథకవి) గోదావరి మండలాన్ని

జయించిన కపిలేంద్రుడు ఆ జైత్రయాత్రలోనే కృష్ణా, గుంటూరు మండలాన్ని కూడా జయించడంచేత బొడ్డుపల్లె ఆయన వశమైంది. కపిలేంద్ర గజపతి ప్రతినిధి గణదేవుడో, మరొకడో శ్రీనాథుని అవసాన పద్యానికి సంబంధించినవాడని విమర్శకుల అభిప్రాయం. [కొర్లపాటి - శ్రీనాథుడు. పు. 281]

ఈ కపిలేంద్రుడు సూర్యవంశజుఁడు. ఈతడు ఉప్పుమీద, గవ్వలమీద పన్ను వేసిన పరమ విరంకుశుడు. శత్రుప్రదేశాల్ని జయించే ప్రయత్నంలో అధిక వ్యయానికి గురై ఆ భారాన్ని వ్యవసాయంపై మోపినాడు. ఫలితంగా శ్రీనాథుని వంటి కర్షకులెందరో కడగండ్లకు గురికావలసి వచ్చింది.

పన్నులెగగొట్టే ఆర్థిక నేరస్థులకు మనకీనాడు తెలియని కొన్ని విధాలైన దండనలు వాడుకలో ఉండేవి. నగరవీథుల్లో ఎండకెదురుగా ఊరేగించడం, నల్లని గుండు భుజంమీద మోయించడం.కాళ్ళకు సంకెళ్ళువేయడం, ముంజేశ పెడరుగోడియ నుంచడం మొదలైనవి ముఖ్యంగా అమలులో ఉండేవి. హొగడదండ అంటే అది హొగడపూల "దండకాదు," "హారక" దండకాదు, "మెడకు మీగాలికి గుదికట్టుట అనే శిక్ష" అని కొందరంటారు. [1973 డిసెంబర్ భారతి శ్రీ మోనా] పరమయోగి విలాసంలోనూ (ద్విపద. పు. 324) ప్రభావతీ ప్రద్యుమ్నంలోనూ (ఆ - ప 5-120) శుక సప్తతిలోనూ (ఆ 2 - కథ-6-19 పద్యం) రామాభ్యుదయంలోనూ ఈ హొగడదండ ప్రశంస ఉంది. కనుక ఈ హొగడదండ నెల్లూరు మండలంలోవేసే "కోలకుక్కరాయి" వంటిది, లేదా తెలుగునాడు అంతటా వ్యాపించి ఉన్న 'కోదండం' వంటిదని కొందరూహించారు. తెలంగాణాలో ఎండలో నిలబెట్టి బండలెత్తడం, పెద్ద మొద్దుకు గొలుసుకట్టి కాళ్ళకు తగిలించడం, చేతుల్ని మణికట్టువరకు రెండు రంధ్రాల్లో ఉంచి ఒక వెదురు చీలను వాటికి బిగించడం పంతొమ్మిదవ శతాబ్దాంతం వరకు పటేల్ పట్వారీలు నిర్వహిస్తుండినట్లు సురవరంవారు వివరించారు.

"భాషించినాడవు బహువేళ బుధులతో విద్యాపరీక్షణ వేళలందు పెదజల్లి నాడఁవు విశదకీర్తి స్ఫూర్తి కర్పూరములఁ దిశాంగనములు"ఇది శ్రీనాథునుద్దేశించి కొండపూడి అన్నయమంత్రి ప్రశంస. శ్రీనాథుఁడు విద్యాధికారిగా ఉన్న దినాల్లో ఆ నాటి కవుల్ని, పండితుల్ని, తార్కికుల్ని, జ్యోతిష్కుల్ని, వివిధ విద్యల్లో ఆరితేరిన పలువురిని సత్కరింపజేసినట్లు పొన్నుపల్లి, కనుకుర్రు,కల్వవాముల, పినపాడు,పొట్లపాడు, ఫిరంగిపురం, నందమూరు మొదలైన శాసనాలు నిదర్శనాలు. విద్యాధికారి ఐనా, వేమభూపాలుని దగ్గర ఆయనకు తగినంత పలుకుబడి ఉన్నా తానేమీ అగ్రహారాన్ని తన స్వంతానికి ఉపయోగించుకోకపోవడం గమనించదగ్గ విషయం. తన భవిష్యజీవితంపట్ల కొంత ఉదాసీన వైఖరి అవలంబించినట్లు దీన్నిబట్టి తెలుస్తున్నది. నిజానికి దానాలు గ్రహించవలసినంత అవసరం ఆయనకు కలుగలేదు. సార్వభౌమునికి ఉన్న సదుపాయాలన్నీ ఆయనకు సమకూర్చబడ్డని. రాజుల్లో మర్యాద, స్వర్ణపాత్రలో విస్సవ

మంత్రితో సహపంక్తి భోజనం, శిష్యవర్గం కోరినంత మాత్రానే ఆర్థిక సహాయం— అనుభవించాడు — అర్థించినవారికి దానాలిచ్చాడు. కనుకనే జీవిత సంధ్యా సమయంలో నిర్ధనుడై నిగళయుగం ధరించవలసి వచ్చింది. నిజానికి శ్రీనాథుడు త్యాగశీలి. కాకుంటే ఇంకొకడయితే కనకాభిషేకం జరిగినప్పుడు పోసిన దానాలతో జీవితాంతం సుఖించి ఉండేవాడు. ధన సంచయంపట్ల శ్రీనాథునికి విశ్వాసంలేదు. కనుక దాన్ని లెక్క పెట్ట లేదు. దానికితోడు ఆనాటి ఒక ఆచారం ఈతన్ని ఆర్థికంగా వంచించింది. కనకాభిషేక సత్కారానంతరం ఆ బంగారు నాణాల్ని సన్మానోత్సవానికి వచ్చిన అర్హులైన పండి తులకు పంచిపెట్టాలన్న నియమం "రాజలక్ష్మీ తంత్రం" చాటినట్లు తెలుస్తున్నది. (చిలు,వీర. శ్రీనాథ - పు. 184).

శ్రీనాథుఁడు తామరాకు మీది నీటి బొట్టు లాంటివాడు. వీరభద్రారెడ్డి కాలంలో అగ్రహారాల్లోని బ్రాహ్మణోత్తములు ధరించిన మాణిక్యాంగుళీయకాలు, తారహారాలు, ముత్యాల సరులు శ్రీనాథునివే కావచ్చు. ఇంత ఆడంబర జీవితాన్ని గడిపినా అంతః కరణం మాత్రం దానాలు, కీర్తి, త్యాగాలవైపు పరుగులు తీసినట్లు గ్రంథస్థ ఉదాహర ణాలు చాటుతున్నాయి.

అగస్త్యుడు కాశిని విడిచే సందర్భంలో

వాడు చేసిన ధర్మంబు వానిఁ గాచుఁ

గీర్తి యొక్కటి చాలదే కేవలంబు [కాశీ-2-107]

అనడాన్నిబట్టి కీర్తికాంక్ష ఈతనికెంతో మనకు తెలుస్తుంది. అంతేకాదు మధుకైటభుల్లాగా మరణయోగం ప్రాప్తించినా నిలుపుకొన్నమాట, గరుత్మంతుని సేవాయోగం, బలిచక్రవర్తి త్యాగనిరతి, వృత్తాసురుని విశ్వాసం శ్రీనాథునికి ఆదర్శ ప్రాయాలు. (కాశీ - 2 - 107)

"తనువుల స్థిరములు ధనములు కల్ల

కీర్తి యొక్కటి భువిఁ ఖిలముగాకుండు."

కనుక మల భాండమైన దేహం కోసం సత్కీర్తి పోనాడడం వెర్రితనమని పల్నాటి చరిత్రలో చెప్పాడు. (పు. 111)

సంపదవేళనే సకల భోగములు

పొందగవలె ధర్మములు చేయువలయు

భోగాను భవము చేపుట్టి సంతృప్తి

వేసట జనియించి వెగటుగాఁదోచు

అటుమీాద వైరాగ్య మమరుచు నుండు (పల్నా-పు.41)

ఇవి బాలచంద్రుని అభిప్రాయాలేకావు, శ్రీనాథునివి కూడ.

కలిమి శాశ్వతం కాదనీ, మెరుపుల్లాగా, మేఘాల్లాగా, నీటి బుడగల్లాగా చెదరి పోతాయాన్న సత్యం శ్రీనాధునికి తెలుసు అతని జీవితమే దీనికి లక్ష్యం. కనుకనే, కలం విడిచి హలం పట్టాడు.

అధీష్టం అలౌకిక జీవనానికి అడ్డులు చాచినా, అవసరం అరక చేతికిచ్చింది. వయసుడిగింది. కేవలం ఏడువందల దీనారాలు లేక దీనస్థితిని పొందవలసి వచ్చింది. శిక్షాస్మృతికి పండిత పామరభేదం లేదుమరి !.

శ్రీనాధుడీ విధంగా కష్టపడుతుంటే ఆయన సాహిత్యాన్నభిమానించే సహృదయులు ఆర్ధిక సహాయం అందించకుండా ఏం చేస్తున్నారు అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఈ మహాకవి ఉన్నదొక మారుమూల గ్రామం. అలాంటి ప్రదేశాల్లో ఎంత మహాకవైనాగుర్తింపుపొందుటకష్టం. ఒకరో ఇద్దరో సాహిత్యాభిమానులున్నా అర్థికసహాయం అందించగలిగిన స్థితి ఉన్నవారు కాదేమో! ఆ రోజుల్లో ఏడువందల టంకాలంటే మామూలు మాట కాదు. కేవలం వ్యవసాయమే వృత్తిగా ఉన్న ఆ కష్టజీవులకు శ్రీనాధుడు కవిగాకాక కర్షకుడుగా మాత్రమే పరిచితుడు. శ్రీనాధుఁడు ఉద్దండ కవి అని చెప్పినా దండవేసేవారు లేరు. ఈ విధంగా రెడ్డి రాజ్యం యొక్క ఉచ్ఛనీచస్థితులు శ్రీనాధుని జీవితంలోకూడా వెలుగు నీడల్ని ప్రసరింపచేశాయి.

## ఆ ధా ర గ్రం థా లు


1. శ్రీనాధుని కావ్యకళ — శ్రీ కూచిబొట్ల హరి
2. చాటు పద్య మణి మంజరి — వేటూరి ప్రభాకరశాస్త్రి
3. ఆంధ్రుల సాంఘిక చరిత్ర — సురవరం ప్రతాపరెడ్డి
4. శ్రీనాధకవి — చిలుకూరి వీరభద్రరావు
5. శ్రీనాధుడు — డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి
6. ఈశ్వరార్చన కళాశీలుఁడు — డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు
7. రెడ్డి సంచిక
8. His Lory of Reddy Kingdoms.
9. క్రీడాభిరామము — పీఠిక
10. ఆంధ్రుల చరిత్ర — చిలుకూరి బలరామమూర్తిగారు
11. పలనాటి వీరచరిత్ర — పీఠిక
12 1973 డిసెంబర్ భారతి సంచిక — శ్రీమోనాగారి వ్యాసం.
13. 1973 మార్చి భారతి — చామర్తి అమరేశ్వరశర్మగారి వ్యాసం.
14. శ్రీనాథ కవితా సమీక్ష—చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు (తృతీయసంపుటి)
15. 1971 జూన్-భారతి- శ్రీ కె. బాలసుబ్రహ్మణ్యంగారు.
16. కాశీఖండం.


(ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించిన సారస్వత వేదికపై)

# 3

# "పోతనలోని తెలుగుదనం"

మహాకవుల రచనలెప్పుడూ కూడా ప్రజా జీవనానికి అద్దం పడుతూ దేశకాల పాత్రాదులకు అతీతాలై వెలుగొందుతూ ఉంటాయి. పోతన భాగవత రచన కూడా ఆతని మహోన్నతమైన వ్యక్తిత్వాన్నేకాక తెలుగుజాతి జీవన విధానాన్ని అడుగడుగునా అంచజేసింది. కనుకనే పోతన ప్రజాకవిగా పలువురు విమర్శకుల చేత ప్రశంస లందుకున్నాడు.

భాగవత పీఠిక పోతన మహోన్నతమైన వ్యక్తిత్వానికొక మచ్చుతునక. పీఠికలో వ్యాస భాగవతం యొక్క ప్రాశస్త్యాన్ని గూర్చి ఇలా వివరించాడు.

"లలిత స్కందము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మంజులతా శోభితమున్, సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్, సుందరోజ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజ శ్రేయమై" అంటూ శ్లేషపూర్వకంగా కల్పవృక్షంతో పోల్చి చెప్పాడు. అలాంటి భాగవతాన్ని తెనిగించి పునర్జన్మ లేకుండా జాగ్రత్త పడతానన్నాడు. నన్నయ తిక్కనాది మహా కవులు ఈ భాగవతాన్ని తెనిగించకుండా, ఆ అవకాశం తనకు కల్పించినందుకు మహా సంతోషపడిపోయాడు. నిజానికి పోతన పేదవాడు. లోకరీతినిబట్టి ఒక పేద కవి అనుకోకుండా ఒక పెద్ద పెన్నిధి దొరికితే సంతోషించాలి. లేదా తన కవిత్వాన్ని రాజు మెచ్చుకొని ధన కనక వాహనాదులిస్తే సంబరపడిపోవాలి. కాని మూడు నాలుగు తరాల ముందు వాళ్ళయిన నన్నయ తిక్కనాదులు భాగవతాన్ని తెనిగించకుండా తన వంతుకు వదలి వెళ్ళినందుకు సంతోషించాడు. ఎంతగా సంతోషించాడంటే తన తాత ముత్తాతలెవరో మూలధనాన్ని ఏ మాత్రం ఖర్చుచేయకుండా తనకు ముట్టచెప్పినంతగా మురిసిపోయాడు. భాగవత అనువాదాన్నే ఒక నిధిగా భావించి ఆశేష ఆంధ్ర ప్రజానీకానికి దాన్ని అందించాలనుకున్నాడు. పోతన యొక్క ఆధ్యాత్మిక వ్యక్తిత్వం, ఆదర్శం అంచనా వేయడానికి ఇదొక మచ్చుతునక మాత్రమే. ఆదర్శానికి అర్థ సంపాదనకు ఎప్పుడూ చుక్కెదురే! ఆదర్శాల్ని నమ్ముకొని జీవిస్తున్న వ్యక్తికి అర్థ సంపాదన తృణప్రాయంగా తోస్తుంది. అర్థ సంపాదనమే సర్వస్వం అనుకునేవాడు ఆదర్శాల జోలికి పోడు. శ్రీనాథుడు లాంటి కవులు ఆనాడు పోతనను పిచ్చివాడన్నారు.

అర్థం సంపాదించలేని అసమర్థుడన్నారు. అయినా పోతన తన అనర్వాన్ని విడువ లేదు. మహాత్ముల లక్షణమిది. ఆదర్శాల్ని నమ్ముకుని పోతన తానువదించిన భాగవతాన్ని రాజుల పరం చేయకుండా రామునిపరం చేయాలన్న ఒక స్వతంత్ర నిర్ణయం ఆయన వ్యక్తిత్వాన్ని ఉన్నత శిఖరాలపై కూర్చోబెట్టింది.

పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట; నే
పలికిన భవహర మగునట
పలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా

అన్నాడు. రాజుల కంకిత మీయకుండా తప్పించుకోవడానికి ఒకనెపాన్ని తనకు తానే కల్పించుకున్నాడు! ఒక రాచరిక వ్యవస్థకు లక్షణాలు రెండు. తరతరాలుగా రాజ్యాన్ని సంక్రమింపజేసుకోవడం ఒకటి. ప్రజల్ని అన్నివిధాలుగా అస్వతంత్రుల్నిచేసి వారి ఆలోచనా సరళిని తమ వ్యవస్థకు అనుగుణంగా మార్చి వాళ్ళను మానసిక బానిసత్వానికి గురిచేయడం రెండవది. రాజులు తమకు కీర్తిని ఆచంద్ర తారార్కం లోకంలో నిలుపుకోవడానికి, తమ వ్యవస్థను పటిష్టం చేసుకోవడానికి, సమాజంలోవున్న ఒక విజ్ఞానవంతమైన వర్గాన్ని అంటే కవుల్ని చేరదీసారు. వారికి జీత బత్తేలు, మడి మాన్యాలు, అగ్రహారాలు ఇచ్చి ఆదరించారు. ప్రతిఫలంగా వారు చేయవలసిన పని, రాజు కీర్తిని గోరంతలు కొండంతలుగా పొగడడం.

ఆ వ్యవస్థలో కవి కేవలం నిమిత్తమాత్రుఁడు. వ్యక్తిత్వంలేని మేధావి. రాజు ఏది వ్రాయమంటే అది వ్రాయడం, ఎవరి కంకిత మీయమని ఆదేశిస్తే అదే శిరసా వహించడం వారి పని. ఈ విధంగా రాజులు కవుల్ని గుప్పిట్లో పెట్టుకొని తామనుభవిస్తున్న భోగవిలాసాలకు శృంగారానుభూతులకు ఒక శాశ్వతత్వం కల్పించే ఉద్దేశంతో వారిని సాధనంగా ఉపయోగించుకున్నారు. కవులు రాజుల అభీష్టాన్ననుసరించి వారి వంశాల్ని ఏ సూర్యుడికో, చంద్రుడికో అంటగట్టడం,వారిని సాక్షాత్ విష్ణ్వంశ సంభూతులుగా వర్ణించడం, వారినే కావ్యాల్లో నాయకులుగా, వారి ప్రియురాండ్రనే నాయికలుగా చిత్రించడం చాలా చోట్ల జరిగింది. ఫలితంగా సాహిత్యం కేవలం ఒక వర్గానికే ప్రాధాన్యం వహిస్తూ ఫ్యూడల్ సాహిత్యాన్ని, ఫ్యూడల్ సంస్కృతిని సాంప్రదాయాలను వ్యాపింప జేయడం ప్రారంభించింది. భక్తికంటె రక్తికే ప్రాధాన్యం పెరిగింది. ఇలాంటి వాతావరణంలో కాలానికి ఎదురీది నిలిచిన కవి పోతన. సంప్రదాయ సిద్ధమైన ఒక వ్యవస్థనే త్రోసిరాజన్న ఘనత ఈయనకు దక్కింది. పోతనకు పూర్వం లేదా తరువాతి కవులందఱూ దాదాపు రాజాశ్రయం పొందినవారే. నన్నయ, తిక్కన, ఎర్రన, భాస్కరుఁడు, చిన్నకోట పెద్దన, శ్రీనాథుఁడు, అష్టదిగ్గజాలు— వీరంతా ప్రభువుల్ని ఆశ్రయించి వారి ద్వారా భోగ భాగ్యాల్ని పొందారు. పోతన

ఇలాంటివేవి ఆశించలేదు, పైగా పుడమి పతుల పడుపు కూడు భుజించడంకంటె హాలి కుఁడుగా హాయిగా బ్రతకడం మేలన్నాడాయన. నాటి రాచటికానికి గొడ్డలి పెట్టు లాంటిది, సంప్రదాయ సిద్ధంగా వస్తున్న ఒక ఆచారాన్ని, అలవాటును కాదనడం ఒక సామాన్యమైన విషయం కాదు. ఒక సంప్రదాయాన్ని ధైర్యంగా ఎదిరించడం, దాని వల్ల కలిగే ఇబ్బందుల్ని ఇమ్మడి స్థైర్యంతో ఎదుర్కోవడం, ఒక చైతన్యవంతుడి లక్షణం. ప్రభువుల్ని మాత్రం ఆశ్రయించి తమ పొట్ట మాత్రమే నింపుకునే స్వార్థ పరులైన కవులకంటె, కోటానుకోట్ల ప్రజలకు అన్నాన్ని అందించే హాలికుడుగా బ్రతకడం మేలని పోతన అభిప్రాయం. ఇలాంటి తన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని అవ కాశం లభించినప్పుడల్లా భాగవతంలో అనేకచోట్ల వ్యక్తం చేశాడు.

"మందార మకరంద మాధుర్యమున నేలు;
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ చనునే తరంగిణులకు ?
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరకంబరుగునే
సాంద్ర నీహారములకు."

అంటూ ప్రహ్లాదుని నోట భక్తిపరంగా పలికినా రాజాస్థానాలపట్ల తనకున్న విహ్య భావాన్ని, తనకుగల స్వతంత్ర వ్యక్తిత్వాన్ని ఇందులో పొందుపరిచాడు. ఆకాశ మార్గంలో ఏ నిర్బంధం లేకుండా ఎగిరే తుమ్మెదల్ని, హంసల్ని, కోయిలల్ని చకో రాల్ని ఉదాహరించి కావ్య ప్రపంచంలో తాను కోరుకుంటున్న స్వేచ్ఛకొక రూపకల్పన కావించాడు. ఇంతేకాకుండా ఒక తాత్వికార్థం కూడా ఇందులో మనకు గోచరిస్తుంది. ఆధ్యాత్మిక జీవితానికి అలవాటుపడ్డ జీవుల్ని ఈ సంసారిక బంధాలు, అనుబంధాలు ఎంతగా కట్టిపడవేసినా ఆ జీవాత్మమట్టుకు పరమాత్మవైపే పరుగులు తీస్తుంది. తామరాకు మీది నీటి బొట్టులాగా ఏ అనుబంధాలూ జీవున్ని అంటవు.

ఈ విధంగా పోతన తన దైవ వ్యక్తిత్వాన్ని పలుచోట్ల ప్రదర్శిస్తూనే తన జాతి యొక్క వ్యక్తిత్వానికి కూడా పలుచోట్ల ప్రాధాన్యాన్ని కల్పించాడు. వ్యాస భాగ వతాన్ని తెలుఁగు చేసే సందర్భంలో తెలుగు వాతావరణాన్ని అవకాశం దొరికినపుడు వ్యక్తం చేయక వదలలేదు.

ఒక భాషలోని రచనను యథా మూలంగా అనుసరించడం వేరు. స్వతంత్రంగా ఒక భావనను భావించి తన సామాజిక పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని జాతి యొక్క

జీవనాడిని గుర్తించి, తదనుగుణంగా కావ్యాన్ని తీర్చిదిద్దే ప్రజ్ఞ వేరు. మహాకవులైన వారు మాత్రమే ఈ పని చేయగలరు. అలాంటి కవుల్ని వేళ్ళపైన లెక్కపెట్టవచ్చు. పోతన అలాంటివాడు. భాగవతానికి తెలుగుముద్ర వేయడంలో అసాధారణమైన ప్రజ్ఞ ప్రదర్శించాడు.

ఈతఁడు తన అనువాద వైఖరిలో సంస్కృత భాగవతమనే ముడి బంగారాన్ని కావ్యత్వమనే రసాయన ప్రక్రియద్వారా మేలిమి బంగారపు ముద్దగా మలిచి, కరిగించి, తెలుఁగు దనపు టచ్చులోపోసి, నగిషీలు చెక్కి వజ్రవైఢూర్యాలు పొదిగి ఒక అమూల్యాభరణంగా సిద్ధంచేసి తెలుగు సరస్వతికి తొడిగి పునీతుడైనాడు. ప్రధానంగా దశమ స్కంధాన్ని తెలుఁగు జాతి సంస్కృతి ప్రకటనానికి సాధనంగా ఎన్నుకున్నాడు. భాగవతాన్ని ఆంధ్రీకరించడం ఒక సామాన్యమైన కవి చేయగలిగిన పని కాదు. పోతనలాంటి మహాకవి ఈ పనికి పూనుకోవడం తెలుగువారి అదృష్టమనే చెప్పాలి. పోతన వ్యక్తిత్వమే ఒక విద్యుత్తరంగ రూపంలో భాగవతంలో ప్రవేశించి తెలుగు వెలుగుల్ని విరజిమ్మింది. సంస్కృత భాగవత భాండంలో పోతన్న నింపిన తెలుగు తేనెను తనివితీరా త్రాగి తెలుఁగు జాతి తరతరాలుగా త్రిరిస్తున్నది.

ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో భాగవతం ఆంధ్రుల బంగారు పంట. మూలంలో లేని ఆంధ్రుల అపార వ్యవహారాలను, వాలక్రీడాదికాలను, ఆంధ్రుల రుచులను, అభిరుచులను, ఆంధ్ర భాగవతంలో చొప్పించి తన జాతిపైగల ఆదరాన్ని పలుచోట్ల చాటుకొన్నాడు. ఆంధ్రులపట్ల పోతనకు అభిమానం కలదనడానికి ఒకే ఒక్క ఉదాహరణ చాలు. మూలంలో శుకుఁడు పరీక్షిత్తుకు భక్తి మార్గాన్ని తెలిపే సందర్భంలో వ్యాసుడు కిరాత హూణ పుళిందాదులతోపాటు ఆంధ్రుల్ని కూడా పాపాత్ముల పట్టికలో చేర్చాడు. పోతన్న దీన్ని గమనించాడు, సహించలేక పోయాడు. అనువాదంలో "యవన వ్యాధ పుళింద హూణ కష కంకాభీర చండాల సంఘపులుఁ దక్కిన పాపవర్తనులు" అని మార్చి ఈ పట్టిక నుండి ఆంధ్రుల్ని తొలగించి తన జాతికి శాశ్వతంగా కలుగబోయే కళంకాన్ని కడిగివేశాడు.

ఒక గ్రంథంలో ఒక జాతి స్వభావం ఎంతగా ముద్రితమైతే అంత ఆత్మీయతను అది కలిగిస్తుంది. భాగవతం తెలుగు జీవితాన్ని అంతగా అచ్చొత్తించి ఆంధ్రులందరికీ ఆదరపాత్రమైంది. పోతన అవకాశంకలిగితే చాలు అనాటి పల్లెపట్టుల్ని వారి జీవన విధానాన్ని, వారి మనస్తత్వాల్ని వర్ణించకుండా విడువలేదు. కృష్ణ జననానికి వ్రేపల్లె ప్రజలేకాదు, పశు పక్ష్యాదులు కూడా పరవశించి పోయాయట. ఆ సందర్భంగా వ్రేపల్లెలోని ఒక సుందర దృశ్యాన్ని మనకండ్ల సాక్షాత్కరింపజేశాడు పోతన.

క్రేళ్లురికి మసలే లేగలు
మల్లడి గొని రంకె లిడియె మద వృషభంబుల్
ఝల్లుగ మొదవుల పొదుగుల
జల్లించెం బాలు, బాలు సంభవ వేళన్.

కట్టుకొయ్య నుంచి విడిపించుకున్న లేగలు గంతులేస్తూ తల్లి వద్దకు పరుగెత్తడం, బలవంతంగా కట్టివేయబడిన ఎడ్లు రంకెలేస్తూ తలలు అటూ ఇటూ విదిలిస్తూ గింజుకోవడం, ఈనిన ఆవులు పాలను సమృద్ధిగా కురియడం - ఈ దృశ్యాలు పల్లెజీవితంతో పరిచయమున్న ప్రతీ పాఠకుడికి, శ్రోతకు కండ్లకు కట్టినట్లుగా కనబడతాయి. అంతేకాదు హృదయం మీద శాశ్వతమైన ముద్రవేస్తాయి.

పల్లెల్లోని సాంఘిక జీవితం చాలా పరిమితమైనది. ఆత్మీయమైంది కూడ. ఒక పురుడొచ్చినా, పుణ్యకార్యం జరిగినా నిమిషాల మీద గాలిలాగా ఊరంతా వ్యాపిస్తుంది. ఎవరినోట విన్నా అదే విశేషం. ముఖ్యంగా స్త్రీలకిదొక చక్కని కాలక్షేపం. వాడ వాడల స్త్రీలు గుంపుగుంపులుగా ముచ్చట్ల మురిపాలతో పుట్టిన బిడ్డను చూచి రావడం సరదా. అలాంటి ఒక మధుర ఘట్టం కృష్ణుడు పుట్టిన సందర్భంలో మనకు కనిపిస్తుంది. యశోద చక్కని బాలున్ని కన్నది. ఊరంతా ఆ వార్త నిమిషంలో వ్యాపించింది.

ఏమి నోము ఫలమొ ! ఇంత ప్రొద్దొక వార్త
వింటి మబలలార ! వీనుల మర
మన యశోద చిన్ని మగవాని గనెనట
చూచి వత్తమమ్మ సుదతులార !

పుట్టింది ఆడపిల్లకాక మగపిల్లవాడయితే మరీ మురిపెం. కనుకనే "చిన్నిమగవా"డని మురిసిపోయారు. పాపనికి నూనెతో తలంటి, ఒంటినిండా పసుపు నలుగుపెట్టి స్నానం చేయించి కొన్ని నీళ్ళను బాలుని చుట్టుచుట్టి వీపుమీద చరుస్తూ "హరి రక్ష" అంటూ దీవించడం పెద్దతరంవాళ్ళు చేస్తూ ఉండడం ఇప్పటికీ వున్నది.

"పాపనికి నూనెం దలయంటి పసుపుంబూసి
బోరుకాడించి హరిరక్ష పొమ్మటంచు
జలములొక కొన్ని చుట్టెం రాం జల్లితొట్లనునిచి."

ముత్తయిదువలు దీవించి పాడడం తెలుగువారి ఆచారమే. బాలున్ని తొట్టెలో వేసి నిద్ర పుచ్చడానికి ప్రయత్నిస్తున్నారు.

జోజో కమల దళేక్షణ
జోజో మృగరాజ మధ్య జోజో కృష్ణ
జోజో పలవ కరపద
జోజో పూర్ణేందు వదన జోజో కృష్ణ.

ఈనాటికీ ఎందరో తెలుఁగు తల్లులు ఇది పోతన్న పద్యమని తెలిసో తెలియకో మనసారా పాడుకుంటూ ఉంటారు. "జో అచ్యుతానంద జో జో ముకుంద" అన్న అన్నమాచార్యుల రచనకు తెలుగు దేశంలో ఎంత ప్రచారం ఉందో ఈ జోలపాట కూడా అంతకంటే ఎక్కువగా ప్రచారం పొందింది. పసిపాపలున్న ప్రతీ ఇంట్లో ఇది ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది.

కృష్ణుడు గోపబాలకులతో కలిసి చద్దన్నం ఆరగించే ఘట్టం అత్యంత సహజంగా వర్ణించాడు పోతన. చద్ది పెరుగన్నం ఆవకాయ ఈ రెంటి యొక్క సమ్మేళనం తెలుగు వారికి షడ్రుచుల అనుభూతిని అందిస్తుందని పోతన్నకు తెలుసు. అందునా దినమంతా కష్టపడి పసుల్ని కాసి, ఎండలో మగ్గి ఆకలితో నకనకలాడుతున్న గోపబాలకులకు అదే పంచ భక్ష్యపరమాన్నం మరి !

మాటి మాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దోడిసి చయ్యన మ్రింగి
చూడు లేదని నోరు సూపు నొక్కఁ
జేగురాద్దర చల్దు లేలమిఁ బన్నిన మాడి
కూరొక్కని కూరొక్కని కొందుచునొక్కఁ
డున్నియుఁ దగఁబంచి యుడుపట నెచ్చెలి తన
మనచు బంతైన గుండు లాడు నొకఁడు

కృష్ణు జూడుమనుచుఁగి కురించి పరు వ్రేలాల
మేలి భక్ష్యరాశి మెసగు నొకడు
నవ్వు నొకడు సఖుల నవ్వించు నొక్కడు
ముచ్చటాడు నొకడు మురియు నొకడు

లోకంలో ఉన్న ఆనందమంతా ఈ గోపబాలకుల సొమ్మే సుమా అన్నట్లున్నదీ పద్యం. ఒకవైపు దూరంగా పచ్చిక బయళ్ళలో గుంపులుగా గోవులు మేస్తుంటే,

సమీపంలో లేగలు నీళ్లుత్రాగుతుంటే నిశ్చింతగా గోపబాలకులంతా ఒకచోట కూర్చొని తాము తెచ్చిన చద్దిమూటలు విప్పి తినడం ప్రారంభించారు. ఒకడు ఊరగాయ తీసి చప్పరిస్తూ వ్రేలు మడిచి ఇంకొకన్ని ఊరిస్తున్నాడు. మరొక్కడు ప్రక్కనున్న కంచంలోని ఊరగాయ లాక్కొని గబుక్కున మ్రింగి,లేదు చూడుమని నోరు చూపిస్తు న్నాడు. ఇంకొకడు పందెం కాసి ఐదారుగురు తినవలసిన ఆవకాయ బువ్వను పట్టించి పట్టించిఒక్కడే తిని కడుపుబ్బ నవ్విస్తున్నాడు. ఈవిధంగా అందరు కలిసి నవ్వుతూ నవ్విస్తూ, పరుగెత్తూ, కిసరిస్తూ, ముచ్చట్లాడుతూ భోజనం చేయడం చూస్తే వన భోజనాల వైనం కన్నులకు కట్టక మానదు.

అక్రూరుడు గోవింద సందర్శనానికై వెళ్ళుతూ బృందావనంలో ప్రవేశించిన సందర్భంలో ఆతనాఘ్రాణించిన పూలవాసనలన్నీ తెలుగు పూఁదోటల లోనివే. "ఘనచందన, కుంద, కుటజ, తాల, సాల, కురవక, వట, మాకందాది పుష్పఫలాదు లలో కొన్ని తెలుగువారు తమ పెరళ్ళలో పెంచుకున్నవే. మూలంలో అక్రూరుడు కృష్ణున్ని తలుస్తూ సూర్యాస్తమయవేళ గోకులంలో ప్రవేశించినట్లు మాత్రం చెప్ప బడి ఉంది. పోతన గారు ఈ సందర్భాన్ని అవకాశంగా తీసుకొని గోకుల పరిసరాల్ని బృందావన పరిసరాల్ని తెలుగు వాతావరణానికి అనుగుణంగా కనులకు కట్టినట్లు వర్ణిం చడం నిజంగా ఒక గొప్ప విశేషమే.

తెలుఁగు కుటుంబ వాతావరణాన్ని ప్రతి బింబింప జేయడంలో కూడా అత్యంత మైన శ్రద్ధ వహించాడు పోతన. దీనికి కూడా దశమ స్కంధాన్నే భూమికగా గ్రహిం చాడు.

వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జెన గూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకు బెట్టించుఁ జెలువు మెఱసి
రమణీయ మందిరా రామదేశంబులఁ
బువ్వుఁదీగెలకును బ్రోదివెట్టు
సదమల మణిమయ సౌధ భాగంబుల
లీలతో భర్మకందుకలీల నూఁగు

బాలికలతోడఁ జెలరేగి బంతులాడు
శారికాకీర పంక్తికిఁ జదువు చెప్పు

బర్హి సంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు

రుక్మిణీదేవి బాల్యక్రీడలైన బొమ్మల పెండ్లిండ్లు, గుజ్జనగూండ్లు, ఉయ్యాలాటలు, బంతులాటలు, పెంపుడు పక్షుల మచ్చికలు ఈ పదాలన్నీ తెలుగు బాలికలకు తెలిసినవే. ధనికులు లేదా పై మధ్య తరగతి కుటుంబాల్లో వివాహోచిత వయస్కులైన ఆడపిల్లలు కాలక్షేపం కోసం ఆడే ఆటలు ఎన్నో ఉండేవి. కొన్నింటిని మాత్రం పోతన వర్ణించాడు.

మగపిల్లల ఆటలే వేరు.

“గోవల్లభుఁడ నేను గోవులు మీరని వడిఱంకెవైచుచు వంగియాడు
రాజనే భటులు మీరలు రండురండని ప్రాభవంబునఁ బెక్కుపనులు
పనుచు
నేదస్కరుఁడ మీరింటివారని నిద్రపుచ్చి సొమ్ములఁగొని పోయిడాగు
నే సూత్రధారి, మీరిందరు బహురూపులని చెలంగుచు నాటలాడబెట్టు
మూలలు బుకుకును, డాగురుమూఁత లాడు
నుయ్యెలల నూఁగుఁ జేబంతు లొనరవైచు.”

మగపిల్లలెప్పుడూ బాల్యంలో ఆకతాయిల్లాగే ఉంటారు. గ్రామాల్లో మగపిల్లలంతా సాయంకాలం పూట వీథుల్లో గుంపులుగాచేరి రకరకాల ఆటలతో ప్రొద్దుపుచ్చడం మనకు తెలుసు. రాజాట, దొంగాట, దాగుడు మూతలాట, బంతులాట - ఇవన్నీ ఈనాటికీ తెలుగుపల్లెల్లో కొంతవరకు ప్రచారంలో వున్నాయి.

ఈ విధంగా పోతన ఒకవైపు తెలుఁగు వాతావరణాన్ని సృష్టిస్తూనే మరొకవైపు తన గ్రంధాన్ని ప్రజలకు అత్యంత సమీపంగా తీసుకొని వెళ్ళాడు. తెలుఁగు భాగవతం ఆనాడు ఒకవైపు అసంఖ్యాకమైన ప్రజానీకానికి, మరొకవైపు వ్యాసభాగవతానికీ మధ్య ఒక వ్యాఖ్యాతగా పని చేసింది. ఈ భాగవతానికి ఒక సజీవ ప్రతినిధి పౌరాణికుఁడు లేదా హరి కధకుఁడు. పౌరాణికుఁడు ఆశుకవితా మార్గంలో ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షం, మొదలైన కధలన్ని గానం చేస్తూ ధర్మబోధకత్వాన్ని నిర్వహించేవాడు. ప్రజల ప్రత్యక్ష జీవితానికి సమన్వయాన్ని సాధించేవాడు. వారికి అనువైన భాషలో విప్పి చెప్పేవాడు. అక్షరజ్ఞానం లేని ఒక సామాన్య మానవునికి ఉద్బోధ కలిగించడానికి అవసరమైన అంశాలన్నీ ఈ భాగవతంలో ఉన్నాయి. దానిలో వున్న ఆశుకవితా మార్గమే దాన్ని ప్రజలకు సన్నిహితం చేసిందని విమర్శకులంటారు. కేవలం పండితుల్ని కవులను ఉద్దేశించే కాకుండా సామాన్యుల్నికూడా దృష్టిలో ఉంచు

కొని భాగవతాన్ని పోతన రచించాడు. కనుకనే వర్ణ వర్గ లింగ వయోభేదం లేకుండా అది అందరి ఆమోదాన్ని పొందగలుగుతున్నది.

ఈనాటికీ ఆంధ్ర దేశంలో శ్రీమద్రామాయణం లాగానే అనేకు ఉ ప్రతిదినం భాగవత పారాయణం చేయడం అక్కడక్కడా మనకు కనిపిస్తుంది. అత్యంతమైంది ఆధునిక కుటుంబాల్లో కాకపోయినా ఏమాత్రం సాహిత్యాభిరుచి ఉన్న సనాతన కుటుంబాల్లో, ముఖ్యంగా వయోవృద్ధుల్లో ఈ భాగవత పద్యపఠనం నిత్యజీవితంలో ఒక భాగంగా ఇమిడిపోయింది. ప్రతినిత్యం తెల్లవారుఝామున రాగయుక్తంగా ఆలాపించే వారు అక్కడక్కడా ఇంకా మిగిలి ఉన్నారు.

పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ తెలుగు పాఠ్య గ్రంథాల్లో ఈ భాగవతం లోని రసవత్తరమైన ఘట్టాలు చోటు చేసికొని పరిమితిలేని ప్రచారాన్ని పొందుతున్నాయి. విశ్వవిద్యాలయాల్లో పరిశోధనాంశంగా పండితులచేత ఆదరింపబడుతూ వుంది. "ఎవ్వని చేజనించు జగమెవ్వని లోపల నుండు లీనమై", "తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్"—ఇలాంటి చాలా పద్యాలు పాఠశాలల్లో ప్రార్థనా పద్యాల రూపంలో మనకు వినిపిస్తూనే ఉంటాయి.

ఓయమ్మ నీ కుమారుఁడు
మాయిండ్లను పాలు పెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ.

"ఏ అలంకారం లేకపోవడమే ఈ పద్యానికొక అలంకారం" అన్నాడొక ప్రసిద్ధ విమర్శకుడు. ముద్దుముద్దు మాటలు కట్టే ఈ పద్యం ప్రతీ చిన్నారి పెదవులపై చిందులాడుతూ అబాల గోపాలాన్ని అలరింపజేస్తున్నది. ఈ పద్యంలో ఒక విశేషం కనిపిస్తుంది. లోకంలో సాధారణంగా అమ్మమీద ఒట్టు తెనడం కనిపిస్తుంది. అయ్య మీద పెట్టడం కనిపిస్తుంది, లేదా తినమీద తాను ఒట్టువేసి కోవడం చూస్తాము. కాని అన్నమీద, జంతువుల మీద ఒట్టువేయడం ఒక విపరీత విషయంగానే మనకు తోపకమానదు. కాని పోతన ఏ పదాన్ని వ్యర్థంగా వాడడుకదా !

అన్న శబ్దం చాలా శక్తివంతమైంది. రామాయణంలో కూడా యుద్ధ కాండలో ఒకచోట అన్న శబ్దం యొక్క ప్రాముఖ్యం కనిపిస్తుంది. ఒకనాడు సహోదరుఁడు కాకపోయినా ద్రౌపది 'అన్నా' అని పిలువగానే ఆపద్బాంధవుఁడై వచ్చి మానసంరక్షణ కావించాడు కృష్ణుడు. ఈనాడు కూడా ఒకడు ఎంత దుర్మార్గుడయినా కావచ్చు, ఒక అబల "అన్నా" అని పిలిస్తే వాడిలో కొంతయినా కరుణ కలుగకమానదు. అన్నా అన్న శబ్దంలో అంత మహాత్మ్యం ఉంది ! సహోదరులు కానివారి మధ్యే ఇంకటి

అనుబంధం ఉంటే, ఒకే కడుపున జన్మించిన వారి విషయం ఇక చెప్పేదేముంది ? కనుకనే గోపికలు తమ పుట్టింటిపై అభిమానానికి సూచకంగా "అన్నల"పై ఒట్టు పెట్టుకొని ఉంటారు. ఇక రెండవ పదం సురభి. అంటే కామధేనువు. ఇక్కడ గోవు అని అర్థం చెప్పుకోవాలి. ప్రాచీన హిందూ సంస్కృతిలో గోవుకున్న స్థానం చాలా ఉన్నతమైనది. లౌకిక సంపదల కన్నింటికి గోవు ఒక ప్రతీక. గోవుపాలు, గోమయం, చర్మం, కొమ్ములు – అన్నీ కూడా మానవుని మనుగడకు అవసరమైనవే. గో ప్రదక్షిణం భూ ప్రదక్షిణంతో సమానంగా తలచి గోపూజ చేయడం ఈ నాటికీ ఆచారంగానే ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆధ్యాత్మిక భౌతిక సంపదలన్నింటికీ గోవు మూలకారణంగా భావింపబడింది. సర్వ సంపదలకు మూలమైన గోవుపై గోపికలు ఒట్టు పెట్టడం ఎంతో ఔచిత్యశోభితంగా ఉందని మనం భావించవచ్చు.

చదువుకున్నవారేకాదు ఏ మాత్రం సాహిత్య పరిజ్ఞానంలేని సామాన్యులుకూడా సందర్భశోభితంగానూ, సందర్భరహితంగానూ, ఈ భాగవత పద్యాల్ని నిత్య జీవితంలో వాడుకొంటూ ఉండడం ఒక గొప్ప విశేషం. ఎవరైనా వాళ్ళ అవసరానికి మనింటికివస్తే "ఊరకరారు మహాత్ములు" అంటాం. ధనవంతుల విశాలమైన మేడల్ని ఉద్దేశించి "అల వైకుంఠ పురంబులో" అంటూ మనకందుబాటులో లేని విషయాన్ని సూచిస్తాం. ఆడిన అబద్ధాల్ని సమర్థించుకునే సందర్భంలో "వారి జాక్షులందు వైవాహిక ములందు" అంటూ మాట దాటేస్తాం. అడ్డు లేకుండా పెరిగే ధరలు, వరకట్నాల విషయంలో "ఇంతింతై వటుడింతై" అంటూ పెరుగుదలకి ఒక ప్రమాణాన్ని చూపిస్తాం. అంతటా వ్యాపించి ఉన్న అవినీతిని ఎత్తి చూపేటప్పుడు "ఇందుగలదందు లేదని సందేహము వలదంటూ" అక్షరాల్నే మార్చేస్తాం. అనుకోని అద్భుత సంఘటనని చూచినా, విన్నా "కలయో వైష్ణవమాయయో" అంటూ విస్తుపోతాం. ఈ విధంగా అనేక పద్యాలు పరమ లౌకిక ప్రయోజనాన్ని ఉద్దేశించి వాడుకొంటూ ఉండడం ఒక విశేషం. "లా వొక్కింతయులేదు" అన్న పద్యాన్ని ఈనాటి అరాచక సమాజానికి అన్వయించి "Law ఒక్కింతయులేదు" అని చమత్కారంగా చెప్పుకుంటూ ఉండడం కనిపిస్తుంది. భాగవతం రచింపబడి దాదాపు 500 సంవత్సరాలు గడిచినా ఈ నాటికీ కొన్ని పద్యాలు జాతి నరనరాల్లో జీర్ణించుకొనిపోయి ప్రజల నాలుకలే ఆకులుగా జీవిస్తున్నాయంటే వాటి సజీవ లక్షణాల్ని మనం అంచనా వేయవచ్చు. భారత రామాయణాలలోని పద్యాలకంటే భాగవతపద్యాలలోని పదాల కూర్పు కంఠస్థం చేయడానికి ఎంతో అనువుగా ఉన్నాయని చెప్పడానికి జనబాహుళ్యంలో ప్రచారంలో ఉన్న పద్యాలే మనకు తార్కాణం.

భాగవత పద్యాలు ఎంతగా ప్రచారం పొందాయో, అంతకంటే అధికంగా భాగవత కథలు జనుల్లో ఇంకా జీవిస్తున్నాయి.

— ఒక విషయానికి మరొక విషయమేదైనా అవాంతరంగా అడ్డువస్తే "మధ్యలో ఇదో బాగోతం" అనడం ఆంధ్రులకు అలవాటు.

— అల్లరి ఆకతాయి పిల్లవాణ్ని చూచి ఒక తల్లి మురిసిపోతూ "కొంటె కృష్ణుడమ్మా" అంటుంది.

— అధిక సంతానంతో సత మత మయ్యే బహు కుటుంబీకున్ని ఉద్దేశించి లోకం "కుచేల సంతానం" అంటూ పరిహసిస్తుంది.

— వినాయక చతుర్థినాడు శ్యమంతకోపాఖ్యానాన్ని పఠించడం.

— స్త్రీలోలుడైనవాడిని "అపర కృష్ణుడుగా" అభివర్ణించడం.

— ఈనాటి జైలు ఖానాలను శ్రీకృష్ణ జన్మస్థానాలుగా పిలవడం.

— స్త్రీ విముఖుడిని జడభరతునితో పోల్చడం.

ఇలాంటి ఉదాహరణలెన్నయినా చెప్పొచ్చు. ఈ కథలు ఎంతగా ప్రజల్లో ప్రచారం పొందాయంటే భాగవతంలో లేని సన్నివేశాలుకూడా కల్పింపబడ్డాయి. న్యూన తని ఆపాదించే పనుల్ని చేయవలసి వచ్చినప్పుడు అంటే ఒక అల్పుడివద్దకు ఒక గౌరవనీయుడైన వ్యక్తి వెళ్ళి ఏదయినా యాచించే సందర్భంలో "ఆనాడు వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకోగాలేనిది" అంటూ భాగవతంలో కనిపించని కథను ప్రమా ణంగా చూపడం చూస్తే ఈ కథలు ఎంత ప్రచారం పొందాయో చెప్పొచ్చు. ఈ కథలు రామాయణ భారత కథలకంటే కూడా అధిక ప్రచారం పొందడానికి మనం రెండు కారణాల్ని చెప్పొచ్చు.

1. ఆ కథల్లోని ఆధ్యాత్మిక ఔన్నత్యం
2. పోతన్నగారి కథా కథన వైఖరి

గజేంద్ర మోక్షణం, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర, పురంజనోపాఖ్యానం, మార్కండేయోపాఖ్యానం, అంబరీషోపాఖ్యానం మొదలైన కొన్ని ఉపాఖ్యానాలు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని చాటుతూ ఆబాల వృద్ధ జన హృదయాలలో గూడు కట్టు కొని వారి సుఖదుఃఖాది అనుభూతుల్లో పాలుపంచుకొంటూ ఈనాటికీ జీవిస్తున్నాయి.

కథా కథనంలో కావ్యకళాదృష్టికంటె ప్రచార దృష్టే ఎక్కువని విమర్శకు లంటారు. భక్తి తత్త్వాన్ని లోకానికి వెళ్ళడించడానికై కథా కథనానికి అత్యంత ప్రాముఖ్యం కల్పించాడు పోతన.

పోతన తన కవిత్వాన్ని ప్రజానీకానికి ఎంత సన్నిహితంగా తీసుకుని వెళ్ళాడో, అంతకంటె సన్నిహితంగా తన భాషను తీసుకొని వెళ్ళాడు. ఒక్కమాటలో చెప్పా

అంటే ప్రజల ఊపిరినే పోతన తన భాషగా మలచుకొన్నాడు. పోతన సంభాషణల్ని గమనిస్తే మనకీ విషయం తెలుస్తుంది. ఆయా సందర్భాల్లో పోతన సంభాషణలు లోక వ్యవహారానికి అత్యంత సన్నిహితంగా ఉంటాయి. చక్కని జాత్యమైన నుడికారం ఆ సంభాషణలకు ప్రాణం. ద్రౌపది అశ్వత్థామతో పలికిన పలుకులు దానికొక మచ్చు తునకగా పండితులు చూపుతూ ఉంటారు.

"భద్రాకారులఁ చిన్న పాపల రణ ప్రౌఢక్రియా హీనులన్ నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతులెట్లాడెనో" అన్నది ఉదాహరణం. ఏదయినా చేయరాని కార్యాన్ని ఎవరైనా చేసినప్పుడు "అది చేయడానికి నీకు చేతులెట్లా ఆడినయ్" అని అనడం తెలుగు వారికి పరిపాటి. ఈ నుడికారంవల్ల పై సంభాషణకు ఒక అపూర్వమైన సౌందర్యం కలిగిందనడం స్పష్టం. ఇలాంటివే ఎన్నో పద బంధాలు, జాతీయాలు మధురంగా ధ్వనిస్తూ మనల్ని పట్టి పట్టి చదివిస్తాయి.

పోతన చక్కని తెలుఁగు పద జాలాన్ని వాడడంలో కూడా సిద్ధహస్తుడు. తెలుఁగు అంటే అచ్చ తెలుగు కాదు. కఠినమైన సంస్కృత పదజాలాన్ని అర్థం చేసికోవడం ఎంత కష్టమో, అచ్చతెలుగు భాషను అర్థం చేసుకోవడం అంతకంటే కష్టం. నిఘంటువుల సహాయం లేనిదే అచ్చతెలుగు కావ్యాలు అర్థం చేసుకోవడం కష్టం. ఇవి పాండిత్య ప్రకర్షకేతప్ప హృదయాన్ని ఆకర్షించలేవు. పోతన తెలుగు అలాంటిది కాదు. తెలుగు పదజాలాన్ని వాడినా అవి వ్యవహారం లోని మాటలేకాని మారుమూల పదాలు కావు. "తొలుకారు మెఱుఁగు కై వడి" (8–623) అన్న కంద పద్యాన్ని "పాల మున్నీటి లోపలి" (8-266) అన్న సీసాన్ని తెలుగు పదాల రచనకు మచ్చుగా తీసుకోవచ్చు. ఇలాంటి చక్కని చవులూరించే తేనెలాంటి తెలుగు పద్యాలు పండితుల రసనాగ్రాలపై నాట్యంచేస్తూ రసజ్ఞుల నోరూరేట్లు చేస్తాయి. యతులలోని అక్షర సామ్యం, ప్రాసలలోని అక్షర పునరావృత్తి అనుప్రాస విన్యాసం ఏ పాదాని కాపదం విడిపోవడం—అప్రయత్నంగా పద్యాలు నోటిలో దొరలి పోవడానికి ప్రధాన కారణాలుగా విమర్శకులు చూపుతారు.

కొందరు విమర్శకుల అభిప్రాయంలో పోతన కేవలం శాబ్దికుఁడు, శబ్దశిల్పి. అంత్య ప్రాసప్రియుఁడు. అలంకార దృష్టితో చూచినా, పాత్రపోషణ కోణంలోనించి చూచినా తిక్కనాదులతో పోతన్న ఎన్నడూ పోలడు. ఉదాహరణకు ద్రౌపది పాత్రను పరిశీలిస్తే తన కుమారుల్ని చంపిన అశ్వత్థామను "తండ్రీ" అని సంబోధించడం, "భూసురుఁడవు బుద్ధిదయా భాసురుఁడవు, శుద్ధ వీరభట సందోహాగ్రేసరుఁడవు" అంటూ మద్దెల దరువులతో పరామర్శించడం ఒక గొప్ప లోపంగా విమర్శకులు భావిస్తారు. కాని ఒక్క విషయం మాత్రం నిజం. తిక్కనలోని కావ్యశిల్పం పాత్రౌచిత్యం పోతనలో లేకపోవచ్చు. నన్నయలోని శైలీ విన్యాసం కనిపించకపోవచ్చు. కేవలం

పండిత వర్గాన్నే సంతోషపెట్టే మరికొన్ని అంశాలు లేకపోవచ్చు. కాని అసంఖ్యాకు లైన ఆంధ్ర ప్రజానీకాన్ని ఆకర్షించి పట్టి పట్టి చదివించగల ఎన్నో అంశాలు అందులో ఉన్నాయి. ఒక గ్రంథం ఉత్తమమైనదా కాదా అని పరీక్షించడానికి ఒరపిడి రాయి ప్రజామోదం. అది భాగవతానికి పుష్కలంగా లభించింది. కనుకనే పోతనను ప్రజాకవిగా పేర్కొనవచ్చు.

(పోతన పంచశతి జయంత్యుత్సవ సందర్భంగా శ్రీశైలంలో)

## ఆ ధా ర గ్ర ం థా లు :


1) శ్రీమదాంధ్ర భాగవతము.

2) పోతన అనువాద విధానము - (ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు)
— కురుగంటి సీతారామయ్యగారు.

3) పోతన కవిత్వము (ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు)
— పుట్టపర్తి నారాయణాచార్యులుగారు.

4) శ్రీమద్భాగవతానుశీలనము — డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు.

5) మందారమకరందాలు — డా॥ సి. నారాయణరెడ్డిగారు.

6) పోతన - భాగవత రచన — శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు.

# 4

# మొల్ల రామాయణం- సాంఘిక సాహిత్య నేపథ్యం

కళకు స్త్రీ, పురుష భేదంలేదు. ఏ కాలంలోనయినా, ఏ దేశంలో నయినా స్త్రీకీ, కళకు విడదీయరాని విశిష్టమైన అనుబంధముంది — కవితా కళలో పురుషులతో పాటు స్త్రీలు కూడా తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల మొదలుగా నేటి తరందాకా ఆంధ్ర సరస్వతిని తమ కావ్య పుష్పాలతో అలంకరిస్తూనే ఉన్నారు. దేశంలో తక్కిన సాహిత్యాల్లో కంటే సంఖ్యలో ఆంధ్ర కవయిత్రులదే పై చేయి అన్న ప్రథ లోకంలో ఉంది. పద ప్రయోగంలోనూ భావస్పష్టతలోనూ, విషయ వివరణలోనూ, సరళత స్త్రీల రచనల్లో కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఇదే వారి ప్రత్యేకత. కావ్య రచనలో ప్రఖ్యాతి వహించిన పడతులున్నారు. తమ చాటువులతో ఆంధ్రజాతిని జాగృతము చేసిన చానమ్మలున్నారు. కీర్తి ప్రతిష్ఠల జోలికి పోకుండా రచనల్ని తమకే పరిమితం చేసుకున్న అజ్ఞాత కవయిత్రులున్నారు. వీరందరూ కూడా సౌకర్యంతో, సరస గుణంతో సహృదయుల్ని మెప్పించారు. ఇంతే కాకుండా సంస్కృత మహా కావ్యాల్ని సంతరించిన ఖ్యాతికూడా ఆంధ్ర స్త్రీలకే దక్కుతుంది. గంగాదేవి, తిరుమలాంబ, మధురవాణి, త్రివేణి మొదలైన వారెందరో సంస్కృత సరస్వతిని తమ తమ రచనా పుష్పాలతో అలంకరించి ఆంధ్ర స్త్రీ లోకానికే గర్వకారణమైన విషయం సాహితీవేత్త లకు స్పష్టమే.

వీరందరిలో మొల్ల కొక ప్రత్యేక స్థానమున్నది. రామాయణ కర్తలు లెక్కకు మిక్కిలిగా ఉన్నా రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, వాసిష్ఠ రామాయణం- ఆధ్యాత్మ రామాయణం, గోపీనాథ రామాయణం మొదలుగాగల ముఖ్య రామాయణాలు మాత్రం కాలప్రవాహానికి ఎదురీది నేటికీ స్థిరంగా నిలిచి ఉన్నాయి. వీటిలో మొల్ల రామాయణం శిల్పసంపదకు, సరళమైన శైలికి, భావస్పష్టతకు బాటల్ని నిర్మించిందంటే అందుకు సందేహంలేదు.

మొల్ల వ్యక్తిత్వం యొక్క విశిష్టత మూడు రూపాలలో వ్యక్త మౌతుంది.

1. తరతరాలుగా కేవలం అగ్రవర్ణ పండితులకు, కవులకు మాత్రమే సొత్తుగా ఉన్న సాహిత్య సంపదను ఒక శూద్ర స్త్రీగా తాను కూడా కైవసం చేసుకోవడం.

2 నాటి రాచరికానికి లొంగిపోయి, తాము వ్రాసిన కావ్యాలను తమ అభీష్టంతో ప్రమేయం లేకుండా ప్రభువులకే అంకితంచేసే తరతరాల సాహిత్య సంప్రదాయాన్ని ఒక స్త్రీగా ఛేదించడం —

3. సంస్కృత శబ్దాడంబరంతో, గూఢ శబ్దాల్ని గుప్పించి అయఃపిండాలను సృష్టించే ఆ నాటి కవులకు హెచ్చరికగా తెలుగు కవిత్వం ఏ స్వరూపంలో ఉండాలో, ఎవరూ చెప్పనంత నిర్భయంగా సాహిత్య లోకానికి చాటి చెప్పి తెలుగు కవితా రచనకు కొన్ని ఎల్లల్ని ఏర్పరచడం — ఈ మూడు మొల్ల యొక్క ప్రత్యేకతలుగా మనం పేర్కొనవచ్చు.

ఆనాటి సాహిత్య వాతావరణంలో బ్రాహ్మణ పండితులకే కవులకే ఆ స్థానాలలో అధిక గౌరవం లభించింది. శూద్రుఁడు వేదం చదువరాదు. సాహిత్యవ్యాసంగానికే అతడు అనర్హుడు అన్న భావం ఆనాటి పండితుల్లో ప్రబలింది! దీనికి ఉదాహరణగా అప్పకవి పద్యం పేర్కొనవచ్చు.

ఉపమ గల్గియు శయ్యాల నొప్పియున్న
సంస్కృత భవుని కావ్యంబు గ్రాహ్యంబు కాదు
పాయసంబు సంస్కార పక్వమయ్యు
కాక జుష్టంబు హవ్యంబు గాని యట్లు.

అంటూ శూద్రుల్ని కాకులతోనూ, గ్రద్దలతోనూ ఉపమించిన కాలమది. శూద్రులైన పురుషులే ఇలాంటి తిరస్కారానికి లోనయ్యారంటే ఇక స్త్రీల విషయం చెప్పేదేముంది ? విద్యా విజ్ఞానాలకేకాక వ్యక్తిత్వానికి దూరమై అంధకార బంధురమైన జీవితాన్ని గడుపుతున్నట్లు మనం ఎన్నో విధాలుగా నిరూపించవచ్చు. మొల్ల సాహిత్య వ్యక్తిత్వానికే తిరస్కారం కలిగిన సన్నివేశాన్ని గూర్చి ఏకామ్రనాథుఁడనే తొలి చరిత్రకారుడు నిరూపించాడు. "మరి యొక్కనాడు తిక్కన సోమయాజుల వరప్రసాదంబుచేత కుమ్మర మొల్ల రామాయణంబను వచన కావ్యంబు రచియించి ప్రతాపరుద్రునకు అంకితంబుగా చేయు సమయంబున, ఆ రాజు సమ్ముఖంబున ఉన్న విద్వాంసులు విని ఇది శూద్ర కవిత్వంబు, ఇది నిషిద్ధంబని నిరాకరించిన, నా రాజు సర్వజ్ఞుండు కావున వారిని మెచ్చి రాజు బ్రాహ్మణ కృతంబైన కావ్యంబు కావలెననిన, యా విద్వాంసులు భాస్కరుని పిలిపించిన, అతండు రచించిన శ్రీమద్రామాయణంబు విను

సమయంబున, అచటికి మొల్ల యేతెంచి రామాయణంబు మున్ను రచియించి యున్నా నవి యచట నొక పద్యంబు చిత్రంబుగా జదువుటయు, యారాజా సర్వజ్ఞుండు గావున, దాని ప్రజ్ఞకు మెచ్చి విప్రజనంబుల మనంబులు నొచ్చునోయని మొల్లను బిలిపించి, పల్లకియును, నగరిని, నిత్యజీతంబును కట్టడచేసి తన యెదుట నుండనీక తన దేవి విశాలాక్షి సమ్ముఖంబున నుండజేయుటయు (సిద్దేశ్వర చరిత్ర పు-160)

ఈ వచనంవల్ల మనకు కొన్ని విషయాలు బోధపడుతున్నాయి.

1) ఆనాడు వచనానికి గల నిరాదరణం.

2) శూద్ర కవిత్వంపట్ల తిరస్కార భావం.

3) ఎంత గొప్ప కవిత్వం వ్రాసినా స్త్రీలకు రాజాస్థానాలలో ప్రవేశార్హత లేక పోవడం -

4) విప్రుల చేతుల్లో విభులు కీలుబొమ్మలుగా మారడం.

ఇలాంటి వాతావరణంలో కుమ్మరి కులంలో జన్మించిన మొల్ల భక్తికీ ముక్తికీ సోపాన మార్గంగా భావింపబడే రామాయణ కథను చేపట్టి సామాన్య పాఠకులకు అందుబాటులో ఉంచిందంటే, ఆనాటి కవి పండిత లోకంలో ఎలాంటి అలజడి, సంచలనం చెలరేగిందో సులభంగా మనం ఊహించవచ్చు. శూద్రకులంలో జన్మించిన తాను ఒక రచన చేపట్టింది. అది మామూలు రచన కాదు. భారతజాతి మనుగడకు, సంస్కృతికి ప్రధాన ఆలంబనంగా ఆనాడు పరిగణింపబడుతున్న రామాయణం. కనుక ఆనాటి పండిత ప్రకాండుల దృష్టి తనగ్రంథంపై కేంద్రీకృతంకావడం సహజం.ఎన్నో ఆక్షేపణలకు, విమర్శలకు తన గ్రంథం గురి అయ్యే అవకాశమున్నది. ఇలాంటి ప్రతికూల వాతావరణంలో తాను చేస్తున్న సాహసాన్ని సమర్థించుకోవడానికీ, పండితుల దాడి నుండి తప్పించుకోవడానికి తన రచనకు శ్రీకంఠ మల్లేశుని వరాన్ని అడ్డంగా పెట్టుకున్నది. శ్రీ రామచంద్రుని ఆదేశాన్ని మిషగా స్వీకరించింది. కేవలం వరాలు, భగవదాదేశాలు మాత్రమే కావ్య ప్రపంచాన్ని సృష్టించలేవు కదా! కావ్య సంపద, క్రియలు, నిఘంటువులు తెలియని మొల్ల ఒక రచన చేపట్టిందంటే, ఆ రచనకి పూర్వం ఆమె చేసిన నిరంతర కృషి, సాధన, తపన, తపస్సు మనం ఊహించవలసిందే! ఆ తపస్సే సాహితీ లోకానికొక వరంగా రామయణ రూపంలో ఫలించింది.

ఆ రోజుల్లో సంస్కృత పండితుడే నిజమైన పండితుడు. రాజాస్థానాల్లో వారికే అధిక గౌరవ మర్యాదలు జరుగుతుండేవి. తెలుగు పండితులు కూడా సంస్కృత పాండిత్య వ్యామోహంతో, కొండవీటి చేంతాడంత దీర్ఘ సమాసాలతో గూఢ శబ్దాల్ని గుప్పించే ఆడంబర రచనపై మోజు చూపడం గ్రహించిన మొల్ల,

ధైర్యంగా తెలుగుతనపు ముద్ర వేయటానికి కావ్య రచనకు కొన్ని ఎల్లల్ని ఏర్పఱచింది. "కవిత్వం వ్రాయడమంటే కేవలం గూఢ శబ్దాల్ని గుప్పించడంకాదు. పరిణత మనస్కులుకాని పాఠకులకు కూడా అందుబాటులో ఉండే చక్కని సామెతల ఆమెతలతో, తేనెలాగా రుచియై, వీనుల విందైన, తేట మాటలతో ఒక క్రొత్తరీతిలో రచన నడవా లన్నది నడిపి చూపించింది. భాషా పరంగా, సాంఘిక పరంగా తరతరాలుగా వస్తున్న పాతసాంప్రదాయాల్ని ఎదిరించడమేకాదు, "చిల్లర రాజలోకముల(జేకొని యాడగ విచ్చుపుట్టునే" అంటూ అల్లము - బెల్లము ఈ రెంటిలో ఎవరి ప్రోద్బలమూ లేని స్థితిలో మీరు సహజంగా కోరుకొనేది ఏది? అని ఆనాటి కవులనే సవాల్ చేసిన మొల్ల, రాజకీయంగా కూడా ఆ నాటి సమాజంలో ఒక గొప్ప సంచలనం కలిగించిందని చెప్పక తప్పదు.

(నెల్లూరులో మొల్ల జయంత్యుత్సవ సందర్భంగా)

# 5

# "ప్రబంధ సాహిత్యంలో స్త్రీ"

తెలుగు సాహిత్య సరస్వతి దేశకాల పరిస్థితుల కనుగుణంగా ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రూపాన్ని సంతరించుకుంది. ప్రబంధ యుగంలో సర్వాలంకార భూషితంగా మనకు సాక్షాత్కరిస్తుంది. రాజకీయంగా సాంఘికంగా, సాంస్కృతికంగా ప్రబంధయుగాన్ని స్వర్ణయుగమన్నారు. చారిత్రకులు, కవుల జీవన క్షేత్రాల్లో కూడా ఆనాడు బంగారం పండింది. కవులంతా రాజుల్ని ఆశ్రయించి వారి అభిరుచుల్ని తమ రచనల్లో ప్రతిబింబింపజేస్తూ ఆ వ్యవస్థనే అంటిపెట్టుకొని జీవించారు. అరణపు కవులుగా వెళ్ళడానికి కూడా వెనుకాడలేదంటే ఎంత విధేయతతో బ్రతికారో అర్థమౌతుంది. అలాంటి కవుల్ని గుప్పిట్లో బంధించి వారి రచనలపై కొన్ని నిబంధనల్ని ఏర్పఱచి కేవలం రాచఠీకపు సంస్కృతిని, రాచఠీకపు సాహిత్యాన్నే పోషించి పెంపొందించారు. తామనుభవిస్తున్న భోగ విలాసాలకు, శృంగారానుభూతులకు ఒక శాశ్వతత్వం కల్పించే ఉద్దేశంతో కవుల్ని సాధనంగా ఉపయోగించుకొన్నారు. ఫలితంగా సాహిత్యంలో అష్టవిధ శృంగార నాయకలు, చతుర్విధ నాయకులు అవతరించారు. ఆ నాటి కావ్యాల్లో చాలా వఱకు ప్రధాన రసం శృంగారం, చాలా చోట్ల రాజుల ప్రియురాండ్రే నాయికలైనారు.

ఒక రాచఠీకపు వ్యవస్థనంటిపెట్టుకొని ఉన్న అనేక అవలక్షణాలలో స్త్రీని విలాస వస్తువుగా పరిగణించడం ఒకటి. "రసానందం" పేరుతో వాస్తవాన్ని మభ్యపెట్టి అభూత కల్పనలతో అసహజ సన్నివేశాలతో కావ్యాన్ని కొనసాగించడం ఆ కవుల లక్షణం. వీరి గ్రంథాల్లో నాయికలందరూ అందమైనవారే....అందఱి ముఖాలూ చంద్రబింబాలే. అందరి ముక్కులూ సంపెంగలే. అందరూ హంసయానలే. అందరూ గజగమనలే. చంద్రవదనలు, శతపత్రనేత్రలు, చంచరీక చికురలు, తనుమధ్యలు ప్రబంధాల్లో ఎక్కడ తడిమితే అక్కడ ప్రత్యక్షమౌతారు. కాలిగోరు మొదలు తల వెంట్రుకదాకా ప్రసిద్ధమైన ఉపమానాల సహాయంతో కచకుచాది వర్ణనలతో స్త్రీని శల్య పరీక్షకు గురిచేయడం ప్రబంధ కవుల ప్రత్యేకత. నిజానికి "ప్రబంధ స్త్రీ" అంటే మనసుతో ఏ మాత్రం సంబంధంలేని "శరీరం" అన్నమాట. కనుకనే ప్రబంధాలను పరిశీలిస్తే స్త్రీ బోధక పదాలన్నీ శరీరంలోని ఏదో ఒక భాగాన్ని సూచిస్తాయి. తన్వంగి, మదిరాక్షి, కోమలి, హంసగమన,

గజగమన, చంద్రముఖి, వామాక్షి, పీనస్తని, హరిణాక్షి, శాతోదరి ఇలాంటి శరీర సూచక పదాలు కొల్లలు. నాయిక వివాహానంతరం ఆమె చెలికత్తెలైనా తమ చెలిని శోభనపు గది తలుపుల చెంత వదులుతారేమోకాని, కవి మాత్రం అరక్షణంకూడా ఆమెను వదలడానికంగీకరించడని సుప్రసిద్ధ విమర్శకులు కట్టమంచి అన్నారు. స్తనాలని ఘటాలతోనూ, బొడ్డును పొన్న పువ్వుతోనూ, లేదా బొద్ధిన బావితోనూ, లేదా కాముని హోమాగ్ని గుండంతోనూ లేదా నీటి సుడితోనూ, తొడల్ని అరటిబోదెలతోనూ లేదా ఏనుగుతొండాలతోనూ పోల్చి ప్రదర్శించిన ఆనాటి మన సంస్కృతి స్త్రీని ఎంతగా గౌరవించిందో మనం ఊహించవొచ్చు. మచ్చుకు ఒక పద్యం.

"జిలుఁగు పయ్యెద యను వలలోన నా చెల్వ
గుబ్బ చనుఁగవయను కోక యుగళి
యెగయఁబైఁగురీతి నెసఁగుఁ గ్రేవ లఁజల
తృషలీల యెఱుఁగు తరగలడర"

నాయిక యొక్క స్తన ద్వయం ఇరుపైపులా కక్ష్యల కొంతులు తరంగాలలాగా పొంగి వస్తూ ఉంటే సన్నని పైటలో ఒక దాంతో ఒకటి ఒరుసుకుంటూ వలలో చిక్కుకొని తప్పించుకోడానికై రెక్కలు కొట్టుకుంటూ కలవరపడే చక్రవాకాల జంటలాగా ఉన్నాయట. ఇలాంటి దౌర్భాగ్యపు వ్రాతలకు పరవశించిపోయిన రాజులు కవులకు కనకాభిషేకాలే చేశారు. అందలా లెక్కించారు. గండపెండేరాలు తొడిగారు. మత్త గజాలపై ఊరేగించారు. రత్న భూషణాదులెన్నో కానుకలుగా సమర్పించారు.

ప్రబంధ సాహిత్య సంస్కృతి చాలా చోట్ల పురుషాధిక్యతనే ప్రదర్శిస్తుంది. ఒక రాజుంటాడు. ఒక రాచకన్యక అయన్నికోరి విరహవేదన పడి, మోహించి దశావస్థలనుభవించి చివరకు వివాహమాడుతుంది. ఈ దశావస్థల వర్ణన చాలావరకు స్త్రీ పరంగానే సాగుతూ ఉంటుంది. పురుషుని కన్వయించవు. మరొక చోట తనభర్త మరొక స్త్రీని మోహిస్తే అసూయపడి ఖండిత నాయికై చివరకు ఆయన దక్షిణ నాయకత్వాన్ని గౌరవంగా, గర్వంగా అంగీకరిస్తుంది. వీరి ప్రపంచం చాలా చిన్నది. ఈ నాయికలంతా అంతఃపురాలనే అంటి పెట్టుకొని ఏమాత్రం బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా బందీలలాగా బ్రతికారు. అన్నదమ్ముల్ని, తండ్రిని, లేదా భర్తని తప్ప జీవితంలో ఏ పురుషున్నీ వీరు చూచి ఎరుగరు. తమ వారితోనైనా ఆత్మీయతను ప్రదర్శించడానికి వీలులేదు. అన్నదమ్ములతో మాట్లాడాలన్నా వీరికి ఎన్నో నిబంధనలు, కట్టుబాట్లు. నిజానికి 'ప్రేమ' అన్న శబ్దం పుత్ర, మాతృ, భ్రాత్రాది బాంధవ్యాలకే పరిమితంచేసి. స్త్రీ పురుష బాంధవ్యాన్ని "మోహం"అన్న పేరుతో వేరువేసింది ఈ ప్రబంధ సంస్కృతి, మరులు గొనుట, మోహించుట, వలపు గొనుట, కామించుట స్త్రీ పురుష బాంధవ్యానికి ఈ పదాలు ఆ యుగపు ప్రతీకలు.

వీరికి స్వేచ్ఛ అన్న పదానికి గాని, వ్యక్తిత్వం అన్న పదానికి గాని అర్థం తెలియనే తెలియదు. రత్నాలహారాలు, కంకణాలు, మొలనూళ్ళు, అందెలు మొదలైన ఏడు వారాల సొమ్ములు చూచుకొని మురిసిపోయే ఆ స్త్రీలకు అవి ఒకనాడు తమ స్వేచ్ఛను అరికట్టి, బంధించి ఉంచడానికి సమాజం తగిలించిన బంగారు సంకెళ్ళన్న సత్యం వారికి విప్పి చెప్పేవారు లేరు. అంతఃపురాన్ని అంటి పెట్టుకొని ఉన్న క్రీడో ద్యానవనాలు, క్రీడా పర్వతాలు, సరస్సులు, శారికలు, నెమళ్ళు, హంసలు-ఇవే సర్వ ప్రపంచం వారికి. కలలో కనుపించిన రాజకుమారుడిని గాఢంగా ప్రేమించి అతని రాక కోసం తపించిపోవడం, విరహాలు, జాగరణలు, చెలికత్తెల ఊరడింపులు, మన్మథ చంద్ర ఉపాలంబనాలు, మూర్ఛలు - ఈ దశావస్థల్ని దాటితేనే కాని వివాహం జరగ డానికి వీలులేదు. ఈ విధంగా ప్రియుని పొందే జీవిత పరమార్థంగా తపించడం తప్ప, తదితర జీవిత సమస్యలున్నట్లు తోచదు. విరహంలో వీరు ఏడ్చే ఏడుపు కూడా కళా త్మకంగానే ఉంటుంది.

నిజం చెప్పాలంటే వీరంతా లక్షణ గ్రంథాల్లో నిర్ణయింపబడిన కొలతలకు సరిపోయేటట్లు కత్తిరింపబడ్డ తోలుబొమ్మలు. లేదా మరత్రిప్పితే తిరిగే మరబొమ్మలు, లేదా చలనం ఉన్న చలువరాతి బొమ్మలు అంతఃపురమనే బంగారు పంజరంలో బంధింపబడ్డ పంచరంగుల చిలుకలు. వీరినే కవులు అసూర్యంపశ్యలనీ, ఎండకన్నెఱు గని చిన్నవారనీ చిత్రిస్తూ సౌకుమార్యం, సౌందర్యం ముసుగులో వారి వ్యక్తిత్వాన్ని ఆత్మ సౌందర్యాన్ని విస్మరించారు. దోపిడీ సాహిత్యం, దోపిడీ సంస్కృతిలో ఇంత కంటె ఎక్కువ మనం ఏం ఆశించగలం ? మనం గొప్పగా చెప్పుకునే ప్రాచీన సంస్కృతిలోని ఒక యుగంలో స్త్రీయొక్క అసలు స్వరూపమిది !

నాణెం యొక్క మరొక ముఖాన్ని పరిశీలిద్దాం. కవి సమాజంలోనివాడు. అతడు ఎంత ప్రబంధ లాక్షణిక ప్రభంజనంలో కొట్టుకొనిపోయినా, సమాజాన్ని విడిచి ఎన్ని సాహిత్యపు సాముగరిడీలు ప్రదర్శించినా, నేలవిడిచి సాము చేసినా, ఎప్పుడో ఒకప్పుడు నేలమీద కాలు నిలుపక తప్పదు. కనుకనే లక్షణ గ్రంథాలు సృష్టించిన లక్కబొమ్మలకు దూరంగా, ఆనాటి సామాజిక వాస్తవికతలో ఊపిరి పీల్చిన సజీవ పాత్రలు కొన్నైనా కవుల కలాల నుండి జాలు వారినాయి. పారిజాతా పహరణంలోని సత్యభామ, మనుచరిత్రలోని వరూధిని, ఆముక్తమాల్యదలోని గోదా దేవి, కళాపూర్ణోదయ కలభాషిణి, సుగాత్రి, తెనాలి రామకృష్ణుని నిగమశర్మ అక్క- వీరంతా ప్రబంధ లక్షణ జాడ్యం సోకని సజీవమూర్తులు, చైతన్య స్రవంతులు.

విద్యుల్లతలాగా మన కండ్ల ఎదుట సంచరించే జీవమూర్తి వరూధిని. గొప్ప సంస్కారవతి. కులానికి వేశ్య ఐనా మనోవాక్కాయాలతో ప్రవరుణ్ణి వాంఛించింది. ధనం కోసం ప్రవరుణ్ణి ప్రేమించలేదు. లేని ప్రేమను నటించలేదు. మనసు లోని కోరికను మర్మం లేకుండా ప్రకటించింది. ప్రవరుడంగీకరించలేదు.

తరతరాల కరుడుకట్టిన నైతిక కర్కశత్వానికి మారు పేరు ప్రవరుడు. ఆ కర్కశత్వమే వరూధినిని వంచించింది. ఐహిక సుఖాలు, భోగలాల సత్వం, స్వేచ్ఛా విశృంఖలత్వం, సంప్రదాయపు సంకెళ్ళ సడలింపు ఒక వైపు, సనాతనాచార పరాయణత్వం, కరుడుకట్టిన నైతిక కర్కశత్వం మరొకవైపు- వీటికి నిరంతరం జరుగుతున్న సంఘర్షణమే వరూధినీ ప్రవరుల సంభాషణా సారాంశంగా రూపుదిద్దుకున్నదని విమర్శకుల అభిప్రాయం. అంతేకాదు వరూధిని వాదనా పటిమ ఈనాటి వకీళ్ళకే ఓనమాలు నేర్పుతుంది అన్నాడొక విమర్శకుడు.

తెలుగు సాహిత్యంలో వైవిధ్యాన్ని సంతరించుకున్న పాత్ర సత్యభామ. భాగవత సత్య సామాన్య పాఠకుల అనుభవాలకూ అనుభూతులకూ అతీతమైన ఒక ఆదర్శ మూర్తి. లోక కళ్యాణం కోసం ప్రాణాలకు తెగించి పతితోకలిసి యుద్ధంచేసిన వీరనారీ మణి. ముక్కుతిమ్మన తీర్చిదిద్దిన "ముద్దుల సత్య" తెలుగు వారింటి గడుసరి కోడలు. ఆత్మాభిమానం పేరుతో అడుగడుగునా అలక పాన్పులు ఎక్కే అతివలకు అక్కగారీమె. అంతేకాదు సాటిస్త్రీలపట్ల అసూయాద్వేషాల్ని వెళ్ళగక్కే వనితలకీమె వారసురాలు. కయ్యానికి కాలుదువ్వే గయ్యాళులకీమె గురువు. ఈర్ష్య, అసూయ, అహంకారం ఆత్మాభిమానం, పట్టుదల రూపు గొన్న ప్రబంధ సత్య సాధారణ మానుష మూర్తి. భర్తను ఎడమ కాలితో తన్నడమేకాదు, నారదునికి అమ్మజూపి అసలుకే ఎసరుపెట్ట జూచింది. నిజానికి మానవ స్వభావం పాత్రల్లో ఎంతగా అచ్చొత్తిస్తే అంతగా పాఠకులకు చేరువౌతాయి. కనుకనే భాగవత సత్యకంటే ప్రబంధ సత్య సహృదయుల ఊపిరిలో ఊపిరిగా ఇప్పటికీ జీవిస్తున్నది.

తెనాలి రామలింగ కవి గంటం నుండి వెలువడి సాహితీవేత్తల, సహృదయుల కంఠాల్లో అనుక్షణం ధ్వనిస్తున్న ఏకైకపాత్ర నిగమశర్మ అక్క. ఈ పేరులేని పెద్దింటి పేరంటాలు ఈనాటికీ సంపన్న వైదిక బ్రాహ్మణ కుటుంబాలలో జీవించి వుంది. ఈమె హుందాతనం, కార్య నిర్వహణ సామర్థ్యం, సమయస్ఫూర్తి, ఔచిత్యపు వాక్సరళి, పుట్టింటి పేరు ప్రతిష్ఠలకై ఆరాటం——వీటన్నింటిలో ఆంధ్ర ఆడబడచుల కీమె ఆదర్శం.

మానవ స్వభావాల్ని, చేష్టల్ని పుణికి పుచ్చుకున్న ఆడపక్షి పాత్రల్ని కూడా ప్రబంధాలు సృష్టించాయి. ఇందులో ముఖ్యంగా హంసలు, చిలకలు చోటు చేసుకున్నాయి. ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ఆడహంసి కేవలం ఒక అబలకాదు. అఘటన ఘటనా సామర్థ్యం, పాండిత్యం, సమయస్ఫూర్తి, దురాలోచన —— ఇవి రూపుగొన్న ఈ హంస మానవ పాత్రలకే ఆదర్శప్రాయంగా నిలిచింది. ఈ విధంగా ఎన్నో సజీవ పాత్రల్ని ఈ యుగం సృష్టించినా, యుగధర్మపు ఉరవడిని తట్టుకొని ఎదురీదినవి కొన్ని మాత్రమే.

రామాయణ, భారత భాగవత శ్రోతలు అతిసామాన్య నగటు మానవులు, పామరులు, జీవిత సంఘర్షణలు, భిన్నవ్యక్తుల మధ్యగల వైవిధ్యాలు, సామాజిక ధార్మిక జీవిత పరమార్థాలు—ఇవి రూపుగొన్న భారతాదుల్ని వారు బహుశ్రద్ధగా పౌరాణికుడి ముఖతః ఆలకించి ఆనందించి తమ జీవితాలతో పోల్చుకొని ఊరట చెందుతారు. కనుకనే అవి మానవ చరిత్రలో ఒక భాగంగా జీర్ణించుకొని పోయాయి. కాగా ప్రబంధ శ్రోతలు సంపన్నులైన రసికులు. సంఘంలో వీరి సంఖ్య చాల స్వల్పం. ఈ వర్గానికి కావ్యం రసానంద హేతువు. సామాజిక సమస్యల్ని, నిత్యజీవిత సంఘర్షణల్ని వీరు సహించలేరు. కనుకనే పలాయన వాదాన్ని ప్రతిపాదించే ఈ ప్రబంధాలు, రసానందాన్ని పొందుతూ చిత్ర కవిత్వాల, బంధకవిత్వాల కసరత్తుల మైకంలో మునిగి మైమరవడానికే తప్ప, అంతరంగ ప్రక్షాళనకు అర్థాలు కాకుండా పోయాయి.

ఏది ఏమైనా మనం ఆశాజీవులం. జడత్వంలోనుంచే చైతన్యం పుట్టుకొస్తుంది. జడతకు ప్రతిరూపమైన పర్వతాల్లోనే చైతన్య స్రవంతులు ఉద్భవిస్తాయి. ఆ స్రవంతే పరవళ్లు తొక్కుతూ ప్రవహించి స్వర్ణ సముద్రంలో కలుస్తుంది. తిరిగి ఆ సముద్రపు నీరే వర్షరూపంలో ఆ స్రవంతికి ప్రాణం పోస్తుంది. ఇదొక నిరంతర విషమవలయం. ఈ ప్రకృతి నైజాన్నే యుగయుగాల సాహిత్య సామాజిక చరిత్రలకు అన్వయించవచ్చు. సాహితీ జడత్వం—సాహితీ చైతన్యం-తిరిగి జడత్వం - చైతన్యం. ఇవి ఒక జాతియొక్క పురోగమన మార్గంలో వెలుగునీడల్లాగా వెంటాడుతూనే ఉంటాయి. ఇంకా పరిశోధిస్తే యుగాల సాహిత్య చరిత్రలో "ప్రబంధయుగం" కూడా స్త్రీయొక్క సాంఘిక నైతిక విలువలకు వెలగట్టి సాక్ష్యం చెపుతుందని పరిశోధనలవల్ల మనం పరిశీలించగలం.

(హైదరాబాద్‌లో జరిగిన ఆంధ్ర రచయిత్రుల మహాసభలో)

## ఆ ధా ర గ్ర ం థా లు


1) ప్రభావతీ ప్రద్యుమ్నము — పింగళి సూరన్న

2) తెలుగులో కవితా విప్లవాల స్వరూపం — వెల్చేరు నారాయణరావు

3) రామాయణ విషవృక్ష పీఠిక — రంగనాయకమ్మ

4) కవికోకిల గ్రంథావళి — వ్యాసముల సంపుటం 4

# 6

# దువ్వూరి రామిరెడ్డి వ్యాసావళి-ఒక సమీక్ష

దువ్వూరి రామిరెడ్డిగారు ఒక కవిగా, నాటకకర్తగానేకాక, ఒక గొప్ప విమర్శకుడుగాకూడా ప్రసిద్ధిపొందారు. కళ, ఉదయిని, రెడ్డివాణి, భారతి లాంటి పత్రికల ద్వారా రేడియో ఉపన్యాసాల ద్వారా ప్రాచీన నవ్య సాహిత్య సౌరభాలను సహృదయులచేత ఆఘ్రాణింప చేశారు. వారి భావాంబర వీధిలో విరిసిన హరివిల్లే సారస్వత వ్యాసావళి. ఒక కవిగా, లాక్షణికుడుగా, నాటకకర్తగా, చిత్రకారుడిగా, అభినవాంధ్ర సాహిత్యాభిమానిగా తన స్వానుభవాల్ని కాచి, వడకట్టి, ఘనీభవింపచేసి రసగుళికలుగా సిద్ధంచేసి ఈ వ్యాసాల రూపంలో ఆంధ్ర పాఠక లోకానికి అందించారు. అల్లసాని పెద్దన మొదలు ఆధునిక సాహిత్యం దాకా వివిధ కోణాలలో దర్శించి పాఠకలోకానికి పరిచయం చేశారు.

రామిరెడ్డిగారికి తిక్కన భారతమన్నా పెద్దన మనుచరిత్రన్నా మక్కువ ఎక్కువని తోస్తుంది. సామాన్య ప్రబంధ స్థాయి నుంచి మను చరిత్రను మింటికెత్తి పెద్దనను సమకాలీన భావ ప్రతినిధిగా ప్రతిపాదించారు. నిర్మాణాత్మకమైన భావ చిత్రణా కౌశలానికి మను చరిత్రనే మచ్చుతునకగా ఉదహరిస్తూ రసికుల్ని రంజింపజేయగల ఒక ప్రబంధాని కుండవలసిన వస్తు నిర్మాణ సామర్థ్యాది అంశాలన్నింటిని విశ్లేషించి చూపా రీయన.

ఛందస్సుపట్ల వీరికి అమితమైన ఆదరముంది. "గానలయా సమ్మేళనమువలనఁ గలుగు శ్రుతి మనోహరత్వమును, భావ ప్రేరక శక్తియు ఛందమునందుగలవు. ఛందస్సు కేవలము మానవ నిర్మితమగు కృత్రిమ శాస్త్రముగాదు. ఇందుకు ప్రకృతియందే బీజములు గలవు" అంటూ ఛందస్సులేని పద్యాన్ని ఉప్పులేని చప్పిడి కూరతో సమానంగా భావించా రీయన. ఛందస్సులో లయ పుడుతుంది. లయవల్ల ఛందస్సు జన్మిస్తుంది. ప్రకృతే లయ బద్ధమైంది. కనుక ఈ ఛందోనియమం అస్వాభావికమేమీ కాదు అంటారీయన.

కవితా స్వేచ్ఛను గూర్చి రెడ్డిగారికి కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయాలున్నాయి. విశృంఖలత్వంవేరు. స్వాతంత్ర్యం వేరు, నయాగరా ప్రవాహపాతం లాంటి విశృంఖ

లక్ష్యాన్ని నియమ బద్ధంచేస్తే అది స్వాతంత్ర్యంగా సాక్షాత్కరిస్తుంది అంటారీయన. "శాసనములకంటే స్వయమారోపితములగు నీతులే మనుష్య సంఘమును పాలించు చుండును. విరుద్ధ శాసనములకు లొంగి యుండుట దాస్యమైనను స్వయంకృత నియమమునకు వశవర్తియై యుండుట స్వాతంత్ర్యమనబడును" అంటూ స్వేచ్ఛను నియమబద్ధం చేస్తూ నిర్వహించినవారు రెడ్డిగారు.

జాతీయ గౌరవం, జాతీయ వ్యక్తిత్వంపట్ల వీరికి అచంచలమైన విశ్వాసముంది. ప్రపంచ యుద్ధాల కారణంగా పాశ్చాత్య దేశాల్లో, పొడ చూపిన విపరీత కళా చాపల్యం యొక్క ప్రతిధ్వనులు మన దేశంలో వినిపించినా అవి తాత్కాలికమైనవని. మన కవిత్వం సర్వకాలీన మైనంతవరకు, కవితా మూలసూత్రాలకు ఎలాంటి చలనంలేదు. తెలుగుజాతి పరాయిది కానంతవరకు, తెలుగువారి హృదయంలో రసజ్ఞత నశించనంతవరకు, తెలుగువారి సాంఘిక జీవన ప్రవాహానికి గట్లుగా ఆంధ్ర మహాభారత, భాగవత రామాయణాలు జీవించి ఉన్నంతదాకా తెలుగు సాహిత్యానికి చలనంలేదు అంటారీయన.

ఈయన దృష్టిలో నవ్యత అన్న శబ్దం కేవలం అధునికతా వాచికాదు. అది సంబంధ వాచి మాత్రమే. మార్పును కోరడం మానవ సహజం. ఈ మార్పు ఏకాలానికైనా ఏ దేశానికైనా వర్తిస్తుంది. నవ్యతకు నేటి కవితే నాంది పలికిందను కోవడం చారిత్రక దృష్టి లోపించడం వల్లనే. తనకు పూర్వం వ్రాయబడ్డ రచనలపై మనస్సు తిరుగుబాటు చేసినప్పుడు కవులు కలం కొత్తదారుల్ని వెదుక్కోవడం చారిత్రక సత్యం. అధునికుల భావస్ఫూర్తికీ, భాషా స్ఫూర్తికీ కొంత వరకు ప్రాచీన సాహిత్యమే మూలం, ధనం అన్న సత్యాన్ని వీరు నమ్మారు. అంత మాత్రంచేత అధునిక కవిత్వాన్ని ఈసడించలేదు. పల్లకీలలో ప్రభువుల ప్రక్కనచేరి ఆడంబరాలతో ఊరేగిన ఒకనాటి కవితా కన్యకు చేయూతనిచ్చి దింపి సామాన్య మానవుడి హృదయరాణిగా, వలపులవాణిగా నిరాడంబర మూర్తిగా ప్రతిష్ఠింపజేసిన నవ్యకవిని అభినందించారు.

మంచి చెడు అన్నవి వస్తుగతమేకాని కాలగతంకావు అంటారీయన. వారి మాటల్లోనే చెప్పాలంటే "ఈ కాలమున వ్రాయబడు నదంతయు చెత్తయని తృణీకరించుట యెంత అసమంజసమో ఈనాటి రచనలన్నియుమహోత్కృష్టములని ప్రశంసించుట కూడా అంత అవిచారమూలకమే. వాగోగులు ఒక వర్తమాన కాలమునకే సంబంధించినవికావు.

చెత్త వ్రాసినవారు పూర్వము కూడా కలరు. అయితే ఆ చెత్తకును మనకును నూరుల కొలది సంవత్సరముల అంతరమున్నది. కావున ఆ చెత్తయంతయు కుళ్ళి కాల ప్రవాహమున కొట్టుకొనిపోయి అంతస్సారముగల యే కొన్ని కావ్యములో,

నిలిచినవి. ప్రతిభావంతులగు కవులు ఏ కాలమందైన నుందురు. అయితే వారి మార్గములు భిన్నములుగ నుండవచ్చును" అంటూనే భావసామ్యత లేని ఈనాటి కొందరు కవులపట్ల ఎందుకో అత్యంతమైన కటుకు దనాన్ని ప్రదర్శించారని చెప్పక తప్పదు. భావ కవిత్వంపై పనికట్టుకొని దండయాత్రచేసి "అహంభావ కవి"నని ప్రకటించుకున్న పఠాభి ఫిడేలు రాగాలలో ఈయనకు అపస్వరాలు ధ్వనించాయి. యౌవన ప్రాదుర్భావ సమయంలో కామోద్రిక్తుడైన యువకుని ఉన్మత్తప్రలాపాలుగా స్ఫురించాయీయనకు. భావ కవిత్వంలో మరీభవించిన జడత్వాన్ని ధ్వంసం చేయడానికి మీటిన ఫిడేలురాగాలు రెడ్డిగారికి విశృంఖల విహారంగా తోచాయి. నిజానికి సమాజంలో వచ్చే మార్పులు కవిత్వంలో కనిపించక తప్పవు కవిత్వం మారినప్పుడు దాని రచనా సూత్రాలూ విధానాలు మారక తప్పవుకదా! ఈ మార్పుని విస్మరించి గత కవిత్వపు ప్రమాణాలతోనే కవిత్వాన్ని కొలవడం ప్రారంభిస్తే మార్పు కర్థం ఏముంది? ఏది ఏమైనా బహుశః భావాలలో తరాల అంతరాలు సృష్టించిన అగాధమే రెడ్డిగారి అసహనానికి కారణమేమో!

దువ్వూరి ప్రకృతి పూజారి. ప్రకృతిలోని ప్రతీ అణువు కవులకు చైతన్యవంతంగా గోచరిస్తుంది అంటా రీయన. ఎఱ్ఱని సూర్యబింబాన్ని రోష భీషణ కషాయదీధితులతో పోల్చినా, ఎదకు పుట్టిన ఎఱ్ఱని పుండుగా ఉత్ప్రేక్షించినా, అవి మానవ చర్యలకు భిత్తికలుగా ఏర్పడి కావ్యవర్ణనంలో కలిసిపోయినప్పుడే మరింత సుందరంగా భాసిస్తాయి.

వీరు కావ్య విమర్శతో తృప్తి చెందక నాటక విమర్శకుకూడా పూనుకున్నారు. సంఘ సంస్కరణ మనే పేరుతో బూతు విషయాలను, అసభ్యకరమైన అంశాలను సంభాషణల్లో దూర్చి ప్రేక్షకులకు జుగుప్సను కలిగించే పద్ధతిని వీరు కొంత కఠినంగానే విమర్శించారు. సమకాలీన నాటక రంగంలోని కాలుష్యాన్ని ఒక నాటక కర్తగానేకాక, ఒక సామాజికుడిగా పరిశీలించి కొన్ని సూచనల్ని అందించి ఆంధ్ర నాటక రంగానికొక ఔచిత్యగౌరవాన్ని ఆపాదించారు. వారిచ్చిన సలహాలివి.

1. సమకాలీన ప్రజాబాహుళ్యం యొక్క అశిక్షితమైన అభిరుచి అడుగులకు మడుగులొత్తే కీర్తి ప్రలోభం నుండి నాటక కర్తలు తప్పించుకోవాలి.

2. రోతను, సిగ్గును పుట్టించే సంభాషణలు ప్రకరణోచితాలైనప్పటికి పరిహరించాలి.

3. వ్యాపార దృష్టిని విడిచిపెట్టాలి.

4. నాటక శరీర నిర్మాణంలో అంగాను గుణ్యాన్ని పాటించాలి.

5. కొండవీటి చేంతాడు లాంటి స్వగతాల్ని పరిహరించాలి.

6. దేశకాల పాత్ర విరుద్ధమైనప్పటికీ పురాతన వస్తువును ఆధునికవాసన తగిలించాలనే బలహీనత నుండి బయట పడాలి.

7. పద్య ప్రలోభాన్ని, పునరుక్తి దోషాన్ని పరిహరించాలి.

8. పాత్రోచిత భాషను ప్రయోగించాలి.

9. సంగీతాన్ని అభినయానికి కేవలం ఔపచారికంగా పొందుపరచాలి.

10. పాత్రోచితమైన ఆహార్యాన్ని పాటించాలి.

11. నాటకోచితమైన రంగాలంకరణంపై శ్రద్ధ చూపాలి.

12. నాటక ప్రయోగంలో రాశికంటే వాశిపై దృష్టిని ప్రసరింప జేయాలి.

అప్పుడే నాటక రంగం రక్తి కడుతుందని రెడ్డిగారి అభిప్రాయం.

ఆ ధా రం :

కవికోకిల గ్రంథావళి — వ్యాసములు 4.

# 7

# "గత 20 సంవత్సరాల వ్యాసం"

ఆధునిక యుగంలో ఆంధ్ర సారస్వత క్షేత్రంలో ఎందరో మేధావులు, పండితులు, పరిశీలనాదక్షులు, వాద నిపుణులు, భావుకులు వివిధ సాహిత్యప్రక్రియల్ని పంటగా పండిస్తున్నారు. ఈ ఆధునిక ప్రక్రియాదృష్టి, దృక్పథం, ఉద్యమం అన్నవి కొంతవరకు పాశ్చాత్య సంసర్గ ఫలితం అని చాలా మంది అంగీకరిస్తున్నారు. ఇలాంటి సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ వ్యాసం ప్రాచీనమైనదీ విశిష్టమైనదీ అని చెప్పొచ్చు. వ్యాసం అంటే "ఏదేని ఒక విషయమును విరివిగా వ్రాయుట" అని నిఘంటువులు చెప్తున్నాయి. (శబ్దరత్నాకరం)

మన సాహిత్యంలోనే ఈ వ్యాసానికి మూల బీజాలున్నాయని విమర్శకులు, చారిత్రకులు నిరూపించడానికి ప్రయత్నించారు. వివిధ విషయాల్ని సిద్ధాంతీకరించే వాక్యార్థాలు, శాస్త్రార్థాలు, వీటితో ఏర్పడ్డ క్రోడ పత్రాలు ఒక విధంగా వ్యాసరూపాలే అని సిద్ధాంతీకరించారు. విషయ నివేదన, ప్రతిపాదన, వివరణ, ఉపసంహారం వంటి నేటి వ్యాస రూపమంతా అక్రోచ పత్రాల్లో కనిపిస్తుందని విమర్శకులు నిరూపించారు. బీజ రూపంలో ఉన్న ఈ వ్యాసం పాశ్చాత్య భాషా ప్రభావంతో శాఖోపశాఖలుగా అభివృద్ధిపొంది నేటివ్యాసరూపాన్ని ధరించిందనడంలో అనుమానం అణుమాత్రంలేదు.

ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఈ వ్యాస ప్రక్రియ ఫ్రెంచిభాషలో రూపొందింది. దీనికి ప్రయత్నం, కృషి అన్న అర్థాల్నిచ్చే "Essay" అన్నపేరుంది. 16 వ శతాబ్దంలో ఉన్న ఫ్రెంచి రచయిత "మాంటేన్" దీనికి పేరు కల్పించాడు. ఈయన తొలి వ్యాసం 1571 లో వెలువడింది. అదే పేరును ఆంగ్ల రచయిత ఫ్రాన్సిస్ బేకన్ తీసుకుని ఆంగ్ల సాహిత్యంలో ఈ ప్రక్రియను ప్రవేశపెట్టాడు.

18 వ శతాబ్ది ఉత్తరార్ధంలో తక్కిన ఆధునిక ప్రక్రియలన్నిటికన్నాముందుగా తెలుగులో రూపురేఖలు దిద్దుకున్న వ్యాసం ఈనాడు శాఖోపశాఖలుగా విస్తరిల్లి చాలా ప్రాచుర్యాన్ని పొందుతున్నది. ఆధునికాంధ్ర సాహిత్యంలో అనేక ప్రక్రియలకు శ్రీకారం చుట్టిన శ్రీ వీరేశలింగం పంతులుగారు ఈ ప్రక్రియను చేపట్టే కాలానికి

పూర్వమే "ప్రమేయం" "సంగ్రహం" అన్న పేర్లతో ఈ ప్రక్రియ ప్రచారంలో ఉన్నట్లు ఉదాహరణ లున్నాయి. పంతులుగారి కాలానికి ఉపన్యాసం అన్నపదం వ్యాసానికి పర్యాయపదంగా కూడా ఉపయోగింపబడింది. 1852 వ సంవత్సరం నాటి బ్రౌన్స్ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో 'వ్యాసము' అంటే ఇలా ఉంది.

Essay :-n. s(add) is Commonly called in Madras వ్యాసము.

Essayist :- n. s, "he who makes an attempt who writes an Essay, an author, ప్రయత్నము చేసేవాడు, in Madras Commonly called వ్యాసము వ్రాసేవాడు, గ్రంథకర్త" C.P. Brown's English-Telugu Dictionary, Suppliment P P. 380 (1852) అంటే 1852 నాటికి వ్యాసం అన్న పదం ప్రచారంలో ఉందని మనకు తెలుస్తుంది.

కాలంతోపాటు ఏ ప్రక్రియైనా పరిణామాలకు లోనుగాక తప్పదు. తదితర ప్రక్రియల్లాగానే వ్యాస ప్రక్రియలో గూడా మార్పుని స్పష్టంగా చూడొచ్చు. పూర్వ వ్యాసానికీ, ఈనాటి వ్యాసానికీగల అంతరాన్ని పరిశీలిస్తే బోధపడుతుంది.

## పూర్వ వ్యాసం

"సుఖమున్ను సంతోషమున్ను వివాహ స్థితినిన్ని పొందే హక్కు భగవంతుడు స్త్రీ పురుష జాతులకు సమానముగానే కలుగజేసియున్నాడు. గనుక తప్పితమేమీలేనిది అటువంటి హక్కువల్ల నుంచి స్త్రీ జాతిలో కొందరిని తప్పించడమునకు ఎవరికిన్ని న్యాయము ఉన్నట్లు ఎంచేవల్ల లేదు." (సామినేని ముద్దు నరసింహనాయని వారి హిత సూచని పు-223 (1862).

## ఆధునిక వ్యాసం

"సృష్టిలో ప్రతి ప్రాణికి వియోగమేకాని వైధవ్యంలేదు. ప్రతి స్త్రీ చెల్లెలో, అక్కో, కోడలో, అత్తో, అమ్మో. అందరూ నిత్య సువాసినులే-మొగాళ్ళకులేని వైధవ్యం ఆడాళ్ళకు లేదు. ఉండకూడదు. డబ్బెట్టి అడపిల్ల మొగుణ్ని కొనుక్కుని వాడికి ఆ రాస్కెల్‌కి చెప్పుల జోడు దగ్గర్నుంచి తన తండ్రి సొమ్ము వచ్చినెత్తురు కర్చు పెట్టించి ఆ మొగుడితో సుఖంగా సంసారం చేయాలనుకుంటుంది. నిజమే! పచ్చి నెత్తురు తాగే మగాళ్ళతో డబ్బెట్టికొనుక్కున్న సుఖసారం సంసారం. ఆ సంసారంలో మిధ్యా సుఖాన్ని నిజమనుకొని ఆడాళ్ళు గానుగెద్దుల్లా కాపురాలు సాగిస్తుంటారు" (పురాణం సీత-ఇల్లాలి ముచ్చట్లు)

భాషలోనూ, భావ తీవ్రతలోనూ, ఆవేశంలోనూ, పైరెండు వ్యాస భాగాలలో ఎంత అంతరముందో పరిశీలకులకు తెలుస్తుంది.

కాలం పురోగమిస్తున్నది. కాలంతోపాటు వ్యాస ప్రక్రియలో వైవిధ్యం పెరుగుతున్నది. వస్తు వైవిధ్యంలో ఈనాటి వ్యాసం ఊపిరి పోసుకుంటున్నది. ఈనాడు సాహిత్య వ్యాసాలున్నాయి. సంస్కృతీ చరిత్ర వ్యాసాలున్నాయి, భాషా చరిత్ర వ్యాసాలున్నాయి. వైజ్ఞానిక విషయ వ్యాసాలు, వివాద వ్యాసాలు, పత్రికా వ్యాసాలు. సాంఘిక వ్యాసాలు — నిజానికి వ్యాసానికనర్హంకాని విషయమంటూ ఈనాడు లేదు. నాటి నన్నయ మొదలు నేటి నగ్నముని దాకా నడచిన ఉద్యమాల చరిత్రలో ఊపిరి పోసుకుంటున్న ఈ వ్యాసం ఒక విరాట్స్వరూపాన్ని ధరించి మన ముందు నిలుచున్నది.

ఈ వ్యాసాలన్నింటిని రెండు భాగాలుగా విమర్శకులు విభజించారు. సృజన ధర్మంతో ఒప్పేవి - విమర్శనాత్మకమైనవి. సృజన వ్యాసం హృదయ ప్రధానం. విమర్శ వ్యాసం బుద్ధి ప్రధానం. మొదటిది ఆవేశాది హార్దిక గుణాల్ని వ్యక్తం చేస్తూ రచయిత వ్యక్తిత్వం నుంచి పుట్టుకొస్తుంది. రెండవది మనిషిలో ఆలోచనల్ని రేకెత్తిస్తూ విజ్ఞాన విస్తృతికి దోహదం చేస్తుంది. ఒక్క వాక్యంలో చెప్పాలంటే మొదటిది ఆహా అనిపిస్తే రెండవది ఓహో అనిపిస్తుంది!

సృజన వ్యాసాన్ని సృష్టించిన మేధావుల్లో ప్రసిద్ధికెక్కినవారు చాలా మంది ఉన్నారు. చలం, శ్రీశ్రీ, నార్ల, ముని మాణిక్యం, కృష్ణశాస్త్రి, కొడవగంటి, పురాణం సీత, విద్వాన్ విశ్వం వంటి అనేకులతోపాటు విశ్వవిద్యాలయాలలో పనిచేసే మేధావులెందరో తమ సృజన శక్తిని సాహిత్య, సాంఘిక వ్యాసాలకు అంకితం చేస్తున్నారు. విమర్శ వ్యాసరచన కూడా క్రమంగా అభివృద్ధి చెందుతూనేఉంది. విశ్వనాథ, ఖండవల్లి, రాళ్ళపల్లి, డా॥ దివాకర్ల, కాటూరి, కాళోజి, దేవులపల్లి రామానుజారావుగారు, డా॥ బి. రామరాజు, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, జ్వాలాముఖి— భిన్న భిన్న దృక్పథాలు, సిద్ధాంతాలు, ఆలోచనలు, అభిరుచులతో వ్యాసం మరోజన్మ ఎత్తింది.

స్త్రీలు వ్యాస రచనా వ్యాసంగంలో అంతగా అభివృద్ధి సాధించలేదనే చెప్పాలి. స్త్రీ హృదయం శాస్త్రం కంటే సాహిత్యంవైపు, అందునా సృజన సాహిత్యంవైపే ఎక్కువగా మొగ్గు చూపడం సహజం. కనుక స్త్రీల సృష్టి సృజనాత్మకంగానే కనిపిస్తుంది. నవల, కథ మొదలైన ప్రక్రియల్లో పురుషులకంటే స్త్రీలే పైచేయిగాఉన్నట్లు ఈనాడు కొల్లలుగా వచ్చే కథానికలు నవలలే సాక్ష్యం. పరిశోధనాత్మక వ్యాస రచన పట్ల చాలామంది రచయిత్రులు జంకును ప్రదర్శించడం కనిపిస్తుంది. ఉన్నత విద్యావంతులైన కొందరు స్త్రీలు మాత్రమే ఈ ప్రక్రియను సమర్థవంతంగా నిర్వహిస్తున్నారనడం సత్య దూరం కాదు. నిజానికి ఈ వ్యాసరచనా నైపుణ్యం అంత సులభంగా అందరికి అబ్బేది కాదన్నది స్పష్టం. దీన్ని జీర్ణించుకోవడానికి తగినంత వచన రచనానుభవం, పద ప్రయోగపాటవం, విషయ విభాగ నైపుణ్యం, అన్నిటిని మించి వివిధ విషయ పరిజ్ఞానం చాలా అవసరం. సృజనాత్మక వ్యాసరచనలో సిద్ధహస్తులైన స్త్రీలు

కొందరున్నారు. శ్రీమతి ఇల్లిందుల సరస్వతీదేవి, తెన్నేటి హేమలత, శ్రీమతి కె. రామలక్ష్మి ఆరుద్ర, శ్రీమతి మాలతీ చందూర్ లాంటి మహిళామణులు మరెందరో ఉన్నారు. సరస్వతీదేవి చూపిన వెలుగుదారుల్లో డా॥ లత "ఊహాగానపు" ప్రతి ధ్వనులు జాతి ఊపిరి ఉన్నంతకాలం వినిపిస్తూనే ఉంటాయి. శ్రీమతి కె. రామలక్ష్మి గారు విషయాన్ని విశ్లేషించి చూపడంలో సిద్ధహస్తులు. ఈమె వ్యాసాలు స్త్రీల జీవితానికి దారి చూపగల దీపకళికలు. మాలతీ చందూర్ వ్యాసాలు చదివిన వారికి ఆమెకు ఉన్న వివిధ విషయ పరిజ్ఞానం విస్మయాన్ని కలిగించక మానదు.

సాహిత్య రంగంలో, పరిశోధనాత్మకరంగంలో ప్రసిద్ధి పొందిన, పొందుతున్న వదతులు పలువురున్నారు.

డా॥ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు, డా॥ నాయని కృష్ణకుమారిగారు, డా॥ యశోదారెడ్డిగారు — వీరేకాక వివిధ కళాశాలల్లో పనిచేసే అధ్యాపకురాండ్రు పరిశోధనా వ్యాసాలపై దృష్టి ప్రసరింపచేయడం ప్రశంసనీయం.

సృజనాత్మక వ్యాసమైతేనేమి, విమర్శనాత్మక వ్యాసమైతేనేమి-దీర్ఘ సమాస రచన – కుటిల పదప్రయోగం – ఈ జాడ్యం చాలామంది రచయితలను, పండితుల్ని పట్టి పీడిస్తున్నది. శోచనీయమైన విషయమేమిటంటే ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు, వాసిరెడ్డి సీతాదేవిగార్ల నవలలపై వచ్చే విమర్శ వ్యాసాలు కూడా కొన్ని గ్రాంధిక భాషలో రచింపబడ్డాయి. ఈనాటి పాఠకులు శబ్దాడంబరాన్ని గాని, భావ క్లిష్టతను గాని సహించరు. ఆ దీర్ఘ సమాసాల ముళ్ళు విప్పుతూ పోయే తీరికగాని ఓపికగాని వారికి లేదు. వారికి భాషగాని, భావంగాని సూటిగా హృదయానికి తాకాలి. అప్పుడేవారు వ్యాసాన్ని ఆదరిస్తారు.

ఇంకపోతే వాదోపవాద వ్యాసాలున్నాయి. ఇవి భాషాప్రాతిపదికపైన, సాహిత్య ప్రాతిపదికపైన సాగుతూ ఉంటాయి. ఈ వాగ్యుద్ధాలకు మాస, పక్ష, వారపత్రికలు రంగస్థలాలు. అర్జునుడు నల్లనివాడా? తెల్లనివాడా?, అరసున్నా ఆ ప్రక్కనఉండాలా? ఈప్రక్కన ఉండాలా? ఫలానా పదంలో విభక్తిలోపించాలా లేదా? ఫలానాపదం కళా? దృతప్రకృతికమా? ఈవాదోపవాదాల్లో క్రమంగా వ్యక్తిగత కక్షలు చోటుచేసుకోవడం కూడా అప్పుడప్పుడూ కద్దు. ఈ వాదోపవాదాలు మేధస్సును పదును పెట్టుకోవడానికి తప్ప సమాజానికి ఏ విధంగా ఉపయోగపడతాయి ? ఈనాటి సమాజం వాయు వేగ మనోవేగాలతో అన్నిరంగాల్లో పురోగమిస్తున్నది. మనం ఏ మాత్రం ఏమరుపాటు చూపించినా వెనుకబడితే వెనుకనోయ్ అన్నట్లుగా వెనుక పడిపోయే ప్రమాదముంది. ఈనాడు ఆర్థిక సాంఘిక రాజకీయ నైతిక సమస్యల హోరుగాలులు సమాజాన్ని ఉప్పెనలా ఊపేస్తున్నాయి. ఇంకా ఎన్నో సమస్యలు మానవుని మనుగడనే సవాల్

చేస్తున్నాయి. ఇలాంటి సందర్భంలో అరసున్నాలు మానవుని అర్థాకలి తీరుస్తాయా? విభక్తి దేశభక్తిని జాగృతం చేస్తుందా? ఒక్కసారి ఆలోచించాలి. భాషా సాహిత్యాలు జాతి సంస్కృతికి జీవనాడి వంటివి, కాదనలేము. అయితే వాటిని ఆధునిక సామాజిక అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్దగలిగితే వాటికి సార్థకత ఏర్పడుతుంది. ఒకవ్యాసం ఆనందాన్ని కలిగించినా, ఆలోచనల్ని ప్రేరేపించినా అది మాత్రం ఒకమనిషి చుట్టూ పరిభ్రమిస్తూ ఉండాలి. సామాన్యుని వ్యక్తిత్వానికి ప్రాముఖ్యం ఏర్పడుతున్న ఈనాటి సారస్వత ప్రజాస్వామికంలో ఏ ప్రక్రియకైనా సామాన్య వ్యక్తే కేంద్ర స్థానం. కనుక వ్యాసం కూడా వ్యక్తిని సంఘజీవిలా అక్షరాలా పరికించాలి. అభ్యుదయ సామాజిక సిద్ధాంతాల సహాయంతో, సమాజంలోని వాస్తవ పరిస్థితిని విశ్లేషించి, సగటు మానవుని యొక్క తక్షణావసరాల్ని కనిపెట్టి సమాజ పురోగమనానికి బాటల్ని నిర్మించాలి. ఒకనాడు సంఘ సంస్కార దృక్పథమే వీరేశలింగం గురజాడవంటి వారిని మహోన్నతమైన సాహిత్య సృష్టికి పురికొల్పింది. అభ్యుదయ సిద్ధాంతాలకు చారిత్రక దృష్టి-శాస్త్రీయ దృక్పథం -రెండూ రెండు కళ్ళ లాంటివి. అలాంటి సిద్ధాంతాలు ప్రజల్లో వ్యాపించడానికీ, మేధావి వర్గాలను ఆకర్షించడానికి ఈనాడు వ్యాసమే శరణ్యం. మేధావి వర్గానికే పరిమితమైన ఈ వ్యాసం సగటు మానవుని అవగాహనకు అందుబాటులో ఉండే విధంగా రూపొందాలి. అనవసరమైన ఆడంబరతని, దీర్ఘతని అరికట్టి, సరళతను సరసతను శాస్త్రీయ దృక్పథాన్ని తన స్వంతం చేసుకోవాలి.

ఒక మంచి వ్యాసానికి ధ్వనీ,మాధుర్యం తప్పని సరి. అది ధ్వని సమత్వంవల్ల సాధింపబడుతుంది. పదాల సమతూకంవల్ల ఆ వాక్యానికి అందం సమకూరుతుంది. ఉదాహరణకు కృష్ణశాస్త్రిగారి వ్యాస భాగం చూద్దాం.

"అప్రతిహతమైన ఆయన బలమంతా ఆ మానవతలోనే ఉంది. ప్రబుద్ధమైన నవయుగ ప్రజాశక్తి అణువువంటి ఆ అర్భకమూర్తిలో ఇమిడి ఉండి క్రుద్ధ గౌతమిలాగ రుద్ర ప్రభంజనంలాగ, ఆటంకాలన్నింటిని తుడిచిపెట్టి సాగిపోయింది.

(కృష్ణశాస్త్రి వ్యాసావళి)

— ఇలాంటి వాక్యాలలో అక్కడక్కడా కొన్ని శక్తివంతమైన పదాలుంటాయి. అవి ఆ వాక్యాలకు జీవం పోస్తాయి.

చెప్పే పద్ధతిలో అందాన్ని, చమత్కారాన్ని సాధించడం కూడా ఒక ఉత్తమ వ్యాస లక్షణమే.

1) వ్యక్తికి కులమూ, మతమూ, వయస్సు ఉన్నాయి. జనానికి అవేమీలేవు. జననమరణాలు కూడా లేవు - ఇది సాధారణ వాక్యం.

"వ్య_క్తికి కులం వుంది. ప్రజకులేదు. వ్య_క్తికి ఒక మతం ఉంది. జనానికిలేదు. వ్య_క్తికి వయస్సుంది. మందికి లేదు. మందికి జనన మరణాలు లేవు"

(కృష్ణశాస్త్రి వ్యాసావళి)

2) వీరేశలింగం మానవతావాదిగా బ్రతికాడు-సాధారణ వాక్యం.

"స్వర్గద్వారం అంటూ ఉంటే, అక్కడ ఓ ద్వారపాలకుడంటూ ఉంటే మొద టనే "మానవుణ్ణి" అని చెప్పి వీరేశలింగం నమ్మకంగా లోపలికి వెళ్ళిపోయి ఉంటాడు.

3) తాను తలపెట్టిన కార్య సాఫల్యం కోసం పంతులుగారు నిరంతరం శ్రమించే వారు-సాధారణ వాక్యం.

"భయంకరమైన, తీవ్రాతి తీవ్రమైన ఆకార్యోత్సవంలో ఆయనకు మరణించ డానికి తీరిక లేకపోయింది" -

చెప్పే పద్ధతినిబట్టి వాక్యం ఎలాంటి చమత్కారాన్ని,సజీవత్వాన్ని సాధించిందో పై వాక్యాలు నిరూపిస్తున్నాయి.

కనుక ఒక ఉత్తమ వ్యాసానికుండవలసిన గుణాల్ని ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.

1) చెప్పే విధానంలో ఒక విలక్షణత, అందం రూపొందించడం.
2) వాక్యంలో అక్కడక్కడా కొంత చమత్కారం సాధించడం.
3) వాక్యానికి జీవం పోసే శక్తివంతమైన పదజాలం వాడడం.
4) సరళమైన సరసమైన భాషను ప్రయోగించడం.
5) భావసారళ్యంపట్ల శ్రద్ధ చూపడం.
6) నిరర్థక పదజాలాన్ని పరిహరించి పదాల్లో పొదుపు పాటించడం.
7) సమతూకం గల పదజాలాన్ని వాడడం.
8) ధ్వనిమాధుర్యం పట్ల శ్రద్ధ వహించడం.
9) వ్యాస ఉపక్రమణము, విషయ విభాగము, ఉపసంహారము ఒకక్రమంలో తీర్చిదిద్దబడడం.
10) దీర్ఘతని అరికట్టడం.

అప్పుడే వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. పాఠకులకు ఆసక్తి పెరుగుతుంది.

## ఆ ధా ర గ్ర ం థా లు

1) వీరేశలింగం — సమగ్ర పరిశీలన.
2) కృష్ణశాస్త్రి వ్యాసావళి.
3) తెలుగు వ్యాసంలో పరిణామాలు.

డా॥ కొలకలూరి ఇనాక్.

# 8

# "రచయిత్రుల నవలల్లో శాస్త్రీయ దృక్పథం"

"శాస్త్రము"అంటే ఒక విషయానికి సంబంధించిన విజ్ఞానరాశి అని చెప్పొచ్చు. అది వ్యవస్థీకృతమైన పరిశీలనవల్ల, అనుభవంవల్ల, విశ్లేషించడంవల్ల ఏకీకృతమైన మొత్తంగా రూపొందుతుంది. కనుక క్రమబద్ధమైన విజ్ఞాన సమ్మేళన దృష్టినే శాస్త్రీయ దృక్పథంగా శాస్త్రజ్ఞులు భావిస్తారు.

సమాజ శాస్త్రంకూడా సాంఘిక సత్యాన్వేషణలో పై పద్ధతుల్నే అలంబిస్తుంది. సంఘటనకు కారణమైన సూత్రాల్ని కనుగొనడం, అనుభవంవల్ల వాటిని గ్రహించడం, సూత్రాల ద్వారా సంఘటనల అంతర్యాన్ని గ్రహించి, అటువంటి పరిణామానికి మూల మైన ప్రకృతి లక్షణాల ద్వారా వస్తువుల తత్వాన్ని అవగాహన చేసుకోవడం-ఒక సమాజ శాస్త్ర పరిశీలకుని ధ్యేయమని మెర్సియర్ అనే శాస్త్రజ్ఞుడు సూచించాడు.

ఈ శాస్త్రీయ విధానం కొన్ని భాగాలుగా విభజింపబడింది.

1] ఏదైనా ఒక లక్ష్యాన్ని సాధించాలీ అంటే ఆ పనిని ప్రణాళికాబద్ధంగా యోచించి, ఆ సమస్యయొక్క స్వరూప స్వభావాన్ని పరిశీలించడంతోపాటు వానిలోని లోటు పాట్లను బాగా ఆకళింపు చేసుకోవాలి.

2] సమస్యను బాగా పరిశీలించిన తరువాత దానికి సంబంధించిన విషయా లన్నింటిని బాగా అవగాహన చేసుకొని జీర్ణించుకోవాలి.

3] అవగాహన అనంతరం ఆ సమస్యకు సంబంధించిన సంఘటనలలోని సత్యాన్ని, అంశాల్ని సేకరించి వాటిని వర్గీకరించి క్రోడీకరించాలి. ఈ విధానంవల్ల సమస్యల్ని ఒక క్రమగతిలో అర్థం చేసుకోవడానికి అవకాశం కలుగుతుంది.

4] సేకరించిన అంశాల నుండి విషయాన్ని గ్రహించి కొన్ని నిర్ణయాల క్రింద వివరించడానికి ఈ వర్గీకరణ సహాయపడుంది. ఈ వివరణమే ఒక ఊహా నిర్ణయానికి పునాది ఏర్పరుస్తుంది.

5] పైవిధంగా రూపొందిన పరికల్పనను యదార్ధ స్థితులలో నిరూపణం చేసి దాన్ని అంగీకరించడమో లేదా త్రోసి పుచ్చడమో జరుగుతుంది. దీనివల్ల సత్యాన్వేషణ సులభ సాధ్యమౌతుంది.

6] చివరగా, తేలిన సత్యాలననుసరించి, ఇకముందు జరుగబోయే విషయాలను గురించి, వాటి స్థితిగతుల గురించి ఊహించి ఒక నిర్ణయానికి రావచ్చు—ఒక సామాజిక శాస్త్రజ్ఞుని పరిశీలనా క్రమం పైవిధంగా ఉంటుంది.

అయితే సాహిత్యం సమాజంలో ఒక అంతర్భాగమనీ, ఆ సమాజానికి దేశ కాల పరిస్థితుల కనుగుణంగా సాహిత్యం అద్దం పడుతుందని మన మంగీకరించినప్పుడు ఒక సామాజిక పరిశీలకుడు ఎప్పటికప్పుడు నిగ్గు తేల్చిన సామాజిక సత్యాలను ఒక రచయిత కళాత్మకంగా రూపొందిస్తాడనడంలో విప్రతిపత్తి ఉండబోదు. తన రచనా శైలిచేత, శిల్పంచేత భాషచేత ఆ సత్యాలను రసగుళికలుగా మార్చి మనచేత మింగిస్తాడు. అవసరమయితే ఆ సమస్యలకు పరిష్కారమార్గాల్ని కూడా సూచిస్తాడు. ఉత్తమ రచన యొక్క ధ్యేయం ఇదే.

ప్రస్తుతం రచయిత్రుల రచనల్లో శాస్త్రీయ దృక్పథం అన్న అంశం గురించి పరిశీలిద్దాం. ఆ వెలుగులో స్త్రీల రచనల్లో సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక జీవన విధానంపట్ల వారి అవగాహన ఏ స్థాయిలో ఉందో పరిశీలించడమే ఈ ప్రసంగ వ్యాసం యొక్క ఉద్దేశం.

ఇది నవలల యుగం, నవలా యుగం కూడ. ఆధునిక మహిళలు భారత దేశ చరిత్రను తిరిగి రచిస్తారని అర్ధ శతాబ్ది క్రిందటే గురజాడ ప్రకటించాడు. ఏ రంగంలోనూ అంతగా ఆసక్తి కనబరచని ఆధునిక మహిళ రచనా వ్యాసంగంలో అందునా నవలా రచనపై దాదాపు గుత్తాధిపత్యాన్ని ప్రకటించడం నిజంగా హర్ష దాయకమైన అంశం. తెలుగు నవలా పరిణామదశల్లో స్వాతంత్ర్యానంతర దశకు అత్యంత ప్రాముఖ్యముంది. స్వాతంత్ర్యానంతరం స్త్రీలలో అక్షరాస్యత పెరిగింది. తమ సమస్యల గురించి తాము ఆలోచించుకోగల చైతన్యత పెరగడంతో చాకలి పద్దులు వ్రాయగలిగితే చాలు అన్న స్థాయి నుండి కలం పట్టి తమ భావాలకొక రూప కల్పన చేయగల స్థితికి ఎదగడం ప్రశంసనీయమైన విషయంగా మనం భావించాలి. అయితే రచయిత్రులపై రెండు అభియోగాలున్నాయి. ఈ రచయిత్రులు ఒక చేత్తో పకోడీలువేస్తూ మరో చేత్తో నవలలు వ్రాస్తున్నారన్నది ఒకటి. కొంత అక్షరజ్ఞానం అబ్బి, కాగితం, ఇంకు, కాస్త తీరిక ఉన్న రచయిత్రులు కార్ఖానాలే తెరచి భారీ యెత్తున రాశి తప్ప వాసిలేని నవలల్ని ఉత్పత్తి చేస్తున్నారన్నది రెండవ అభియోగం. ఇది పూర్తిగా సత్యదూరమని చెప్పలేము. అంత మాత్రంచేత దాన్ని అందరికీ వర్తింప చేయడం కూడా భావ్యంకాదు.

ఈ దశాబ్ది కాలంలో వచ్చిన రచయిత్రుల రచనల్ని రెండు వర్గాలుగా విభజించొచ్చు- ఏ మాత్రం జీవితంపట్ల శాస్త్రీయ అవగాహన లేకుండా సమస్యలకు దూరంగా కాలక్షేపం కోసమో, వినోదం కోసమో ఉద్దిష్టమైనవి మొదటి రకం. ఇవి మానవ అనుభవ పరంపరను పై పైన మాత్రం స్పృశిస్తూ తాత్కాలికంగా జీవిత సమస్యల నుండి తప్పుకోవడానికి, మరిచిపోవడానికి అతి నేర్పుగా వ్రాయబడతాయి. ఇక రెండవ రకం. ఇవి మన జీవితం గురించిన అవగాహనను విస్తృతం చేసి అనుభవాల లోతుల్ని స్పృశిస్తూ నిశితంగా మన చేత ఆలోచింప చేస్తాయి. ఇందులో సమస్య — సంఘర్షణ — పరిష్కారం అనేవి రచయిత్రి దృక్పథాన్ని బట్టి ఒక క్రమంలో తీర్చబడి ఉంటాయి.

ఈ నాడు నవలలు వివిధ సమస్యల్ని చిత్రిస్తున్నాయి. నిరుద్యోగ సమస్య, ఒక మధ్య తరగతి లేదా క్రింది తరగతుల్లో చెలరేగే ఆర్థిక సంక్షోభం, గ్రామపెత్తందార్ల నిరంకుశ ప్రవర్తనకు బలై పోతున్న పేద రైతాంగం ఒకవైపు- ఆకాశాన్నంటుతున్న ధరలకూ, చాలీ చాలని జీతాలకు సమన్వయం కుదరక సతమతమౌతున్న సగటు ఉద్యోగి ఉదంతం — మరోకవైపు నల్లబజారులో లక్షలకు లక్షలు లాభాలు గడిస్తూ దేశాన్ని దోచుకుంటున్న సంఘ విద్రోహక శక్తులు, సాంప్రదాయపు ఇనుప చట్రాలలో బంధింపబడి బాధపడుతున్న స్త్రీలు—ఉత్తమ ప్రమాణాలు గల రచనకు పైవన్నీ ముడి పదార్థాలు. కనుక ఒక సమస్యను సమస్యగా చిత్రించడంవేరు. వాటి మౌలిక కారణాల్ని శోధించి ఆ సమస్యకు సజీవమైన అనుభవాలు ఆధారంగా పరిష్కార మార్గాల్ని సూచించడంవేరు. ఎంతో ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిజ్ఞానముంటేనే కాని ఒక రచయిత్రికి ఇది సాధ్యంకాదు. అలాంటి పరిజ్ఞానం కలగడానికి రచయితలకున్న అవకాశాలు రచయిత్రులకు లేవన్న సత్యాన్ని కూడా మనం గుర్తుంచుకోవాలి. దానికితోడు కొందరికి వ్రాయడమే కాని చదివే ఓపిక ఉన్నట్లు కనిపించదు. అదే పనిగా చదివే వారికి వ్రాసే ఓపిక ఉండదు!

జీవితంపట్ల శాస్త్రీయ అవగాహనలేని కొన్ని నవలల్ని చదివితే కొన్ని విషయాలు మనకు బోధపడతాయి.

1. కష్టాలకూ, పూర్వజన్మ పాపాలకూ ముడిపెట్టే అవి చదవడం మన ఖర్మ అనిపించేటట్లుంటాయి. ఇలాంటి రచనలు జీవితంపట్ల ఉదాసీన వైఖరిని పెంపొందిస్తాయనడంలో అనుమానంలేదు.

2. సమస్యల పరిష్కారానికి భక్తిని అడ్డంగా పెట్టి, కథను అష్టవంకర్లు తిప్పి ఆ ఏడుకొండలవాడే నాచేత వ్రాయించాడని చివరకు నీళ్ల నమలడం.

3. కొన్ని నవలల్లో ధనికవర్గ జీవన విధానంపట్ల రచయిత్రుల మనసుల్లో పేరుకొని పోయిన మానసిక బానిసత్వం స్పష్టంగా కనిపిస్తుంది.

4. ప్రేమ — విరహం, ప్రేమ త్యాగం మొదలైన సెంటిమెంట్లుతో నిండినవి కొన్ని. ప్రేమ అన్నది జీవితంలో ఒక భాగమేననీ, ప్రేమే జీవితం కాదని గుర్తించకపోవడంవల్ల కలిగే పరిణామమిది.

5. సహనము, త్యాగము, మంచితనం అన్న ముసుగువేసి స్త్రీ పాత్రల్ని వ్యక్తిత్వం లేని మర బొమ్మలుగా సృష్టించి అదే శాంతియుత జీవనంగా ప్రచారం చేసే నవలలు కొన్ని. నిజానికి అలాంటి శాంతి నిజమైన శాంతికాదు. స్మశాన శాంతి. చైతన్యం ఎప్పుడూ సంఘర్షణకు తావిస్తుంది. ఆ సంఘర్షణ నుండి పుట్టిన సమన్వయ మార్గమే పురోగతికి పునాదుల్ని ఏర్పరుస్తుందని చాలా మంది గ్రహించకపోవడంవల్ల ఇలాంటి నవలలు సృష్టింపబడుతున్నాయి.

6. వాస్తవ చిత్రీకరణం అన్న పేరుతో అసందర్భపు వివరాలలోకి వెళ్ళి పేజీల సంఖ్య పెంచడం రచయిత్రుల అపరిపక్వతను సూచిస్తుంది. కథాశిల్పాన్ని దెబ్బతీసే ఈ వివరాలు రచయిత్రుల నవలల్లోనే ఎక్కువగా కనిపిస్తాయి.

ఉదాహరణకు :—"ప్రకాశ్ ప్రొద్దున్నే లేచి పళ్ళు తోముకున్నాడు, వెంటనే బాత్‌రూమ్‌లో దూరి సబ్బు రాసుకొని హాయిగా స్నానం చేశాడు. డైనింగ్ టేబుల్ మీద అన్నం పొగలు కక్కుతోంది. భోజనానికి కూర్చున్నాడు. కమల వడ్డిస్తూంటే ఆవురావుమని భోంచేశాడు. బూట్లు వేసుకొని టకటకలాడించుకుంటూ ఆఫీసుకు వెళ్ళాడు." నిజానికి బాత్‌రూములో దూరినవాడు సబ్బు రాసుకొని స్నానం చేయక ఏం చేస్తాడు ? ఆఫీసుకు వెళ్ళవలసినవాడు అన్నంతినక తప్పదుకదా !

7. చాలా మంది రచయిత్రుల నవలల్లో రాజకీయ అవగాహన దాదాపు మృగ్యం. రాజకీయాలంటే అవేవో మనకు సంబంధించినవికావు అన్న తప్పుడు అభిప్రాయమే దీనికి కారణం కావచ్చు. నిజానికి ఈ నాడు మన చుట్టూ ఉన్న ఆర్థిక సమస్యలన్నీ రాజకీయ సమస్యలతో ముడిపడి ఉన్నాయి. రాజకీయాలకు దూరంగా మడికట్టుకుని కూర్చోవడమంటే నిత్య జీవిత సమస్యల నుంచి పారిపోవడమన్నమాట మరువరాదు.

కనుక ఏనాడయితే రచయిత్రులు తమ వ్యక్తిగత విశ్వాసాలను సామాజిక విశ్వాసాలుగా వక్రీకరించడం మానుకుంటారో, ఏనాడయితే వ్యక్తుల వ్యక్తిగత సమస్యల్ని చిత్రించడం మానివేసి సమాజంలో అత్యధిక సంఖ్యాకులైన ప్రజల సమస్యల్నే నిజమైన సమస్యలుగా భావిస్తారో అనాడే ఉత్తమ నవలలు సృష్టింపబడతాయి.

ఇకపోతే వాస్తవికతను ప్రతిబింబించే కొన్ని రచనల్ని పరిశీలిద్దాం. వాస్తవిక దృష్టితో, సామాజిక స్పృహతో, శాస్త్రీయ అవగాహనతో మంచి రచనల్ని మనకు

అందిస్తున్న ప్రతిభావంతులైన రచయిత్రులూ ఉన్నారు. ఉపనిషత్తులు మొదలు ఉప గ్రహాలవరకూ, వేదాలు మొదలు వేమన శతకం వరకూ, రామాయణం మొదలు రాజకీయాల వరకూ కాచి వడబోసి పుక్కిట పట్టిన విజ్ఞాన ఖనులు రచయిత్రుల్లో లేకపోలేదు. కాని అలాంటి వారిని వేళ్ళమీద లెక్క పెట్టొచ్చు.

ఒకనాడు తన ఊహాగానంతో ఆంధ్ర పాఠకుల్ని ఉర్రూతలూగించిన రచయిత్రి డా॥ తెన్నేటి హేమలత. అర్ధ శతాధిక రచనల్నిచేసి "లత సాహిత్యం" అన్న పేరుతో ఒక సాహిత్య శాఖకే శ్రీకారం చుట్టిన గౌరవం ఈమెకు దక్కింది. అంతేకాదు విశ్వ విద్యాలయాలలో ఈమె సాహిత్యం పరిశోధనాంశంగా పరిగణింప బడిందికూడ. ఈమె ఒక మానవతావాది. "మమత, మానవత, ప్రేమ, పాతివ్రత్యం ఆ యా కాలాల మానసిక స్పందన మాత్రమే — లేచిపోయిన మనిషినీ, రాలి పోయిన పూవునీ సానుభూతితో చూడడం మన కనీస ధర్మం అంటుందీమె. నేటి సమాజంలోని అమానుషత్వాన్ని పాఠకుల ముందుంచి, ఈ పరిస్థితికి కారణం ఎవరు ? అన్న ప్రశ్న ద్వారా పాఠకుల్లో చైతన్యం సృష్టించి భావ విప్లవాన్ని రగిల్చి మానవ త్వాన్ని జాగృతం చేయాలన్నదే ఆమె ఏకైక ధ్యేయం. అంతేకాదు అవినీతిని నిశ్చయంగా చాటి సాంప్రదాయం పేరిట సాగే మౌఢ్యాన్ని బహిర్గతంచేసి పాఠకుల్ని ప్రబోధించడం ఈమె లక్ష్యంగా కనిపిస్తుంది. ఈమె విషయంలో విప్లవమంటే భావ విప్లవమే. ఏ విప్లవమైనా ముందుగా భావంలో పుట్టేదే అంటారీమె. సాహిత్యంలో సంఘం యొక్క యధా స్వరూపాన్ని నిర్భయంగా చాటి తద్వారా పాఠకుల యొక్క అంతఃకరణాల్లో ఆత్మస్థైర్యాన్ని కలిగించి సమాజాన్ని మార్చాలి అని ఈమె ఉద్దేశం. ఈ విషయంలో (John- deway) యొక్క ప్రభావం ఈమెపై బాగా కనిపిస్తుంది. వ్యవస్థలో మార్పు తీసుకొనిరాగల ఒకే ఒక మార్గం మనిషి అంతఃకరణాన్ని నిర్మలం చేసుకోవడమే. ఇది సాధించగలిగినప్పుడు వ్యవస్థలో మార్పు దానంతటదే వస్తుంది అంటారాయన.

ఫ్రాయిడ్ సిద్ధాంత వ్యాఖ్యాతలున్న స్త్రీ పురుష సంబంధమైన విషయాలే చలం నవలల్లో కధావస్తువన్నది సువిదితమే. స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛ అవసరం, అందునా అస్వతంత్రురాలుగా ఉన్న స్త్రీకి స్వేచ్ఛ మరింత అవసరమని భావించి భావ విప్లవాత్మక రచనలుచేసిన చలం, ఈ స్వేచ్ఛకు అవరోధమైన ఏ సాంప్రదాయాన్నయినా ఏ వ్యవస్థనైనా వివాహవ్యవస్థనైనా సరే సమూలంగా నిర్మూలించాలనే చలానికి వారసురాలుగా లతను చాలామంది పరిగణిస్తారు. సూక్ష్మంగా పరిశీలిస్తే చలం లాగా ఈమె తీవ్ర వాది కాదని ఖచ్చితంగా చెప్పొచ్చు. దీపకళికలో అంటుంది "స్త్రీ పురు షుల మధ్య ఆకర్షణ సహజం. ఆకర్షణ జ్వలిస్తున్న దీపకళిక లాంటిది. దాన్ని ఆర్పి వేస్తే ప్రపంచగమనమే ఆగిపోవచ్చు. విశృంఖలంగా పెంపొందించుకుంటే అందులో పడి మనమే కాలిపోవచ్చు. ఈ ఒక్క ప్రకటన చాలు ఆమె తీవ్రవాది కాదని నిరూ

పెంచడానికి. "నానవలల్లో అవసరాన్ని మించిన Sex ఉండదు. ఎవరి పువ్వులులాంటి నవలల్లో మోతాదుకు మించి కనిపించినా ఆ చిత్రణ సందర్భోచితమే కాని పని కట్టుకుని కల్పించింది కాదు" అంటారీమె. "తిండిలేక కడుపు నింపుకోవడానికి వ్యభిచరించే స్త్రీని చూచి సానుభూతి చూపగలను. కాని విలాసం కోసం నాగరకతపేరుతో చేసే వ్యభిచారాన్ని నేను సహించను" అంటారీమె.

ఒక వ్యక్తిగా లతలోవున్న ఆవేశం, భావప్రకటనలో పొందే ఉద్వేగం ఆమెలోని రచయిత్రిని, కళాకారిణిని అధిగమించేటట్లు చేస్తున్నాయనీ, ఈ ఆవేశమే లతను పరస్పర వ్యతిరేక సిద్ధాంత ప్రతిపాదకురాలనే విమర్శకు గురి చేస్తున్నాయని విమర్శకుల అభిప్రాయం. స్త్రీలోని పవిత్రత పాతివ్రత్యం ఆమెను రక్షించి ఆమెను దేవతా స్వరూపిణిని చేస్తాయి అంటూనే మరొకచోట పాతివ్రత్యం అనేది స్త్రీకి ప్రతి బంధకం కాకూడదు అంటుంది. ఇలాంటి పరస్పర విరుద్ధ ప్రకటనలు మనకు అక్కడక్కడా కనుపించినా శక్తివంతమైన కలం లతది అని చెప్పక తప్పదు.

"శరీరంకంటె మనసు, సంఘంకంటె వ్యక్తి అధికుడు" అంటుందీమె. ఈ విధమైన వ్యక్తి ఆధిపత్యం కేవలం అశాస్త్రీయం, ఊహాజనితం. సామాజిక శాస్త్రం ప్రకారం వ్యక్తి ఎప్పుడూ సంఘంకంటె అధికుడు కాడు. జీవన పరంపరలో ఒక వ్యక్తి మొదలు కాని తుది కాని కానేరదు. అతడు ఆ సంఘం అనే గొలుసులో ఒక పూస మాత్రమే. వ్యక్తి అధికృత ఎప్పుడు కూడా దోపిడీ వ్యవస్థకు దోహదం చేస్తుంది. పెట్టుబడదారీ వ్యవస్థకు దోహదం చేస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థను పెంచుతుంది. వ్యక్తియొక్క అంతఃకరణం అంత సులభంగా మారుతుందని నేననుకోను. ఒక అతీతమైన వత్తిడికి అంటే "సూపర్ ఇంపోజిషన్"కు లోనయినప్పుడే మనస్తత్వం మారడానికవకాశముంది. కనుక హృదయ పరివర్తనలు అంతఃకరణ నిర్మాల్యాలు కేవలం వ్యక్తిగతం. కనుక ఇవి మౌలికంగా సమాజాన్ని మార్చగలిగే ప్రజా పోరాటాలకు ఏమాత్రం సహకరించవు.

ఒక్కొక్కమారు ఈమె హేతుబద్ధకంగా కూడా ఆలోచిస్తుంది. "ప్రస్తుత సాంఘిక జీవనం ఆదరణ, ప్రేమ, మమత—వీటిమీద ఆధారపడిలేదు. దీని వేర్లూ, కొమ్మలూ, కాండమూ అన్నీకూడా డబ్బుతోనే పెగిరిచిగిరిస్తున్నాయి" "ఇద్దరు భార్యల భర్త పవిత్రుడు. ఇద్దరు భర్తల భార్య పతిత. ఈలోకంలోని న్యాయ సూత్రాలు ఈ తీరుగా అఘోరించినయ్" (నీహారిక).

ఇకపోతే రాజకీయంగా శాస్త్రీయ దృక్పధాన్ని చాటి చెప్పిన నవల వాసిరెడ్డి సీతాదేవిగారి "మరీచిక" దీనిపై గతప్రభుత్వం తీసుకున్న నిషేధపు చర్య అటు మేధావివర్గంలోనూ, ఇటు సామాన్య పాఠకలోకంలోనూ గొప్ప సంచలనాన్ని, ఔత్సుక్యాన్ని కలిగించింది. అంతకు పూర్వం మరీచిక పేరు వినని పాఠకులు కూడా దాన్ని

కొని చదవడం వల్ల నగ్జలిస్టు ఉద్యమం యొక్క వైఖరి, దాని యొక్క సంపూర్ణ మైన అవగాహన పాఠకుల్లో కలగడానికి అవకాశం లభించింది. ఇందులోని కథ చాలా సూక్ష్మం. రెండు సంపన్న నాగరక కుటుంబాలకు చెందిన ఇద్దరు స్నేహితులైన విద్యార్థినులు శబరి-జ్యోతి-ఒకరు హిప్పీ సంస్కృతీ విషవలయంలో చిక్కుకొని ఆహుతి కాగా, మరొకరు విప్లవాత్మక భావాలకులోనై నగ్జలైటు ఉద్యమం చేత ప్రేరణ చెంది తన గమ్యాన్ని ఆ వైపుగా నిర్ణయించుకుంటుంది ఈ నవల ద్వారా రచయిత్రి నగ్జలైటు ఉద్యమంపట్ల ఒక శాస్త్రీయమైన అవగాహనను కల్పించడమే కాదు, హిప్పీ సంస్కృతిపట్ల ఒక హేయమైన భావాన్ని యువతలో కలిగించడానికి ప్రయత్నించి సఫలీకృతులైనారు. శాస్త్రీయ సోషలిజాన్ని గూర్చి, మార్క్సిస్టు సిద్ధాంతాల గూర్చి కూడా సరియైన దృక్పథం కలిగించడానికి నవల దోహదం చేసింది. ఒక సందర్భంలో రచయిత్రి ఇలా అంటారు. "సోషలిస్టు వ్యవస్థలోనే శాస్త్రీయజ్ఞానం సాధ్యమౌతుంది. అంతవరకు ప్రజల్లో పాతుకొని పోయిన పుక్కిటి పురాణాలు,కథలు మూఢ సాంప్రదాయాలు, మూఢ నమ్మకాలు, దురాచారాలు, దురలవాట్లు, దేవుడు, దయ్యం, కులం, మతం—ఇవన్నీ ఫ్యూడల్ వ్యవస్థలోని, ముఖ్యంగా ధన స్వామ్య వ్యవస్థలోని అవకతవకలు. వీటిని తొలగించడానికి శాస్త్రీయ సోషలిజం ఒక్కటే ఏకైక శరణ్యం" అంటారామె.

పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క స్వరూప స్వభావాల్ని, అది పెంచే అవినీతిని స్పష్టంగా చాటారీమె. "అవినీతిని పెంచే వ్యవస్థలో నీతిని స్థాపించాలనుకోవటం అసంభవమని ప్రతి మార్క్సిస్టుకూ తెలుసు. అంతేకాదు మార్కెట్‌పై పెట్టుబడిదారులు గుత్తాధిపత్యం చేస్తున్నప్పుడు ప్రభుత్వరంగంలోని ఉత్పత్తులు కూడా వారి దోపిడీకే దోహదం చేస్తాయి. కనుక పెట్టుబడిదారీ వ్యవస్థ కూకటివేర్లతో కూలిపోయినప్పుడు మాత్రమే సామాన్యుడికి మేలు కలుగుతుంది" అంటారీమె. ఇందిరా ప్రభుత్వం తలపెట్టిన భూసంస్కరణల వైఫల్యాన్ని అతిధైర్యంగా విమర్శించడంతో పాటు, శాస్త్రీయ సోషలిజం స్థాపనకు గమ్యాన్ని సూచించిన ఈ రచయిత్రి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల సాహిత్యాన్ని కూలంకషంగా అధ్యయనం చేసినట్లుగా మనకు కనిపిస్తుంది.

రోగగ్రస్తమై కుళ్ళిపోయిన ఈ వ్యవస్థను నామ రూపాలు లేకుండా చేసి నవరక్తంతో తొణికిసలాడే నవసమాజాన్ని నిర్మించాలంటేపోరాటం అనివార్యమే. కాని దాని కొక పరిపక్వదశ రానిదే, ప్రజాపోరాట బీజాలుమొలకెత్తి పెరిగి, మహావృక్షమై ఫలించకముందే తుపాకులుపట్టి విచక్షణారహితంగా వర్గశత్రువులుగా భావించబడుతున్న భూస్వాముల్ని హతమార్చడంవల్ల ప్రయోజనంలేదు అన్న ఒక చారిత్రక సత్యాన్ని ఒక భూస్వామి నోటనే పలికించడం ఒక విశేషం. చంపబడ్డ భూస్వామి భూషయ్య మొండెం జ్యోతితో ఇలా అంటుంది. "నువ్వు నన్ను ఇలా చంపలేవు

బుల్లెమ్మా! నా వేర్లు మూడు వేల సంవత్సరాల నాగరకత లోతుల్లో కూరుకొని ఉన్నాయి. నా వర్గం ఈ సమాజాన్ని పెంచి, పోషించి కుక్కలా తనచుట్టూ తిప్పు కుంటుంది. ఈ సమాజంలో నాలాంటి వాళ్ల ఆకులు, రెమ్మలు, పిలకలు మాత్రమే. పిల్లగాలులు వీచినా పిలకల్ని తెంపినా మహావృక్షం విరిగిపడిపోదు. ఆకులు దూస్తే ఈ వృక్షం కూకటి వేర్లతో కూలిపోదు. నన్ను చంపావ్. బాగానే వుంది. నా కొడుకు ఇంకా బ్రతికే ఉన్నాడు. వాడి కొడుకు బ్రతికే ఉన్నాడు. నా భూమి నాకే ఉంది. మీ ప్రజలు మా మత్తులో ఉన్నంతకాలం, గింజలకోసం, కూలి డబ్బుల కోసం నా మీద ఆధారపడినంతకాలం నీవు నన్నేమీ చేయలేవు. ఈ మహావృక్షం పెల్లగిల్లాలంటే పెను గాలి వీచాలి. పెద్దగాలివాన రావాలి లేదా ఉప్పెన ఉవ్వెత్తున లేవాలి. అగ్నిపర్వతాలు బద్దలు కావాలి."

భూషయ్య చెప్పినట్లు పెనుగాలిలాగా ప్రజల్లో చైతన్యం పొంగి పొరలిననాడు, ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క నాయకుడై ప్రజాపోరాటాలు నడిపిన్నాడు ఈవ్యవస్థ మారుతుంది. కనువిప్పు కలిగిన దళనాయకుడు సత్యం కూడా ఈ సత్యాన్ని అంగీక రించి జ్యోతితో ఇలా అంటాడు. "చెట్లమధ్య నుంచి గుట్టల మధ్యనుంచి చైతన్య స్వరూపులైన మనుష్యులవద్దకు వెళ్ళు. వాళ్ళలో ఒకరిగా తిరుగుతూ, వాళ్ళమధ్య బ్రతుకుతూ పీడిత ప్రజల్లో విప్లవ చైతన్యాన్ని రగుల్కొల్పు. అందునుంచే వర్గ పోరాటం ఉద్భవిస్తుంది. ఆ వర్గ పోరాటమే సాయుధ పోరాటానికి మార్గాన్ని మలు స్తుంది."—రచయిత్రి ఆలోచనా స్రవంతి యొక్క గమ్యమిది. ఈ నవలని ఆధారం చేసుకొని రచయిత్రి నక్సలైట్ల కార్యకలాపాల్ని, వారి ఉద్యమ స్వరూపాన్ని, రహస్య జీవితాన్ని కోడ్ భాషను. క్రమశిక్షణను చాలా సమర్థవంతంగా చిత్రించారు. ఈ నవల చదివిన ప్రతి పాఠకుడికి నైజాంపాలనకు వ్యతిరేకంగా తెలంగాణాలోఉవ్వెత్తుగా లేచిన ప్రజాపోరాట ఛాయలు మనసులో మెదలక వదలవు.

ఈ నవల సృష్టించిన మరో ప్రపంచం హిప్పీల ప్రపంచం. ఇది పైన వర్ణిం చిన ఉద్యమంలాగా ముళ్ళబాట కాదు. రంగుల రంగుల స్వప్నప్రపంచం. ఈ సమా జంలోని రొటీన్ జీవితం నుంచి, హిపొక్రసీనుంచి పలాయన వాదం వరించి, మార్జు వానా, హిరాయిన్‌లాంటి ప్రమాదకరమైన మత్తు మందులకు బానిసలై స్వప్న జగత్తు లోనే ఎల్ల వేళలా విహరించాలని కోరుకుంటారు వీరు. ఆదర్శరహితమైన జీవితమే వీరికి ఆదర్శప్రాయం. వాస్తవికతకి దూరంగా పలాయనాన్ని చిత్తగించి రంగుల స్వప్న జగత్తులో విహరించడం కాదు జీవితమంటే, సమస్యల్ని ఎప్పటికప్పుడు ధైర్యంగా ఎదుర్కొంటూ తమ చదువునీ తెలివితేటల్నీ వినియోగించి సమాజాన్ని చైతన్యవంతంగా తీర్చిదిద్దే బాధ్యత యువతది అన్న భావాన్ని పరోక్షంగా రచ యిత్రి చాటినట్లు స్పష్టంగా తెలుస్తుంది.

మరీచిక అన్న పదంలోనే రచయిత్రి నగ్జలైట్ ఉద్యమంపట్ల తనపై ఖరి ప్రకటించారు. ఆదర్శం మంచిదైనా దాన్ని చేరుకోవడంలో అనుసరించే పద్ధతిపైనే దాని సత్ఫలితం ఆధారపడి ఉంటుంది. లేకపోతే ఆ ఆదర్శం ఎండమావిలాంటిదే ఔతుంది. ప్రజాభిప్రాయమే ఒక రచనకు ఊపిరిగా ఉండాలి. తప్పుడు త్రోవలో నడుస్తున్న ఒక ఉద్యమానికి హెచ్చరికగా రచనలో తన అభిప్రాయాన్ని పొందుపరచడమే ఒక నేరమైతే, ఒక ఉద్యమానికి ఒక శాస్త్రీయ దృక్పథంతో గమ్యాన్ని నిర్దేశించడమే దోషమైతే, ఈ వ్యవస్థలో ప్రజాభిప్రాయానికి చోటులేదని మనం భావించవలసి ఉంటుంది.

సీతాదేవిగారి మట్టిమనిషి కూడా ఒక చారిత్రక అవగాహనతో వ్రాయబడిన నవల. ఒక ఫ్యూడల్ వ్యవస్థ నంటిపెట్టుకొని వున్న అనేక అవలక్షణాలను చిత్రించడంతోపాటు శిధిలమైపోతున్న ఫ్యూడల్ భవనపు గోడల్లో ధ్వనించే అపస్వరాల్ని స్పష్టంగా వినిపించారు. Neo-Rich వర్గ స్వభావాన్ని చాటి చెప్పారు.

ఇకపోతే బలిపీఠం, రామాయణ విష వృక్షంలాంటి గ్రంధాలద్వారా ఒకనాడు ఒక్క వెలుగు వెలిగిన రచయిత్రి రంగనాయకమ్మగారు, మానవుని యొక్క సాంఘిక ఆర్థిక, నైతిక విలువల చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో చిత్రించి కొన్ని చారిత్రక సత్యాలను వెలికి తెచ్చిన ఆమె రామాయణ విషవృక్ష పీఠిక ఒక అద్భుతమైన రచనగా అంగీకరించక తప్పదు. కాని పచ్చకామెర్లు బాగా వంటబట్టిన వ్యక్తికి ప్రపంచమంతా పచ్చగా కనబడినట్లు, హిందువులు పరమ పవిత్రంగా ఎంచుకొంటూ అనుదినం పారాయణ గ్రంధంగా పరిగణిస్తూ తమ సంస్కృతికి ప్రతీకగా నిలుపుకున్న రామాయణాన్ని తన హేతువాద మనే 'వాదర'తో చీల్చిచెండాడి దుయ్యబట్టడం అశాస్త్రీయమూ అనుచితమూ అనక తప్పదు. విషవృక్షంలోని చాలా విషయాలతో నేను ఏకీభవిస్తాను. కాని అధిక సంఖ్యాకులైన ప్రజల చైతన్య స్థాయిని కొలిచి దాని విలువను తూచి వెల కట్టకుండా ఒక్కసారిగా తరతరాల విలువల్ని తారుమారుచేసి ఒక సంచలనాన్ని సృష్టించడమంటే దాన్ని మనం ఒక "లిటరరీ నగ్జలిజమ్" గా భావించొచ్చు. ఇది "పొలిటికల్ నగ్జలిజమ్" కంటే చాలా ప్రమాదకరం. ఈ విషవృక్షం ఎంత సాహసోపేతమైన రచన అంటే నూటికి నూరుపాళ్ళ మార్క్సిస్టు కూడా మతం గురించి, మత గ్రంధాల గురించి ఇంత తీవ్రమైన బహిరంగ ప్రకటనచేయడు. ఒక మార్క్సిస్టు రచయిత ప్రజల చైతన్య స్థాయిని ఎప్పటికప్పుడు అంచనా వేసుకొంటూ దానికి అనుగుణంగా వ్రాస్తూనే క్రమంగా వారి చైతన్య స్థాయిని పెంచడానికి ప్రయత్నించాలి. అంతేకాని పచ్చికాయను పండుగా భ్రమించి ఒత్తిడికి లోనుచేస్తే అది అనుభవ యోగ్యం కాకుండా పోతుంది.

విషవృక్షంలో చూడని సాంఘిక సంయమనం ఒక చిన్న నవల "జానకి విముక్తి"లో ఈమె ప్రదర్శించింది. చెల్లెల్ని అత్తింటివారుపెట్టే బాధల్ని చూచి ఆత్మ నిగ్రహం కోల్పోయిన జానకి అన్న బావను బాది బలవంతంగా ఆమె అభీష్టానికి వ్యతి

లేకంగానే తన వెంట తీసుకొని వెళ్ళడం ఒక Social Naxalism గా భావించవచ్చు. జానకికి భర్తపట్ల ద్వేషం ఇంకా చిగురించలేదు. వారు పెట్టే బాధల్ని ప్రతిఘటించాలన్న పరిపక్వతగాని, చైతన్యం కాని ఆమెలో కలుగలేదు. అట్టిదశలో ఆమె అన్న ఆమెను భర్తపై పోరాటానికి పురికొల్పటం అశాస్త్రీయమే కాదు, నిరర్థకం అని రంగనాయకమ్మ గారి భావం. ఏది ఏమైనా అనుభవమే చైతన్యానికి ప్రథమ సోపానం. ఆ అనుభవ పరంపర ఫలితంగా మానవ సమాజం మార్పువైపు నడుస్తోంది అంటారీమె. భార్యాభర్తల అనుబంధాన్ని కార్మిక - యజమానుల మధ్యగల వర్గపోరాట తత్వంతో సమన్వయపరచి వాటి చెప్పిన ఏకైక రచయిత్రి రంగనాయకమ్మ. మొత్తం మీద ఈమె నవలల్లో మూడు అంశాలు మనకు గోచరిస్తాయి. 1. మత సాంప్రదాయాలు, 2. స్త్రీ పురుష సంబంధాలు, 3. కుటుంబ జీవితం - వీటిపట్ల ఒక విప్లవాత్మకమైన, శాస్త్రీయమైన అవగాహన మనకు అందించారీమె.

ఈనాడు సామాజిక సమస్యల అవగాహన ఒక రచనకు జీవితాన్నిస్తే, శాస్త్రీయ దృక్పథం ఆ రచనకు చైతన్యాన్నిస్తుంది. చైతన్యం ప్రగతికి ప్రతీక. అలాంటి రచనలే మనకీనాడు కావాలి.

(కృష్ణాజిల్లా అరవ రచయితల సభలో)

## ఆ ధా ర గ్ర ం థా లు

1. లత సాహిత్యంలో భావవిప్లవం—డా॥ విద్యేశ్వరి.
   మరీచిక .... .... .... .... వాసిరెడ్డి సీతాదేవి
   మహతి .... .... .... .... యువభారతి ప్రచురణ వ్యాస సంకలనం.
   సమాజ శాస్త్రము - ప్రాథమిక సూత్రాలు - తెలుగు ఎకాడమీ ప్రచురణము.

# 9

# రచయిత్రుల నవలల్లో సామాజిక స్పృహ

కాలం పురోగమన శీలం కలది. కాలంతోపాటు సామాజిక విలువలు, తద్వారా రచనా విలువలు మారుతున్నాయి. ఈనాడు పద్యం స్థానాన్ని గద్యం క్రమంగా ఆక్రమిస్తున్నది. గద్యప్రక్రియ లన్నింటిలో అశేషజనాన్ని ఆకర్షిస్తున్న ఏకైక ప్రక్రియ నవల అంటే అతిశయోక్తి కాదు. ఈనాటి ఉత్పాద్యవచన సాహిత్య ప్రక్రియల్లో నవల మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందుతున్నది. 19 వ శతాబ్దంతోనే మనకీ సాహిత్య శాఖతో సంబంధం ఏర్పడినా స్వాతంత్ర్యానంతర దశకే అత్యంత ప్రాముఖ్యముంది. కనుక దీనికి నవలల యుగంగా విమర్శకులు వ్యాఖ్యానిస్తున్నారు. ఈ దశాబ్దికి చెందిన కొన్ని నవలల్లోని సామాజిక అవగాహనను అంచనా వేయడమే ఈ ప్రసంగ వ్యాసంయొక్క ఉద్దేశం.

ఆధునిక జీవితంలో అన్నిరంగాల్లోనూ వచ్చే వేగవంతమైన మార్పుల్నీ, వైవిధ్య పూరితమైన వాతావరణాన్ని చిత్రించేశక్తి ఒక ఉత్తమ నవలకుంది. ఇది ఎలాంటి భావాన్నయినా, ఎలాంటి వస్తువునైనా తనలో ఇమిడ్చుకోగలుతుంది. హెన్రీ జేమ్స్ చెప్పినట్లు నవల అనేది ఒక గృహం అనుకుంటే దానికి అనేకమైన గవాక్షాల కవకాశమున్నది. ఈ విశాల ప్రపంచంలో మానవ దృశ్యాల్ని విలోకించడానికి దేన్నయినా తెరిచి చూడొచ్చు. స్వేచ్ఛగా తాను చూచిన విషయానికొక రూపకల్పన చేయవచ్చు. డి. హెచ్. లారెన్స్ అనే విమర్శకుడు కూడా "నవలలో మీ కిష్టమైన వానిని ఏదయినా ఉంచొచ్చు. ఒకే విషయాన్ని అందులో చూపాలని ఎందుకనుకుంటారు? ఎప్పుడూ కోడి కూరేనా?" అన్నాడు. అంతమాత్రంచేత నవల వ్రాయడం నీళ్ళు త్రాగినంత సులభమని భావించకూడదు. ఒక్క విషయం మాత్రం నిజం. ఎక్కడ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హెచ్చుగా వుంటాయో అక్కడ బాధ్యతలు కూడా పదింతలు పెరుగుతాయన్న సత్యాన్ని మరువకూడదు. ఈ సత్యాన్ని ఆకళింపు చేసుకున్నవారు చాలా తక్కువ. చాలామంది రచయిత్రులు కాలక్షేపానికో, సరదాకో రచనల్ని కొనసాగిస్తున్నారు. రచన వ్యక్తిగతం అన్న భావం కొందరిలో

బాగా పాతుకొనిపోయి ఉంది. నిజానికి ఒక రచన వ్రాసేంతవరకే వ్యక్తిగత విషయం. ఒక్కసారి అచ్చయిందంటే వేలకొలది పాఠకుల ఆలోచనా సరళిపై తనప్రభావాన్ని చూపుతుంది. దానియొక్క మంచిచెడ్డలకు ఆ రచయిత్రే బాధ్యత వహించవలసి వుంటుంది. కనుక ఒక రచన చేపట్టినప్పుడు సాంఘిక బాధ్యతను మరిచిపోకూడదు.

కొందరు రచయిత్రులు తమ రచనల్ని కొన్ని తప్పుడు ఆదర్శాలకు అంకితం చేయడం జరుగుతున్నది. ఒకానొక ప్రసిద్ధ నవలా రచయిత్రి ఒక సభలో నవలను గూర్చి తన దృక్పథాన్ని ఇలా వివరించింది. "సామాన్యమైన మధ్యతరగతి గృహిణి నవల చదువుతూ కూతురు పెళ్ళి గురించీ రేషన్ గురించీ, క్షణ క్షణం వేధించే ఆర్థిక ఇబ్బందుల గురించి ఆలోచన మఱచిపోవటంవల్ల ఆమె మనస్సుకోమాటు ఊరట కలుగుతుంది. కాసేపయినా ఈ లోకంలోంచి మరో లోకంలో విహరించి తృప్తి పడుతుంది"—ఇలాంటి పలాయనవాద సిద్ధాంతాలు చాలా ప్రమాదకరం అని వేరుగా చెప్పవలసిన పనిలేదు. జీవిత సమస్యలనుండి పారిపోవడానికి, లేదా మరో లోకంలో విహరించడానికి నవలే సాధనం కానక్కరలేదు. లోకంలో ఏ మత్తు పదార్థమైనా ఆ పని అంతకంటే అధికంగా, అతి తొందరగా చేయగలుగుతుంది. చుట్టుముట్టి ఉన్న జీవిత సమస్యల్ని విస్మరింపజేసి మత్తులో ముంచడం కాదు నవల చేయవలసిన పని, ఆ సమస్యల విషవలయంనుండి తప్పించుకోవడానికి అవసరమైన చైతన్యాన్ని, ఆలోచనల్ని ప్రేరేపించగలిగిన ముడిపదార్థం అందులో లభించాలి. మరికొందరు రచయిత్రులంటారు. "సమస్యలకు పరిష్కారం సూచించి మనుష్యులను మార్చేపని రచయితది కాదు. అది సమాజం పని. వంటవాడి పని వండడం మాత్రమే. తినిపించడం కాదు. రచయిత బాధ్యతకూడా అలాంటిదే" తమ రచనలపట్ల ఒక లక్ష్యంగాని, ఒక సామాజిక పరమైన బాధ్యతను గాని గుర్తించలేని రచయిత్రులు మాత్రమే అలా అనగలుగుతారు. నిజానికి ఒక సమస్యను అత్యంత సహజంగా చిత్రించినంత మాత్రాన రచయిత బాధ్యత తీరదు. ఒక రోగి లక్షణాన్ని గుర్తించినంత మాత్రాన వైద్యుని బాధ్యత తీరదు. రోగం యొక్క మౌలిక కారణాన్ని కనిపెట్టి తగిన మందు వేసినప్పుడే రోగ నివర్తనం జరుగుతుంది. అట్లాగే ఒక సమస్యను విశ్లేషించి చూపి దాని మౌలిక కారణాలను పాఠకుల ముందుంచి, ఆ సమస్యకు పరిష్కారమార్గాల్ని చూపించినప్పుడే ఒక రచయిత బాధ్యత పూర్తవుతుంది.

కాని దురదృష్టవశాత్తు కొందరు రచయిత్రుల్లో ధనిక వర్గ జీవన విధానంపట్ల మానసిక బానిసత్వం బాగా కనిపిస్తుంది. ఓ అందమైన రాజశేఖరం, ఆరడుగుల పొడుగు, డబ్బువల్ల కలిగే ఒక విధమైన హుందాతనం, ఆయనకొక అందమైన సెక్రటరీ లేదా ఆయనంటే పడిచచ్చే పడతులు. అత్యంతాధునిక సౌకర్యాలతో కూడిన

భవనాలు, కార్లు, తోటలు, సేవకులు, ఫోమ్ పరుపులు, మెత్తని దివాన్‌లు, అవకాశమైతే హెలీకాప్టర్ ప్రయాణాలు, ఎయిర్‌కండిషన్డ్ రూములు —అనేక రంగుల రంగుల స్వప్నం. ధనికవర్గాల వారు ఇలాంటి నవలల్ని చదువుతూ తమ సిరి సంపదలతో పోల్చుకొని తృప్తి చెందుతారు. కాయకష్టం మీద ఆధారపడి బ్రతికే నిరుపేదలకు నవలా పఠనంతో సంబంధమే లేదు. కొందరు చదువగలిగినా ఓపికా తీరికా లేవు. ఇక పోతే ఆర్థిక విషవలయంలో చిక్కుకున్న మధ్యతరగతివారికి 'రమ్'లాంటిమత్తుమందిది. మత్తువదలగానే రంగుల స్వప్నంనుండి ఒక్కసారిగా మేల్కొని తమ లేమి తమను వెక్కిరిస్తుంటే నిరాశా నిస్పృహలకు లోనుకావడం కనిపిస్తుంది. ఒకసారి ఒక రచయిత్రి నన్ను ఇలా ప్రశ్నించింది. "ఈ దేశంలో ప్రతివ్యక్తికీ ఒక కారు, ఓ అందమైన ఇల్లు, ఉన్నతమైన ఉద్యోగం ఉండాలని రచయిత్రులుగా ఆశించడం తప్పా?" అని. అలాంటి వారికొక ప్రతిప్రశ్న. అసమానతల అంతరాలు అంతకంతకూ అధికమౌతున్న ఈ వ్యవస్థలో, అవకాశవాదం, అధికారదాహం, ఆత్మవంచన అందలమెక్కి చిందులు త్రొక్కుతున్న ఈ రాజకీయ ప్రపంచంలో కులతత్వాలు వేర్లు పాతుకొనిపోయిన ఈ సంఘంలో కేవలం ఊహించడం వల్ల ఆశలు ఫలిస్తాయా? ఊహాలకుండేది రెక్కలు మాత్రమే. అవి భూమిపై కాలు పెట్టవుకదా! కనుక ఈ ఆర్థిక సాంఘిక అంతరాల యొక్క అసలు రహస్యాల్ని బట్టబయలుచేసి, ఈ వ్యవస్థను మార్చగలిగే చైతన్యాన్ని ప్రజల్లో కలిగించడానికి ప్రయత్నం చేసినప్పుడే వారి ఆశలకొక రూపకల్పన జరుగుతుంది.

ఆధునిక స్త్రీ జీవితంలో జరుగుతున్న ఘర్షణకు, సమకాలీన సామాజిక వ్యవస్థకు మధ్యగల సంబంధాన్ని చాలామంది నవలా రచయితలు అవగాహన చేసికోకపోవడం చాలా విచారకరం. ఒక స్త్రీయొక్క ఆర్థిక సాంఘిక నిస్సహాయ స్థితికి ప్రేమ అనురాగం, త్యాగం అన్న సెంటిమెంట్ల ముసుగువేసి తండ్రి పైనో, భర్తపైనో ఆధారపడే ఆలంబన జీవితాన్ని ప్రోత్సహిస్తున్న రచనలు చాలా కనిపిస్తున్నాయి. స్త్రీ కోల్పోతున్న వ్యక్తిత్వాన్ని సహనం, ఓర్పు, ఆత్మత్యాగాల పేరుతో దాచిన మనస్తత్వాన్ని ప్రోత్సహిస్తున్నవే అధికం. ఈ స్థితినుండి స్త్రీకి విముక్తి కలిగించడానికి ప్రయత్నించిన రచనలు లేకపోలేదు. ఉదాహరణకు రంగనాయకమ్మగారి స్వీట్ హోమ్‌లో విమల యొక్క వ్యక్తిత్వపు ఛాయలు మనకీ విధంగా కనిపిస్తాయి, "మగవాడు ఎలాంటి వాడయినా ఆరాధనేనా నీకు. డర్టీక్రీచర్! నీ మొగుడు ఎక్కడ నిలబడమంటే అక్కడ నిలబడు, అతని వెనకాల పెంపుడు కుక్కలాగా తిరుగు. దయతో ఎంగిలి బిస్కెట్లు వేస్తాడు తిను, కోపంతో కాలిదొద్ది తంతాడు పడి ఉండు" ఇలాంటి తీవ్ర ధోరణుల్ని కొందరు రచయితలు వికృతి రూపం దాల్చిన స్త్రీ విమోచనోద్యమంగా, ఆత్మ న్యూనతాభ్రాంతిగా అభివర్ణించారు కాని, సమాజంలో స్త్రీ ఉనికినే విస్మ

రించే అవివేకులు, స్త్రీ వ్యక్తిత్వాన్నే అంగీకరించని పరమ ఛాందసులు, అలకపాన్పు మీద కోరిన కోరికలన్నీ మామగారు తీర్చలేదని తాళికట్టిన రోజే పెళ్ళాన్ని ఏలుకో నంటూ తిరుగు ప్రయాణం కట్టిన గంగిరెద్దు పెళ్ళికొడుకులు, భార్యల్ని అకారణంగా అనుమానించి చిత్రహింసల పాలుచేసే పరమ కిరాతకులు ఈ సమాజంలో ఉన్నంత వరకు విమలలకు కరుణలకు తిరుగుబాటు తప్ప గత్యంతరం లేదన్న విషయం ఈమె ధోరణివల్ల స్పష్టమవుతుంది. నిజానికి విమల యదార్ధవాదిని. స్త్రీ చైతన్యానికి ప్రతీక. స్వీట్ హోమ్‌లకు హాట్ హోమ్‌లు అవతరించినా, బుచ్చిబాబులకు పిచ్చిబాబులుసృష్టింప బడినా నిజం నిప్పులాంటిది. స్త్రీకి జరుగుతున్న అన్యాయాలు ముఖ్యంగా మధ్యతరగతి మహిళలకు సమాజం కల్పిస్తున్న సమస్యలు తక్కువేమీకావు. కనుక దీనిని castration complex అనండి, ట్రేడ్‌యూనియన్ స్పిరిట్ అనండి, లేదా వర్గపోరాట మనస్తత్వం అనండి, స్త్రీ పురుష అసమానతలు సాగుతున్నంతకాలం విమోచనోద్యమ జ్వాలలు ప్రజ్వరిల్లుతూనే ఉంటాయి.

స్వీట్‌హోమ్‌లో విమలది అతి ధోరణిగా కొంతవరకు మనం అంగీకరించినా "మీరంతా మంగళప్రదంగా పూజించే మాంగల్యం నాకు ఉరిత్రాడయింది. ప్రతి నిమిషం నాకు నరకాన్ని చూపింది. దాన్ని తెంచి పారేశాను, నేను చేసింది తప్పా ?" అని సమాజాన్ని సవాలు చేసిన వాసిరెడ్డి సీతాదేవి ఉరిత్రాడులోని కరుణలోగాని, "పసుపు తాడు పట్టుకొని దిగవిడిచి వచ్చేందుకు నేను మీ ఇంట పుట్టిన పాడియావును గాను" అంటూ దుష్ట సాంప్రదాయాన్ని ఎదిర్చిన "మారిన విలువలు" లోని జానకిలోగాని "నా దృష్టిలో పెళ్ళంటే తాళిబొట్టుకాదు. మనసులోలేని దానిని పైపైన ఎన్ని తగిలించు కొని ఏం లాభం ? నా నీతి సంఘం గిరిగీసిన సూత్రాలలో చిక్కుకుపోయేది కాదు" అంటూ తిరుగబడ్డ "అజ్ఞాత బంధాలు"లోని లలితలో గాని మనం గమనించేది వ్యక్తిత్వ నిరూపణమే కాని వికృతరూపం దాల్చిన విమోచనోద్యమ ఛాయలు మచ్చుకైనా కానరావన్నది స్పష్టం. ఏది ఏమైనా సమానత్వం సాధింపబడేవరకు ఈ సమరం తప్పదు. ఈ విమోచనోద్యమ ప్రభావం ఒక్క మన దేశ సాహిత్యం మీదనే కాదు, ప్రపంచ నవలా సాహిత్యం మీద దీని ప్రభావమున్నదన్న విషయం గమనించాలి.

ఇకపోతే సినిమాటిక్ సంఘటనల ప్రభావం చాలామంది రచయిత్రుల ఆలోచనా సరళిని ఆకట్టుకుంటున్నది. ఈ రకం నవలల్లో కథపట్ల ఆసక్తి పెంచే గుణం

కొంత ఎక్కువగానే ఉంటుంది. ఉదాహరణకు ఒక రచయిత్రి నిరుద్యోగాన్ని చిత్రించాలనుకొని యువతీ యువకులను ఆలంబనంగా తీసుకుందనుకుందాం. ఆ నాయికా నాయకులు ఉద్యోగాన్వేషణకు బయలుదేరే నేటి సమాజంలోని యువతీ యువకులే, కాదనలేము. కాని వారు నవలల్లో ఎదుర్కొంటున్న ప్రణయ సన్నివేశాలుగాని, మానసిక సంఘర్షణలుగాని, అనుభూతులుగాని, త్యాగాలుగాని, ఓర్పు సహనాలు గాని వాస్తవ ప్రపంచంలో చాలా అరుదుగా కనిపిస్తాయి. ఆ పాత్రలను పీడిస్తున్న సమస్యలు కూడా అందరికీ సంబంధించిన సామూహిక సమస్యలు కాక కేవలం వ్యక్తిగత సమస్యలు. ప్రేమ-పెండ్లి, ప్రేమ-విరహం, ప్రేమ-త్యాగం-ఇవి మాత్రమే జీవితం కాదు. ఇవి జీవితంలో ఒక భాగం మాత్రమే అని రచయిత్రులు గుర్తించాలి. నిజానికి జీవితం అన్నది ఏ నియమాలకూ లొంగదు. అదొక ప్రవాహం లాంటిది. ఎగుడు దిగుళ్ళతో అస్తవ్యస్తంగా సాగిపోతూ ఉంటుంది. నిజానికి నిజ జీవితంలో యాదృచ్ఛిక సన్నివేశాలు చాలా స్వల్పం. ఇవే పాఠకుల్ని ఆశలకు లోను చేసి దగా చేస్తూ ఉంటాయి. ఇంక కొన్ని నవలల్లో అసహజ సన్నివేశాలు, సంభాషణలు ఆ రచయిత్రుల అపరిపక్వమైన అనుభవాలకు అద్దంపట్టి చూపిస్తాయి. ఉదాహరణకు,ఒక నవలలో భర్తను అనుమానించిన ఒక భార్య మాటలివి. "మీ లాల్చీమీద కాటుక చారలు, బుష్ షర్టు మీద లిప్‌స్టిక్ ముద్రలు, మీ ఉంగరాల జుట్టులో ఇరుక్కున్న మల్లెపూలు. చెప్పండి ! నా అనుమానం అబద్ధమేనంటారా ?" — ఎంత తెలివి తక్కువ భర్తయినా పై వేషంతో భార్య దగ్గరకు వస్తాడా ? — సినిమాటిక్ ప్రభావానికిది సిసలైన ఉదాహరణం !

సంఘర్షణ - పోరాటం - చైతన్యం - విప్లవం లాంటి పదాలకు పదిమైళ్ళ దూరంలో ఉంటారు చాలామంది రచయిత్రులు. రాజకీయ పదజాలంగా వాటిని పరిగణించడం దానికి కారణం. నిజానికి సంఘ పరిణామాన్ని మన దైనందిన ఆర్థిక జీవితాన్ని ఎప్పటికప్పుడు నిర్ణయించే ఏకైక సాధనం రాజకీయం. కనుక రాజకీయాల నుండి సాహిత్యాన్ని సంపూర్ణంగా వేరు చేసి చూపాలనే ప్రయత్నం నిరర్థకం, నిష్ఫలం తప్పదు. కనుక మాకు రాజకీయాలతో పనిలేదు అని మన రచయిత్రులు మడికట్టుకుని కూర్చోవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. ఈనాటి రాజకీయ అవగాహనతో అందులోని బాగోగుల్ని ఎత్తి చూపి పాఠకులను చైతన్యవంతులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత రచయిత్రులు కూడా స్వీకరించాలి. నమత, మరీచిక, సంధ్యారాగం

వంటి నవలలు కొంతవరకు ఈ ఉద్దేశాన్ని నెరవేర్చడం ప్రశంసనీయమైన విషయం. కాని అలాంటివి వ్రేళ్ళమీద లెక్కపెట్ట గలిగినన్ని మాత్రమే ఉన్నాయి. ఈ రంగంలో రచయిత్రులకంటె రచయితల కృషి ప్రశంసించక తప్పదు. గోవు లొస్తున్నాయి, చీకటి రోజులు, ఈ దారి ఎక్కడికి, కొండగాలి. మావల్లెవంటి చాలా నవలలు రాజకీయ ఆర్థిక పోరాటాలకు ప్రతీకలుగా ఉన్నాయి. సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పుల్ని ఆకాంక్షించే సామ్యవాద సిద్ధాంతాల ప్రభావం ఇలాంటి రచనలమీద బాగా ప్రసరించింది. ఈ సంఘ ప్రవృత్తి కంతటికీ ఆర్థిక సమస్యలే మూలకారణం అన్న మార్క్స్ సిద్ధాంతం యొక్క ప్రభావం కొన్ని రచనలపై మాత్రం కనిపిస్తున్నది. ఇలాంటి రచనల్లో ధనిక పేదవర్గాలమధ్య పోరాటాలు, కార్మిక యజమాని సంబంధాలు, పెట్టుబడిదారులు - కూలీలు వీరి ఉదంతాలే వీటికి ఊపిరి. మొత్తంమీద ఆర్థిక, సాంఘిక సమానత్వం సాధించడమే వీరి ధ్యేయం. కొందరి అభిప్రాయంలో ఈ సమానత్వం ప్రకృతి విరుద్ధం. ఒకే తల్లి కడుపున పుట్టిన బిడ్డల్లోనే సమానత్వం సాధించలేం కదా, ఇక వ్యక్తుల మధ్య సమానత్వం ఎలా సాధించగలం. అంటారు వీరు. అసమానంగావున్న ఐదువ్రేళ్ళే వీరికి ప్రమాణం ! భౌతిక నిత్యావసరాలయిన భూములు,సంపదలు మొదలైన వస్తువుల్ని పంచడానికి వీలౌతుందేమో కాని, మానవుని అంతరంగిక విషయాలైన ప్రతిభ, కళ, సౌందర్యం మొదలైన వాటిని పంపకం ఎలా సాధ్యమౌతుంది ? కనుక సంపూర్ణ సమానత్వం సాధ్యం కాదని వీరివాదం. ఇక్కడ ఒక్క విషయం ఆలోచించాలి. ఈనాటి వ్యవస్థలో అర్థం ఎన్నో ప్రయోజనాల్ని నెరవేరుస్తుంది. అవసరమైతే విజ్ఞానాన్ని కొనగలశక్తి దానికీనాడుంది. ఏకుటుంబమైతే లేమితో బాధపడుతూ ఉంటుందో, ఆ కుటుంబ సభ్యులు శారీరకంగా మానసికంగా అభివృద్ధి చెందడం సాధ్యంకాదు. తమ పిల్లలకు సరైన ఆహారంగాని, పరిశుభ్రమైన మానసిక వాతావరణాన్ని గాని కల్పించలేరు. లేమితో బాధపడే వ్యక్తి తనను తాను తక్కువ అంచనా వేసుకొని ఒక విధమైన ఆత్మన్యూనతా భ్రాంతికి లోనౌతాడు. అతనిలోని సృజనాత్మక శక్తులన్నీ నశించిపోతాయి. అసమర్థత పెరుగుతుంది. అసమర్థత దారిద్ర్యానికి పుట్టినిల్లే కదా! దారిద్ర్యం ప్రతిభను పాతర వేస్తుంది ఇదొక విషమ వలయం. కనుక అర్థం ఒక్కటే మానవునిలోని ప్రతిభను పెంచుతాయని చెప్పలేము గాని, ప్రతిభను పెంచడంలో డబ్బు ముఖ్యమైన పాత్రను వహిస్తుందని చెప్పక తప్పదు.

(బందరు రచయిత్రుల మహాసభలో)

# 10

## సాంఘిక వ్యాసాలు

# ఆడవారు - అర్ధరహితమైన ఆచారాలు

ఇది "వైజ్ఞానిక యుగం" ఒకవైపు మన విజ్ఞాన శాస్త్రం రోదసిలోకి పరుగులు తీస్తుంటే, మన మనస్తత్వాలు మధ్యయుగాలకు మరలిపోతున్నాయేమో అనిపిస్తున్నది. ముఖ్యంగా ఈనాడు స్త్రీలు కొన్ని మూఢాచారాలకు, అంధ విశ్వాసాలకు అంకితమైపోవడం కనిపిస్తుంది. అడుగడుగునా వర్జ్యాలు చూడడం, పిల్లిఎదురొచ్చినా, పిల్లి ఎదురొచ్చినా, తుమ్మొచ్చినా అత్యవసరమైన పనయినాసరే వాయిదా వేయడం, ప్రతీ స్వల్ప విషయానికి పంచాంగాన్ని పఠించడం, సంతానం కోసం బాబాలను సేవించడం, అనారోగ్యాలన్నింటికీ అమ్మవారి ఆగ్రహమే కారణంగా నిర్ణయించడం, మడీ ఆచారాల పేరుతో మానవత్వాన్నేకించపరచడం - ఎన్నయినా ఇలాంటివి ఏకరువు పెట్టొచ్చు. వీటిని ఆచరించడంలో పురుషులకంటే స్త్రీలపాత్రే అధికం అన్నది ఆచరణలో మనం గ్రహించొచ్చు. దీనికి స్త్రీలలో వ్యాపించి ఉన్న అవిద్య, అజ్ఞానం, తరతరాలుగా వస్తున్న మూఢాచారాలు కారణాలని మనం కొంతవరకు సంజాయిషీ చెప్పుకోవడానికి ప్రయత్నించినా, ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే శాస్త్రజ్ఞానం కలిగి ఉన్న ఉన్నత విద్యావంతులైన స్త్రీలుకూడా ఈనాటికీ కొన్ని మూఢ సాంప్రదాయాల్ని పాటించే దౌర్భాగ్యం మనల్ని ఇంకా, ఈ వైజ్ఞానిక యుగంలో కూడా వదల్లేదంటే శోచనీయమైన విషయంగా భావించవలసిందే. ఒక గొప్ప పేరు పొందిన లేడీ డాక్టరు తన కుమారునికి జబ్బుచేస్తే మందుకు మారుగా ఏ "అమ్మ"నో ఆశ్రయించడం, లేదా

విజ్ఞాన శాస్త్రాన్ని బాగా ఆకళింపు చేసుకున్న ఒక విదుషీమణి తన కుమార్తెకు కలిగిన ముప్పుకు ముడుపులు కట్టడం కొన్ని ఉదాహరణలు మాత్రమే. అంటే ఈ ఆచరణ అర్థరహితమని తెలిసి కూడా ఇంకా పాటిస్తున్నామంటే తరతరాలుగా ఈ మూఢ నమ్మకాలు ఆచారాలు, కులతత్వాలు మనల్ని వాటికి బానిసలుగా చేసుకొని ఎంతగా మన జీవితాల్ని శాసిస్తున్నాయో వేరుగా చెప్పవలసిన పనిలేదు.

నోములు వ్రతాల పేరుతో వారానికి నాలుగు రోజులు ఉపవాసాలు చేయడం, అకాల స్నానాలతో అనారోగ్యాల్ని కొని తెచ్చుకోవడం, భగవదనుగ్రహం కోసం శరీరాన్ని గుడిచుట్టూ వందలసార్లు దొర్లించి హింసించడం, ఇలాంటి వెన్నో మన చుట్టూరా ఉన్న సమాజంలో మనం గమనిస్తూనే ఉన్నాం. ఈ వ్రతాలూ, నోములూ ఐశ్వర్యాన్ని, ఐదవతనాన్ని, ఆయుష్షునీ వృద్ధి పరుస్తాయన్న నమ్మకం మనలో పాతుకొని పోయింది. ఉదాహరణకు సత్యనారాయణవ్రత సందర్భంలో ఈ శ్లోకం పౌరోహితుడు పఠిస్తాడు.

"ప్రసాదం భక్షయేద్భక్త్యా, నృత్య గీతాదికం చరేత్
తతశ్చ స్వగృహం గచ్ఛేత్ సత్యనారాయణ స్మరన్
ఏవం కృతే మనుష్యాణాం వాంఛా సిద్ధిర్భవేద్ధ్రువమ్
విశేషతః కలియుగేల ఘూపాయోహ భూతలే"

సత్యనారాయణ వ్రత ప్రసాదాన్ని తిని, స్వగృహానికి వెళ్ళి సత్యనారాయణ స్వామిని స్మరించిన మానవులకు వాంఛాసిద్ధి కలుగుతుంది. కోరికలు నెరవేరడానికి కలియుగంలో సత్యనారాయణస్వామి పూజ సులభోపాయం. మోక్షాన్ని చేరడాని కిది దగ్గరిదారన్న మాట.

మంత్రాల్లో వల్లించే ఇలాంటి వ్రత కథలు, వరలక్ష్మీవ్రత కథలు ముఖ్యంగా ఆడవారికి అరచేతిలో వైకుంఠాన్ని చూపిస్తాయి. ఒక పేద స్త్రీ వరలక్ష్మీవ్రతం చేసిన మరుక్షణమే లక్ష్మీదేవి గలగల గజ్జెల చప్పుళ్ళతోవచ్చి ఇల్లు నిధుల్తో నింపుతుంది. మరొక మానవుడు సత్యనారాయణ వ్రతం చేయగా ఎప్పుడో మునిగిపోయిన సరుకుల ఓడ అల్లునితోపాటు ఒడ్డున ఆకస్మికంగా అవతరిస్తుంది. సావిత్రీ గౌరీవ్రతం చేసిన ఒక పతివ్రత భర్త రెండు గంటలు యమలోక ప్రయాణంచేసి తిరిగొస్తాడు. ఇలాంటి

అభూత కల్పనలు వాస్తవ పరిస్థితుల్ని మభ్యపెట్టి అక్రమంగా లభించే సంపదలపై ఆశల్ని చిగురింపజేస్తాయి. జీవితమనే పుష్పానికి ఆశతొడిమ వంటిది, కాదనలేము. కాని ఏమాత్రం పురుషకారం లేకుండా తలకుమించిన కోరికలపై ఆశల్ని పెంచుకొని అవి నెరవేరకపోతే, నిస్పృహకు లోనై జీవితాలనే నిరాశామయంగా చేసుకునేవారు ఎంతోమంది మనకు కనిపిస్తారు. నిజానికి అక్రమంగా అర్థాన్ని సంపాదించాలి అన్న భావమే సామాజిక విరుద్ధమైన భావంగా మనం పరిగణించాలి !

ఎక్కడో కాకతాళీయంగా జరిగిన ఒకటి రెండు సంఘటనలు ఆధారం చేసు కొని ఈ నమ్మకాలు ప్రవాహం చెందుతూ ఉంటాయి. నిజంగా ఆ మంత్రాలకే అంత శక్తి ఉంటే తరతరాలుగా మన స్త్రీలు చేస్తున్న పూజల ఫలితంగా మనదేశం ఇప్పటికే సుభిక్షమై సుఖ సంపదలతో తులతూగుతుండాలి ! ఆయుః ప్రమాణం పదింతలు పెం గాలి. అలాంటి ఋజువులేవీ అంతగా మనకు కనిపించవు. మనకంటేకూడా ఆయుః ప్రమాణం అధికంగావున్న ఇతర అభివృద్ధి చెందిన దేశాల స్త్రీలు ఏ వ్రతాల్ని ఆచ రిస్తున్నారు? ఆయుః ప్రమాణం మన దేశంలో మునుపటికంటే కొంత మెరుగైనా, అది విజ్ఞానశాస్త్రం యొక్క భిక్షే కాని వ్రతాల ఫలితం కాదన్నది స్పష్టం. కనుక మంత్రా లకు చింతకాయలు రాలవన్న విషయం మన స్త్రీలు గ్రహించాలి. వ్యక్తి సంపద, దేశ సంపద, ప్రజల ఆయుః ప్రమాణం పెరగాలంటే వ్రతాలూ, నోములూ పరిష్కార మార్గాలు కావు. విద్యా విజ్ఞానాలు దేశంలో ఇప్పటికంటే ఇంకా ఎక్కువ వ్యాపించాలి. ఆధునిక వైద్య సౌకర్యాలు పెరగాలి. దేశ సంపద కులమత వర్గ వర్ణ విభేదం లేకుండా అందరికీ అందుబాటులోకిరావాలి. సమానావకాశాలు అందరికీ కల్పించబడాలి. ఇలాంటి నిజమైన సామ్యవాద వ్యవస్థలో సకల దారిద్ర్యాలు తొలగిపోతాయి. అంతే కానీ కేవలం వ్రతాలు, నోములు వ్యవస్థని మార్చలేవు.

ఈ వ్రతాలపట్ల నమ్మకమున్నవారు తమ అభిప్రాయాన్ని ఈ క్రిందివిధంగా వ్యక్తం చేయొచ్చు. "ఆయుష్షుమాట, ఐశ్వర్యం మాట ఎలాఉన్నా ఈవ్రతానుష్ఠానం వల్ల ఆత్మ సంయమనం మనశ్శాంతి, కష్టాలను సహించే ఆధ్యాత్మికశక్తి, సామాజిక సంబంధాలు పెరుగుతాయి కదా, వీటిని ఆచరించడంవల్ల నష్టం ఏమున్నది? అయితే

అలా ప్రశ్నించేవారి కొక ప్రతి ప్రశ్న. ఈనాడు ఎంత మంది నిజమైన చిత్తశుద్ధితో, భక్తి భావంతో ఇవి జరుపుతున్నారు? కేవలం ఆడంబరానికి, సాంఘిక హోదాను చాటుకోవడానికి మాత్రమే ఈ వ్రతాలు చిహ్నాలుగా ఉంటున్నాయి. నిజం ఆలోచిస్తే డబ్బు, తీరిక పుష్కలంగావున్న ఉన్నతవర్గీయులలోనే ఆడంబరపూజా విధానం అమలులోఉంది. రెక్కాడితేకాని డొక్కాడని నిరుపేదల గృహాల్లోకి వరలక్ష్మీ దేవత కాని, సత్యనారాయణస్వామివారు కాని వెళ్ళడానికి వెనుకంజ వేస్తారు. కనుక వారు ఏ పోచమ్మ పండుగో, మైసమ్మ పండుగో, బోనాల పండుగో, గొంతెమ్మ పండుగో, వారి ఆర్థిక పరిధిలో వారు జరుపుకుంటారు. ఇకపోతే మధ్యతరగతి స్త్రీలలో ఒక గట్టి నమ్మకముంది. ఒక్కసారి ఈ వ్రతాన్ని ప్రారంభిస్తే ఎన్ని ఆటంకాలు కలిగినా దాన్ని కొనసాగించాలి అని. కనుక ఆర్థిక ఇబ్బంది ఉన్నా, సమయాభావం కలిగినా, క్రమం తప్పకూడదన్న భావంతో లాంఛనప్రాయంగా మాత్రమే ఆచరిస్తున్నారు. విద్యాధికులు, వైజ్ఞానిక వేత్తలైన స్త్రీలను కూడా ఈ లాంఛనం లొంగదీసుకోవడం శోచనీయమైన విషయం.

ఒక విషయం మనమిక్కడ గమనించాలి. దేవుడున్నాడా లేదా అన్న నమ్మకానికి, ఈ వ్రతాలకీ ముడి పెట్టవలసిన అవసరం ఎంతమాత్రంలేదు. ఆస్తికులై ఉండి కూడా ఈ తంతులపట్ల నమ్మకం లేనివారు చాలామంది ఉన్నారు. కష్టాలను ఎదుర్కోవడానికి ఆధ్యాత్మిక శక్తిని అలవరచుకోవడం కాదు మన జీవితానికి ధ్యేయం, కష్టాలను పారద్రోలే ఒక శాస్త్రీయ దృక్పధం యొక్క అవగాహన మనకీనాడు చాలా అవసరం. గ్రుడ్డి నమ్మకాలను కూకటి వేళ్ళతో కూలద్రోయాలి. ఒక ఆచారాన్ని మనం అనుసరిస్తున్నప్పుడు దాని ప్రయోజనాన్ని మనదృష్టిలో ఉంచుకోవడం ఎంతయినా అవసరం. అంతేకాని మా అమ్మమ్మలు అమ్మలు ఆచరించారు, మాకు కూడా ఆచరణీయం అన్న అభిప్రాయం నుండి మనం దూరం కావాలి. కొన్ని ఆచారాలు హాస్యాస్పదంగా కూడా కనిపిస్తుంటాయి. కొన్ని ప్రాంతాలలో సత్యనారాయణ వ్రత సందర్భంగా ఒక పిల్లిని పట్టితెచ్చి బుట్టక్రింద క్రమ్మడం ఆచారం. ఎప్పుడో వారి పూర్వులు వ్రతం చేసే సందర్భంలో ఒక పిల్లి ప్రసాదాన్ని అపవిత్రం చేసింది. వారుదాన్ని వ్రతం పూర్తయేవరకు క్రమ్మి ఉంచారు. తరువాత అసలు కారణం మరుగున పడి

పోయింది. పిల్లి ఆ ఇంట్లో ఉన్నా లేకపోయినా పట్టితెచ్చి వ్రత సందర్భంలో క్రమ్మడం అనవాయితి. ఎంత అర్ధరహితంగా సాంప్రదాయాల్ని ఆచరిస్తున్నామో అర్థం చేసుకోవడానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు.

ఇలాంటి మూఢ నమ్మకాలు, అర్ధరహితమైన ఆచారాలు స్త్రీల మనసు నుండి మాసిపోవాలంటే రచయితలు, సంఘసంస్కర్తలు నడుంకట్టాలి. రచయితలు ఇలాంటి విషయాలనెన్నింటినో అవగాహన చేసుకొని పాఠకుల మనసుల్లో ఆలోచనల్ని రేకెత్తించే బాధ్యతను తమ భుజస్కంధాలపై వేసుకోవాలి. అప్పుడే సామాజిక వాస్తవికతను సాధించగలరు.

# 11

# వివాహం - ఎంపిక

వివాహం ఒక నూరేళ్ళ పంట. ఆ పంటని ఫలవంతంగా మార్చడంలో భార్యా భర్తలిద్దరూ భాగస్వాములే. ఒక బండికి రెండు చక్రాల్లాగా, పక్షికి రెండు రెక్కల్లాగా సామరస్యం ఉంటేనే ఆ దాంపత్యం సమంగా ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుంది. కనుక ఒక వివాహ ఘట్టానికి పూర్వరంగం ఎంత పటిష్ఠంగా వుంటే వివాహ వ్యవస్థ అంత బలంగానూ, ఆరోగ్యదాయకంగానూ ఉంటుంది. ఆ పూర్వరంగానికి పునాది "వధూవరుల ఎంపిక".

ఈ ఎంపిక కొన్ని సందర్భాల్లో పరస్పర ప్రేమ ప్రాతిపదికగా జరుగుతుంది. ఇలాంటి వివాహాలు అయిదుశాతం మాత్రం జరుగుతాయి. కొన్ని విఫలమైపోవడం కద్దు. ప్రేమ వివాహాల్లో కుల మత వర్గ వివక్షకు తావుండదు. కేవలం ప్రేమే వారి వివాహానికి ఒక వరం కనుక వరకట్నం యొక్క ప్రమేయం ఇందులో ఉండదు. ఏ వివాహమైతే ప్రేమ సూత్రంతో బంధింపబడుతుందో,ఏ బంధమైతే "అనుబంధమే" ఆధారంగా నిలద్రొక్కుకుంటుందో అక్కడ ధన ప్రలోభాని కవకాశముండదు. కనుక ఇలాంటి ప్రేమ వివాహాల్ని ప్రోత్సహించే స్వచ్ఛంద సంస్థలు ఆ ప్రేమను వివాహ రూపంలో ఫలింపజేస్తే ఆ వివాహవృక్షం పుష్పించి, ఫలించి మూడుపూలు ఆరుకాయలుగా విలసిల్లుతుంది. నీరుపోసే నాధుడే కరువైనప్పుడు, శుష్కించి ఎండిపోతుంది.

ఇక్కడ యువత ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. ప్రేమ అనేది ఒక వరం లాంటిది. సాంఘిక బంధాలన్నింటికంటే అతి పవిత్రమైంది. నవ నాగరికత వెర్రి

తలలువేస్తున్న ఈ రోజుల్లో ప్రేమ ఒక "మైకంగా", ఒక "ఫ్యాషన్"గా మారి కాలక్షేపం కోసం, సరదాకోసం కలిసి తిరిగే తాత్కాలిక ఒప్పందంగా భావించబడుతున్నది. నైతికపతనంలో ఇద్దరూ భాగస్వాములే అయినా ఆడపిల్లే కష్టనష్టాలకు లక్ష్యంగా మారుతున్నది. పరస్పరం మనస్ఫూర్తిగా ప్రేమించుకొన్నామంటే సరిపోదు. వాస్తవిక దృక్పథంతో ఆ ప్రేమ ఫలించడంలో ఎన్ని అడ్డంకులు కలిగినా వాటినిదాటే ధైర్యం, నైతిక స్థైర్యం ఉంటేనే ముందడుగు వేయాలి. వివాహానంతరం కూడా సమాజం నుండి ఎన్నో సవాళ్ళు సహించవలసి ఉంటుంది. ప్రతిఘటన అనే పెను తుఫానుకు తట్టుకొని నిలబడగలమన్న దృఢవిశ్వాసం, నమ్మకం ఇద్దరికీ ఉన్నప్పుడే వివాహ ఘట్టాన్ని చేరుకోవాలి. లేకపోతే ఆ ప్రేమకు స్వస్తి చెప్పడం సమాజానికి అన్నివిధాలా ఆరోగ్యదాయకం.

ఒక శోచనీయమైన విషయమేమిటంటే విద్యార్థినులుగ ఉన్న యువతులకు జీవితంపట్ల ఒక ధ్యేయంగానీ, లక్ష్యంగాని లేదు. "కాలేజీ చదువు" అనేది పెండ్లి అనే పొగబండి కోసం నిరీక్షించడానికి అనువైన "ప్లాట్ ఫారమ్"గా భావించబడుతున్నది. సిగ్నల్ పడడమే ఆలస్యం, మూడుముళ్ళు వేయించుకోవడానికి సిద్ధంగా వుంటారు. ఈ విధంగా తన స్వంత అభిప్రాయాన్ని ఉట్టికెక్కించి, పెద్దవాళ్ల చదవమంటే చదవటం, వద్దంటే వెనకముందాడకుండా మానేయడం, ఇలాంటి గమ్యరహితమైన జీవితనౌక ఏ గాలివాటు కెటుపోతుందో ఎవరికి తెలుసు ?

మరికొందరు ఆడపిల్లల మనస్తత్వాలు అతివిచిత్రమైన స్వప్న స్థితిలో తేలిపోతూ ఉంటాయి. తమ చుట్టూవున్న డబ్బు ప్రపంచం, సినిమాలు, నవలలు—ఇవి వాస్తవ ప్రపంచానికి దూరంగా తీసుకొనివెళ్ళి పంచరంగుల స్వప్న లోకంలో తేలేటట్లుగా చేస్తున్నాయి. రాబోయే వరుడు అందంగా, ఆరడుగుల పొడుగుండాలి, ధనవంతుడై ఉండాలి. విద్యావంతుడు, మంచి సంస్కారవంతుడై ఉండాలి. అన్నిటిని మించి అతడు తనను అమితంగా ప్రేమించాలి. వాస్తవ విరుద్ధమైన ఈ కోరికల కలలు చెదిరిపోయి, తమ తాహతుకు తగిన సగటు ఉద్యోగితో జీవితం ముడిపడితే, ఊహల్లో ఉండలేక, వాస్తవాన్ని అంగీకరించలేక మానసికవ్యధకు గురౌతూ జీవితాల్నే నాశనం చేసుకునేవారు లేకపోలేదు. కనుక యువతులు వాస్తవికతలో జీవించడం నేర్చుకోవాలి. సమస్యల్ని ఎదుర్కొంటూ, వాటి పరిష్కారం కోసం ప్రయత్నం

చేయడంలోనే పరమార్థమున్నదని భావించిననాడు ఎలాంటి నిరుత్సాహానికి అవకాశ ముండదు.

తమ కుమార్తెల వివాహ విషయంలో వరుని ఎంపికలో తల్లిదండ్రుల మన స్తత్వాలు కూడా మారాలి. అయిదేండ్ల వయసు ఆడపిల్లను ముద్దుచేస్తూ "నాబంగారు తల్లికి డాక్టర్ని భర్తగా తెస్తాననో, చిట్టి తల్లిని ఇంజనీయరుకు ఇల్లాలిని చేస్తాననో" తాము కలలుకంటూ, వయసు పెరిగినకొద్దీ తమ బిడ్డ కలలు కనడానికి అవ కాశం కల్పిస్తూ, కోరిక నెరవేరకపోతే కృంగిపోయే తల్లిదండ్రులు కొందరుంటారు. కనుక ఆడపిల్లల ఆనందాన్ని కోరే తల్లిదండ్రులే అయితే, తాము వాస్తవంలో జీవిస్తూ తమ సంతానాన్ని వాస్తవంలోనే ఊపిరి పీల్చేటట్లు చేయాలి. తమ ఆర్థిక స్థితిగతుల్ని, సమస్యల్ని తమ సంతానానికి మభ్యపెట్టకుండా ఎప్పటికప్పుడు విప్పిచెపుతూ ఉండాలి. అలాంటప్పుడు వారిలో ఎలాంటి మిథ్యా గౌరవానికి చోటుండదు. వరుని ఎంపికలో అతడు గొప్ప విద్యావంతుడు కాకపోయినా సంస్కారవంతుడయితే చాలు తమ కూతుర్ని ఈయడానికి వెనుకాడకూడదు. డిగ్రీల సంపాదన సంస్కారానికి గీటురాయి కాదన్న సత్యాన్ని తాము తెలిసికొని తమ సంతానానికి తెలియజెప్పాలి.

సంప్రదాయ వివాహాల్లో వధువుయొక్క ఎంపికలో ప్రథమ ఘట్టం "పెళ్ళి చూపుల" తంతు. మనం సాంఘికంగా, వైజ్ఞానికంగా ఎంత పురోగమిస్తున్నామో, అంతకంటే పదింతలు తిరోగమన మార్గంలో పయనిస్తున్నాం తరాలు మారుతున్నా ఈ తంతులో మార్పులేదు. ఒక సంతలో పశువుల శ్రేష్ఠతను పరీక్షించవచ్చు. లేదా మార్కెట్టులో ఒక వస్తువుయొక్క నాణ్యతను నిర్ణయించవచ్చు. కాని వివాహ విపణి వీధిలో చైతన్యం మూర్తీభవించిన ఒక వధువు వ్యక్తిత్వాన్నే పణంగాపెట్టే ఈ పెళ్ళి చూపుల తంతు ప్రగతిశీలమైన మనజాతికే సిగ్గుచేటు. వధువు ఈ పెళ్ళిచూపుల తంతును ప్రతిఘటించడమే కాదు, ఈ తంతులో ఏకపక్ష నిర్ణయాధికారాన్ని, ఎంపి కను సవాల్ చేయాలి. తాను కూడా వ్యక్తిననీ, తనకూ ఇష్టాయిష్టాలు, అభిరుచులు, జీవితంపట్ల కొన్ని విలువలు ఉన్నాయని తెలియజెప్పాలి.

ఒక్కొక్కచోట వధూవరులకు ఈడూజోడూ కుదురుతుంది. కట్నానికి లోటు లేదు. పెట్టిపోతలకు కొదువలేదు. వధూవరులు ఒకరి నొకరు అంగీకరించారు. ఐనా "జాతకాల" భూతాన్ని తప్పించుకోవిదే పెళ్ళికావడానికి వీల్లేదు. ఆడపిల్ల ఆశ్లేషంలో పుట్టింది కనుక అత్తగారికి గండం, మూలలో పుట్టింది కనుక మామగారు మంచ

మెక్కుతారు, జ్యేష్టలో పుడితే పెద బావగారికి పరలోక ప్రయాణం ఖాయం. కుజ దోషం ఉంటే కట్టుకున్నవాడు గుటుక్కుమంటాడు. ఇది వధువుకే వర్తిస్తుందని. వరుడికి కుజదోషం వుంటే వధువుకు ఎలాంటి ప్రమాదం లేదు. అంటే నక్షత్రాలు కూడా పక్షపాతబుద్ధి పోనిచ్చుకోలేదన్న మాట. దేవగణం, మానవ గణం, రాక్షస గణం - వీటికి సంబంధించిన 27 అంశాలు వధూవరులకు సరిపోవాలి. ఏ ఒక్కటి సరిపోక పోయినా ఆ సంబంధం రద్దవుతుంది. ఇదీ జాతకాల భాగోతం! జాతకాలు సమగ్రంగా కలిసి శాస్త్రోక్తంగా జరిగిన వివాహాలు విచ్ఛిన్నం కావడం లేదా? అని ప్రశ్నిస్తే "ఆ దోషం జాతకానిది కాదు, జాతక రచనకీయబడిన సమయంలో వ్యత్యాసముందని" తప్పుకుంటారు. ఏ పాదంలో పుట్టినా ఏదో ఒక దోషం ఉండి తీరుతుంది. ఆ దోషానికి "శాంతి" సిద్ధంగా వుంటుంది మొత్తంమీద ఈ దోషాల నుండి తప్పుకోవాలంటే గర్భవతియైన తల్లి తిధి, వార, నక్షత్రాలు చూచి మరీ బిడ్డల్ని కనాలన్నమాట! ఈ విధంగా ప్రకృతి సిద్ధమైన పుట్టుకకీ, అశాస్త్రీయమైన జాతకానికీ ముడిపెట్టి, 'శాంతి' పేరిట 'ముడుపు' వదిలించుకొనే మూర్ఖత్వం ఈ వైజ్ఞానిక యుగంలో కూడా మనల్ని వదలలేదు. పంచాంగం రెండు భాగాలు. ఒకటి ఖగోళ స్కంధం. రెండవది జాతకస్కంధం. ఖగోళ స్కంధం ఒక శాస్త్రం. జాతకస్కంధం ఊహాజనితం. కనుక దాని ఫలితాలు కాకతాళీయం. కనుక కాతరు చేయవలసిన అవసరం లేదు.

వధువు ఎంపికలో కొందరు మగపిల్లల మనస్తత్వాలు పరిశీలిద్దాం. తాతల కాలంనాటి బూజుపట్టిన దుస్సాంప్రదాయాలకూ, ఫ్యూడల్ భావాలకూ వీరు అవశేష రూపాలంటే అతిశయోక్తి కాదు. వీరు పుట్టుకతోనే "బంగారు కడ్డీ"లుగా పరిగణింపబడుతూ ఉన్నత విద్యావంతులై భవిష్యత్తుకు బంగారు బాటల్ని నిర్మించుకుంటారు. వీరికి ఉన్నత విద్యావంతురాలైన భార్యగాని, ఉద్యోగం చేసే భార్యగాని అక్కరలేదు. భార్యకూడా ఉద్యోగం చేస్తూ "ఊళ్ళేలుతుంటే" గృహజీవితం అస్తవ్యస్తమై వృత్తిరీత్యా తమ భవిష్యత్తు దెబ్బతింటుంది. కాబట్టి సామాన్యమైన చదువు, కొంత లోక పరిజ్ఞానం ఉంటే చాలు, ఇంటినీ, పిల్లల్నీ చక్కదిద్దుకుంటుంది. మరొక్క విశేషం! చదువు లేకపోయినా చాలినంత కట్నం తేవాలి. అంత అందంగా లేకపోయినా అణకువగా వుంటే చాలు. విదేశాలకు పంపిస్తే మరీ మంచిది. అక్కడి వున్నత విద్యకవసరమైన ఆర్థిక భారం వహిస్తేచాలు, కానీ కట్నం అక్కరలేదు! విదేశాల్లో చదివించడమంటే ఆర్థికంగా వీధిన పడడమే!

ఈ ధనవ్యామోహం యువకుల్లో అంటుజాడ్యంలాగా వ్యాపిస్తున్నది. దీనికి కారణం మనం సులభంగా ఊహించవచ్చు. ఈ పెట్టుబడిదారీ సమాజంలో ఈనాడు వేలంవెర్రిగా చెలామణి ఔతున్న అక్రమ సంపద, నల్లడబ్బు, యువతకు వెర్రెక్కించి వ్యామోహంలో ముంచుతున్నాయి. అగ్నికి వాయువు తోడైనట్లు నవనాగరిక జీవనం పట్ల ఆసక్తి, విదేశీవ్యామోహం దానికి తోడవుతున్నాయి. కనుక ఏనాడయితే అక్రమ సంపాదన సాంఘిక నేరాల్లో ఒకటిగా పరిగణింపబడుతుందో, అవసరానికంటే ఎక్కువ డబ్బు కూడబెట్టడం సంఘవ్యతిరేక కార్యకలాపంగా ఎంచబడుతుందో, ఆనాడే ఈ "డబ్బు" పట్ల ఏర్పడ్డ "జబ్బు" మాయమౌతుంది.

వధువుయొక్క ఎంపికలో వరుని తల్లిదండ్రుల పాత్రకూడా చాలా ఉంది. వివాహం అన్ని వ్యాపారాల్లాగే ఒక వ్యాపారం. తమ కుమారునిపై తాము పెట్టిన పెట్టుబడి చక్రవడ్డీతోసహా రాబట్టాలి. కనుక వధువుకన్నా, వధువు తేబోయే కట్నంమొదట వచ్చాలి. ఈ "డబ్బు" అనే పాదరసం తగిలితేచాలు అనాకారి వధువైనా అందంగా మారుతుంది. బంగారు బొమ్మలా కనిపిస్తుంది. "మనీ" మహాత్యం మరి !

గత చరిత్ర అనుభవం ఎప్పుడూ మనల్ని ఆశావాదులుగానే ఉంచుతుంది. పరిశీలించిచూస్తే గతంలో ఏ సాంఘిక సంస్కరణోద్యమం కూడా విఫలంకాలేదు. ఆనాటి సతీ సహగమనం మొదలు మొన్నమొన్నటి అస్పృశ్యతా నివారణవరకు ప్రతీసాంఘిక సంస్కరణ వెనుక ఒక వీరోచిత పోరాటం నడిచింది. ఈనాటి వరకట్నం ఒక సాంఘిక ఆర్థిక సమస్య. మూఢనమ్మకాలు, మూఢాచారాలు ఒక సాంఘిక జాడ్యం. మనసులేని మనువులు, జాతకాల జాడ్యాలు, వరకట్న హత్యలు—అస్తిహక్కుచట్టం లోని లోపాలు—ఈ విషయాల్లో వివాహయోగ్యమైన వధువుకు కూలంకషమైన పరిజ్ఞానం ఉండాలి. తద్వారా చైతన్యం కలగాలి.

సమాజాన్ని ఈనాడు పట్టి పీడిస్తున్న ఈ జాడ్యాన్ని జయించడానికి కొన్ని సూత్రాల్ని నేటి యువత పాటించాలి.

1) ప్రాంత కుల మత పరిధుల్ని వదలి విశాల సమాజ సముదాయంలో వరాన్వేషణ జరగాలి.

2) కేవలం విద్యాధిక్యత సంపాదానికి గీటురాయికాదని ప్రతియువతీ, యువకుడూ గుర్తుంచుకోవాలి.

3) వరకట్నంకోరే వరుల్ని వధువులు తిరస్కరించాలి.

4) పెళ్ళిచూపుల తంతును ప్రతిఘటించాలి.

5) వివాహ సందర్భంలో వధువుకు స్థిరాస్తి రూపానగానీ, చరాస్తి రూపానగానీ సహోదరులతో సమానభాగం హక్కుగా చెందాలి. దానితో వరునకుగాని వరుని బంధువులకు గాని ఎలాంటి ప్రమేయముండరాదు.

6) యువత నిరాడంబర జీవన విధానాన్ని అలవర్చుకోవాలి.

7) వివాహాలలో ఆడంబరాల్ని తగ్గించి వ్యయంపై పరిమితుల్ని విధించాలి.

8) లాంఛనాలకు, సాంప్రదాయాలకు, మామూళ్లకు తిలోదకాలు వదలాలి.

ఇవేకాక సమాజం ఆర్థిక, సాంఘిక పరమైన మరికొన్ని మౌలికమైన మార్పులకు లోనైతే తప్ప ఈ వ్యవస్థకు అంటుకున్న అనేక జాడ్యాలు వదలిపోవు.

"తన భార్యను దాస్యంలో ఉంచే భర్తను నేను మరింతగా అసహ్యించుకుంటాను."

— ఇంగర్ సాల్

కుటుంబంలో ప్రజాస్వామ్యం ఉండాలని నా నమ్మకం.

కుటుంబంలో రాచరికం సాగరాదని నా అభిమతం.

స్వేచ్ఛ, సమానత్వం, ప్రేమలో నాకు విశ్వాసం ఉన్నది.

— ఇంగర్ సాల్